ప్రజలతో




ముఖ్యమంత్రి

# రాష్ట్ర ముఖ్యమంత్రితో మీరు మాట్లాడాలా? మీ కోసం ఒక వేదిక ఉంది. అదే... "ప్రజలతో ముఖ్యమంత్రి"

రాష్ట్రవ్యాప్తంగా నిరాటంకంగా కొనసాగుతున్న "ప్రజలతో ముఖ్యమంత్రి" కార్యక్రమం ఎన్నో సామాజిక సమస్యలను పరిష్కరించింది. 1997 ఏప్రిల్‌లో ప్రారంభమైన ఈ కార్యక్రమంలో ఎంతోమంది ప్రజలు స్వయంగా ముఖ్యమంత్రితో టెలిఫోన్‌లో మాట్లాడి సమస్యలను పరిష్కరించుకోవడం విశేషం. ఈ వినూత్న కార్యక్రమంలో ప్రజలు విలువైన సమయాన్ని వివేకవంతంగా వినియోగించుకోవాలి. సామాజిక సమస్యలతో పాటు, అభివృద్ధి పథకాలపై ప్రశ్నలు అడగాలి. పరిష్కారాన్ని అందుకోవాలి.

## ఒక ప్రత్యేక అంశం మీ అందరి కోసం దూరదర్శన్‌లో ప్రతి సోమవారం సా॥ గం.6.25 ని.లకు

### ఆలస్యమెందుకు...?

ఈ క్రింద టెలిఫోన్ నెంబర్లకు డయల్ చేయండి.

హైదరాబాద్ నుంచి : 23453229, 23453230

రాష్ట్రంలోని ఇతర ప్రాంతాల నుంచి : (040) 23453229, 23453230, 23453231, 98480-54343

**ప్రకటించిన అంశంపై ప్రశ్నలు అడగండి - పరిష్కారం పొందండి.**

జారీచేయువారు : సంచాలకులు, సమాచార, పౌర సంబంధాల శాఖ, హైదరాబాద్.

# హాసం

హాస్య - సంగీత పత్రిక

## ఇవీ సంగతులు

52

**Also available on net:**
**www.haasam.com**



**ముఖచిత్రం**
'మిస్సమ్మ' లో
భూమిక

## హాస్యం



'సెంటర్ స్ప్రెడ్' లో




సినిమా పాటల పుస్తకం



## సంగీతం



**పాటల ప్రత్యేకం**

71,72,73,74
పేజీల్లో






నేను 'హాసం'కు మొదటి నుండి పాఠకుణ్ణి. 1-15 నవంబరు సంచికలో అమ్మాయి మాధవి ఉత్తరాన్ని చూసి రూ॥ 1000/-కి (నెం.801564) చెక్కు పంపుతున్నాను. ఆ అమ్మాయికి నచ్చే, మెచ్చే పుస్తకాలకు ఇది వినియోగిస్తే సంతోషిస్తాను. ఇది ఎవరినీ చిన్నబుచ్చాలని కాదు. నేను కూడా మధ్యతరగతి వాడినే. భగవదనుగ్రహం వల్ల రిటైరయి సంతృప్తితో 62వ సంవత్సరంలో కులాసాగా ఉన్నవాడిని. వీలైనంత వరకు ధర్మ కార్యాలు చేస్తున్నాను. ఈ చిరు బహుమతిని ఆ చిరంజీవికి అందజేస్తే సంతోషిస్తాను.

**- పి.వి.కె.మురళీ మోహన శాస్త్రి, హైదరాబాద్.**

సెప్టెంబరు నెల ప్రథమ పక్షంలో విడుదలైన 'హాసం' పత్రిక 62 వ పేజీలోని సంగీత రహస్యాలు ('లా' పాయింటు) చదివాను. ఆసక్తికరంగా ఉంది. అయితే పాటలలోని సాహిత్యాలకు బదులుగా పలికే లలలాలాలలు ఎలా వచ్చాయి అనే దానికి ఆధారం లేదని వ్రాశారు ఆర్కే. దాని పైన నాకు తెలిసిన అభిప్రాయం వ్రాస్తున్నాను.

వేలాది సంవత్సరాలుగా తల్లులు లాలి పాడటంలోని అంతర్య శబ్దం అయిన 'ఉళుళాళాహాయి'. అనగా హుళక్కి అని ఈ జగతి అంతా వట్టి మాయ అని పదేపదే పలికే హుళక్కి శబ్దాల వరుస ఉళుళళలా అయినా హాయిగా పడుకోమని అంతర్యం. 'ళ' కన్న 'ల' అక్షరం నాలుకపై అవలీలగా పలుకుతుంది. ఈ నిరంతర శబ్దవిన్యాసం పసిపాపలను నిద్రకుక్రమింపచేస్తుంది. ఈ ఉళుళళాయే లాలిగా లాలనగా ఎంత లీలగా మనతో కలిసి పోయింది. తెలియని ఆ మాయ సాహిత్యానికి మనం పలికే స్వరం లాలాలాలాల. అలాగే 'త', 'న' అక్షరాలు మన శాస్త్రీయ సంగీతంలో 'తానం'గా ప్రాచుర్యం పొందాయి. అనంత అనంత అనంత అనంత అనే శబ్దాన్ని పదేపదే పలకటం వలన తానం పుట్టింది. ఇదే మన భారతీయ మనోధర్మ సంగీతం. తుంబుర నారదుల ప్రస్తావన విషయం కూడా కావచ్చు. అలాగే <u>తదిరినతోం</u> అంటూ సాగే సంగీత సభలోని అంతరార్థము నిగూఢమైనది. తత్+రిహ+అనంత+ఓం= తత్=అదే ఇహ=భువిలో అనంత=అనంతమైన ఓంకార నాదాను సంధానమైన సంగీతం. అనగా పరంధామ జనిత ఓంకారం ఈ భువిలో అనంతమై సాగుతున్నదని తెలియజేస్తూ రాగాలాపన చేయటం సంప్రదాయంగా వస్తోంది.

ఈ అనంత శబ్దమే లయం కాని లయలా, ఊయలలోని మాయలలీలలా, అందరి నాలుకపై అలా అలా అంటూ తానంగా, తదిరినగా పలుకుతోందని నా అభిప్రాయం. దయచేసి ఈ పద అర్ధ పరమార్థాన్ని మన హాసం అభిమానులకు అందిస్తే మరింత విషయ సేకరణ అవుతుందని నా అభిప్రాయం. **-వై.శివరామప్రసాద్, సంగీత విభాగం, ఉషాకిరణ్‌మూవీస్, రామోజీఫిల్మ్‌సిటీ**

51 వ సంచిక చూశాను. కశ్మీర్ కీ కలి చిత్రంలోని పాటలు ఇచ్చినందుకు చాలా సంతోషం. "ఒక్క మగాడు" పాట తాలూకూ పరిచయం, సిమ్రాన్ నటన అందరి గుండెలను ఊపేసింది. "నానుమ్ ఒరు పెణ్" తమిళ గీతంతో పాటు తెలుగుపాటని కూడా ప్రచురించి మాకు ఎంతో ఆనందాన్నిచ్చారు. ఈ పాటకు కన్నెకుడి వైద్యనాథన్ వయొలిన్ మీద ఇన్‌స్ట్రుమెంటల్ మ్యూజిక్ ఇచ్చినారు. వివిధభారతి తెలుగు, తమిళం, మన్ చాహే గీత్, ఆప్‌కీ పర్మాయిషీ అడగటానికి ఫోన్ నెంబర్లు, అడగవలసిన వారి చిరునామాలు తెలియజేయండి.

**-వాసుదేవ, అవనిగడ్డ**

సరిగపదమని ఆల్ కరెక్ట్ విజేతగా నాకు పంపిన పి.బి.శ్రీనివాస్ మెలోడీస్ డబుల్ ప్యాక్ సి.డి.లు అందినవి. చాలా సంతోషం. నేను 'హాసం' రెగ్యులర్ పాఠకుణ్ణి. పత్రికను చాలా బ్యాలెన్స్‌గా నిర్వహిస్తున్న మీరు ఎంతయినా అభినందనీయులు. 'హాసం' పత్రిక తన ప్రత్యేకతను నిలబెట్టుకుంటూ మున్ముందుకు సాగాలనీ ఆశిస్తూ..

**-ఎం.నర్సయ్య, పాల్వంచ**

నేను మీ'హాసం' అభిమానిని. ఈ పక్ష పత్రికను వార పత్రికగా చేస్తే బాగుంటుంది. ముఖ్యంగా సంగీతాభిమానులకు ఇది ఒక అపూర్వమైన కానుక. ఇప్పటి సినిమా సంగీతాన్ని జీర్ణించుకోలేక పోతున్న (కొన్ని పాటలు మినహాయించి) మాలాంటి వారికి ఈ పత్రిక నిజంగా ఎడారిలో ఒయాసిస్‌లాంటిది. ఇది ఇలాగే ఇంకా కొత్త పోకడలతో మా ముందుకొస్తుందని ఆశిస్తున్నాం. మీరు అందిస్తున్న పాత పాటలు మమ్మల్ని ఏవో లోకాలకు తీసుకుపోతున్నాయి. శ్రీ చిత్తరంజన్ గారి లలిత సంగీతం చాలా బాగుంటోంది. ఇంత మంచి పత్రికను మాకు అందిస్తున్న మీకు సర్వదా కృతజ్ఞులమై ఉంటాము.

**-మల్లెల లక్ష్మి, హైదరాబాద్**

నేను చెన్నాపురి వాసినైనా 'హాసం' చదివే అవకాశం నా తమ్ముడు ద్వారా లభించింది. కొన్ని నెలల క్రితం హైదరాబాద్ నుండి కొన్ని పుస్తకాలతో పాటు 'హాసం' ప్రతి కూడా పంపారాయన. మీ పత్రిక నన్ను ఎంతగానో ఆకర్షించింది. ఒత్తిడి వున్న రోజుల్లో హాస్యానికి ప్రాముఖ్యత ఇవ్వడం చాలా అవసరం. 'హ్యూమర్ బాక్స్' చక్కగా ఉంది. అయితే నాకు బాగా నచ్చినవి రాజా గారి వ్యాసాలు - పాత పాటలపై భాష రీత్యా, సంగీత రీత్యా అవి ఉన్నత స్థాయికి చెందినవి. విమర్శలు అతని గాఢమైన జ్ఞానాన్ని ఋజువు చేశాయి.

**-ఎ.సి. కేశవన్, చెన్నై**

'హాసం' పత్రిక చాలా రోజులనుండి చదువుతున్నాను. పాత, కొత్త సినిమాల పాటల పుస్తకాలు ప్రచురించటం నాకు చాలా సంతృప్తినిచ్చింది. పాట ఎవరు రచించారు, ఎవరు సంగీతాన్నిచ్చారులాంటి విషయాలను చాలా వివరంగా ప్రచురిస్తున్నారు. పత్రిక సకాలానికి అందజేస్తున్నందుకు చాలా థాంక్స్.

**-అరుణ్‌జీ, విశాఖపట్నం**

బస్ స్టేషన్‌లో కొన్న తొలి ప్రచురణే నా మనసుని కట్టిపడేసి చందా కట్టేలా చేసింది. చాలా మందికి 'హాసం' చిరునామా ఇచ్చి తెప్పించుకోమన్నాను. కెనడాలోని మాబంధువులకు కూడా 'హాసం' విందు అందించాను. ఎప్పుడో 35 సంవత్సరాల క్రితం మా మేనత్త సిన్మా చూశాక ఆ సిన్మా పాటల పుస్తకం కొని నంబర్లు వేసుకుని పెట్టుకునేవారు. అవి ఇంకా మా ఇంట్లో వున్నాయి. అవే సిన్మాలు మీరు అందిస్తుంటే ఆ ఆనందం హృదయానికి తప్ప మాటలకందనిది. వెన్నెలకంటి వెలుగులు ఆరుద్ర గారి త్రిశతి ని గుర్తు చేస్తున్నాయి. చదువుకున్న అమ్మాయిలు గురించి మీ 'హాసం'లో చదివి - ఆ రోజుల్లో ఆ సినిమాకు మా అమ్మగారు వెళ్తే కోర్టులో కేసువేయడం చేత ఆ సిన్మా చూపించలేదని వేరే సిన్మా చూసొచ్చానని పాత స్మృతులు గుర్తు తెచ్చుకుని సంబరపడ్డారు.

**-ఎస్.సీతాలక్ష్మి, మూలపర్రు**

నేను సాధారణంగా ఏజంటు ద్వారా బుక్స్ తెప్పించుకుంటాను. అతను 'హాసం' పత్రిక బాగా ఉందంటే 16-31 అక్టోబరు పత్రిక తెప్పించాను. చాలా హ్యాపీ ఫీలయ్యాను. మ్యాటర్ అంతా బాగుంది. జోక్స్, పజిల్స్ చాలా ఇంటరెస్టింగ్‌గా వున్నాయి. ఇక రెగ్యులర్‌గా పత్రిక తెప్పించుకుని చదువుతాను.

**-ఎస్.శివనారాయణ, రిటైర్డు ఆఫ్కో సూపరింటెండెంటు, కొత్తపేట**

సంపుటి: 3 సంచిక: 4

**16-30 నవంబరు 2003**

పేజీలు: 76

విడి ప్రతి : రూ. 10-00

సంవత్సర చందా: రూ. 200

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 50

జీవిత చందా: రూ. 2000

విదేశాలలో (ఎయిర్‌మెయిల్): $ 400

మేనేజింగ్ ఎడిటర్
**ఎమ్బీయస్ ప్రసాద్**

ఎడిటర్
**రాజా**

రిఫరెన్స్ కర్టెసీ
**డా|| కె.వి.రావు**
**జె.మధుసూదన శర్మ**

**HAASAM HAASYA SANGEETHA PATHRIKA**
Flat No. 502, Sri Balaji Nilayam
13-1-212, Motinagar,
Hyderabad-500 018
Ph: 2383 1388 / 5557 0215
*email:* haasammag@hotmail.com

Printed and Published by:
**K.I.Varaprasad Reddy**
On behalf of Hummus Infoway (P) Ltd.,
502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD - 500 018
Fax: 040-23541713

**Printed at:** Kalajyothi Process Ltd.,
1-1-60/5, RTC X Roads,
Musheerabad, Hyderabad-20,

**Published at:** 502, Sri Balaji Nilayam,
13-1-212, B.S.P. Colony, Motinagar,
HYDERABAD-500 018

**Editor: RAJA**

Marketed by:
Margadarsi Marketing Pvt Ltd.,
6-3-570, Eenadu Compound
Somajiguda, Hyderabad-82

The one and only Magazine devoted to Humour & Music



# హాసం

హాస్య-సంగీత పత్రిక

52

లతా మంగేష్కర్ జీవితచరిత్ర చదువుతున్న వారికి తెలిసే ఉంటుంది - ఆమెకు ఎంతో గొప్ప పేరు తెచ్చిన 'ఆయేగా ఆనేవాలా' పాట గ్రామఫోన్ రికార్డుపై ఆమె పేరు వేయనేలేదని! పాడినది 'మోహిని' అని ఉంటుంది. ఆ మోహిని ఎవరంటే తెరపై ఆ పాట పాడుతూ కనబడిన పాత్ర పేరు! 'మహల్' (1949) నాటికి ఉన్న పరిస్థితి అది. 'డబ్బిచ్చి పంపించేశాం కాబట్టి గాయకులకు ఆ పాటతో సంబంధం లేదు, క్రెడిట్స్ మనకు తోచిన విధంగా ఇవ్వవచ్చు' అని నిర్మాతలు అనుకునే రోజులవి.

ఆ పరిస్థితి తర్వాత మారింది. దానంతట అదే కాదు, గాయనీగాయకులు పట్టుబట్టడం వల్లనే మారింది. అంతేకాదు, ఆడియో కాసెట్స్‌పై రాయల్టీలో భాగానికి వారు అర్హులవునా కాదా అన్న విషయం పై తర్జనభర్జన జరిగింది. ఈ ఉద్యమానికి నాయకత్వం వహించినది, కడదాకా పోరాడినది లతామంగేష్కరే! తాము పాడడం వల్లనే ఆ పాటలకు అంత డిమాండు వస్తోందని, అందువల్ల తమకు కూడా రాయల్టీలో వంతు ఉందని వాదించి వాదించి చివరకు గెలిచిందామె! సరేనని అందరూ ఒప్పుకున్న తర్వాత కూడా ఆ వంతు పెరగాలని పంతంబట్టి, సహచరులతోనే సమరం సాగించి సాధించిందామె!

అప్పుడు ప్రధానంగా చర్చకు వచ్చిన విషయమేమిటంటే గాయకులు సృజనాత్మక కళాకారులా కాదా అని. సంగీతదర్శకులు ట్యూన్‌లు కట్టి ఇస్తారు కాబట్టి వారు క్రియేటర్స్ అనీ, వారికి రాయల్టీలో భాగం ఇవ్వవచ్చనీ ఒప్పుకున్న నిర్మాతలు, గాయనీ గాయకుల విషయం వచ్చేసరికి వారు కేవలం 'ఫెసిలిటేటర్స్' అంటే కార్యనిర్వాహణకు తోడ్పడేవారు మాత్రమేనని, వారికి రాయల్టీ అక్కరలేదనీ అభిప్రాయపడ్డారు.

అసలు అలాటి సందేహాలకు, సందిగ్ధాలకు తావులేని విభాగం - గేయరచన. కవిత్వం సృజనాత్మకతలోకి వస్తుందా రాదా అన్న ప్రశ్నే తలెత్తదు. రాయల్టీల జోలికి పోకుండా ఆలోచించినా ఈ గేయరచయితలకు తాము రాసినవాటికి కనీసం 'క్రెడిట్' దక్కుతోందా లేదా అని ఆలోచించబోతే సంతృప్తికరమైన సమాధానం దొరకటం లేదు.

ప్రస్తుతం జరుగుతున్నదేమిటి? సినిమాలో టైటిల్స్ చూపించినప్పుడు 'పాటలు' అనే కార్డ్ వద్ద ఇద్దరి, ముగ్గురి పేర్లు కనబడతాయి. ఏ పాట ఎవరు రాశారో స్పష్టంగా పేర్కొనరు. గేయరచయితలు కూడా ఈ విషయం పట్టించుకోకపోవడం, పట్టుబట్టకపోవడం విచిత్రం! ఆడియో కాసెట్సుపై రచన ఫలానా అని వేస్తున్నారు కదాని వీరు ఊరుకోవడం భావ్యం కాదు. చాలా సందర్భాలలో ఆడియో హక్కులు వేరేవారి వద్ద ఉంటున్నాయి. నిర్మాతలనుండి సరైన సమాచారం సేకరించి, తప్పులు లేకుండా సరిచూసుకోవాలన్న ఆకాంక్ష వారికి ఉండవలసిన అవసరం లేదు. పైగా వారికి ఈ గేయరచయితలతో, గాయకులతో డైరక్టు ఒప్పందం ఏమీ లేదు. పేరు తప్పుగా రాసినా, లేక తప్పుగా క్రెడిట్ చేసినా వారిని చేయగలిగేదేమీ లేదు. ప్రైవేటు సాంగ్స్ ఆడియో కాసెట్సుగా వచ్చినప్పుడు మాత్రమే ఆ సౌలభ్యం ఉంది. సినిమాలకు సంబంధించినంత వరకు టైటిల్స్‌లో చూపించినదే ప్రమాణం. చరిత్రలో నిలిచేది అదే . ఆ విషయంలో తగినంత శ్రద్ధను కనపర్చకపోవడం ఏ విధంగానూ అభిలషణీయం, సమర్థనీయం కాదు.

ఇదంత ముఖ్యవిషయమా అనుకునేవారు కొన్ని పాత విషయాలను గుర్తు చేసుకోవాలి. పాటల రచయితల పేర్లు తారుమారుగా ప్రకటించబడిన సందర్భాలు ఎన్నో ఉన్నాయన్న విషయం ఒప్పుకోవాలి. సమాచార సేకరణ ఎంతో సులభంగా ఉన్న ఈ రోజుల్లో కూడా ఇలాటివి జరగనీయడం సమంజసమా? చరిత్రను సవ్యంగా రికార్డు చేసి ఉంచాలన్న స్పృహ ఇదివరకు లేదు కాబట్టి మనం ఇప్పుడెంతో కష్టపడుతున్నాం. ఆ దిశగా పరిశోధనలపై ఎంతో సమయాన్ని, ధనాన్ని వెచ్చిస్తున్నాం. మన భావితరాలవారు కూడా మనలాగే అవస్థలు పడాలని అనుకుంటే తప్ప మనం ఈ పద్ధతి కొనసాగించ నవసరం లేదు.

'హాసం' పాటల పుస్తకాలలో ఆ వివరాలన్నీ ఇస్తున్నారు కదా అనేవారికి మా విన్నపం ఒక్కటే! రిలీజయిన సినిమాలన్నిటి పాటలనూ 'హాసం'ప్రచురించటం లేదు. మాకున్న పరిమితుల వల్ల ఎన్నో మంచిపాటల వివరాలు రికార్డు కాకపోవచ్చు. మరి ఆ పాటలు రాసిన కవుల సంగతేమిటి? హీరోకు మేకప్ చేసినదెవరో, హీరోయిన్‌కు హెయర్‌డ్రెస్ చేసిన దెవరో ప్రత్యేకంగా పేర్కొంటున్న ఈ రోజుల్లో ఏ పాట ఎవరు రాశారో క్రెడిట్ కార్డులో స్పష్టంగా చెప్పడం వల్ల నష్టపోయేదెవరూ లేరు. లాభపడేది మాత్రం ఆ యా గేయరచయితలు, వారి అభిమానులూ, సినిమాచరిత్రను అధ్యయనం చేసేవారూ! జనాన్ని జాగృతం చేసే పాటలు రాసే గీతరచయితలు సకాలంలో మేలుకుని, నిర్మాతలను ఆ విధంగా కోరితే బాగుంటుందని 'హాసం' అభిలషిస్తోంది.

# ఎల్బీ శ్రీరాం సినిమా తీస్తే...

- కర్లపాలెం హనుమంతరావు




(చిలకలపూడి ఎల్.బి.శ్రీరాం చిరంజీవితో సినిమా తీద్దామని కావిడిలో సినిమా కథలూ, నోట్ల కట్టల్తో సికిందరాబాదు స్టేషన్లో దిగాడు. నెత్తిమీదున్న జాడీలో ఏముందో దేవుడికూడా చెప్పనంటాడు... సరదాకోసంరాసిన స్కిట్ ఇది. ఇందులో ప్రస్తావించిన సినీ ప్రముఖులందరికీ కృతజ్ఞతలు)

(సికిందరాబాద్ రైలు స్టేషన్. బండాగింది అప్పుడే. ఆదరాబాదరాగా దిగాడు ఎల్బీ శ్రీరాం. భుజాన కావిడి. నెత్తిమీద జాడి. పల్లెటూరి బైతు వేషం. మనిషికి మాత్రం మాలావు రోషం)

పోర్టర్ లక్ష్మీపతి: కూలీ కావాలా సార్!

ఎల్బీ : మనమే ఒక కూలీ ఎదవలం... మనకింకో కూలీఎదవెందుకూ... దండగ. ఈ టేషన్ మనదేనా?

లక్ష్మి : (గొప్ప కోసం) మనదే. మనమే కట్టించాం.

ఎల్బీ : నువు కడుపుకు అన్నం తింటున్నావా?... గడ్డి తింటున్నావా?... రైలుబండికి ఇంతకిందగానా ప్లాట్‌ఫారం కట్టించేదీ! పుసుక్కుని పడితే ఆ నట్టం

నువ్వచ్చుకొంటావా? ఇంకో రెండు బొచ్చెలు సిమ్మెంటేసి దిమ్మసా కొడితే నీ సొమ్మేం పోతుందీ!... ఇంతకీ ఇదేం ఊరూ?

లక్ష్మీ :సికిందరాబాద్.

ఎల్వీ :అడ్డెడ్డే... దెబ్బయిపోయామే... మనం దిగాల్సింది హైదరాబాదు (మళ్ళీ బండెక్కపోతుంటే ఆపి...)

లక్ష్మీ :ఈ బండిక ముందుకుపోదన్నా... (ఫ్లైఓవర్ చూపించి) ఇదిగో... ఇట్లా మెట్లెక్కి... అట్లా దిగు. ఒకటో నెంబరు ఫ్లాట్‌ఫారం గుండా బైటికి పోవచ్చు.

ఎల్వీ :మనకేమన్నా వెంటలను కున్నావా... ఇట్లా ఎక్కి... అట్లా దిగటానికి... కాళ్ళ పీకులాట... మనమిట్లాగే బద్దీలు దాటిపోతాము.

(పట్టాలు దాటి పోలీసు గౌతం రాజును పట్టుకుంటాడు. ఫ్లాట్ ఫారానికెలాడే డిజిటల్ గడియారం చూపించి)

ఎల్వీ :ఆ నెంబరెంతా?

గౌతం:పదీ...

ఎల్వీ :అడ్డెడ్డే... మళ్ళీ దెబ్బయిపోయామే... మనమెక్కాల్సింది ఒకటో నెంబరు కదా!...

గౌతం:(పోయేవాడిని ఆపి) మన్దేవూరు ?

ఎల్వీ :సిలకలపూడి... బందరుపక్కది.

గౌతం:కనిపిస్తూనే వుంది. పేరేంటో?

(టీవీలోని క్రికెట్ కామెంటరీలో... ఎల్.బి.డబ్ల్యు.... ఎల్.బి.డబ్ల్యు... అని వస్తుంటుంది.)

ఎల్వీ :ఎల్.బి. డబ్బులు కాదు. ఎల్.బి.సీరాం...

గౌతం:కావిడిలో ఏవున్నాయి?

ఎల్వీ :సినేమా కతలు... సిల్లర నోట్ల కట్టలు. సిరంజీవితో సినిమా తీయాలనొచ్చాం.

గౌతం:కతలన్నీ మనం రాసినవేనా?

ఎల్వీ :అబ్బే... మనకంత మైండ్సెక్కడివీ... ఊళ్ళోని పిల్లకాయల తెలుగు బొక్కులు.







గౌతం:చూపించూ!...

ఎల్వీ :దొబ్బేద్దామనే... నోట్లు తప్ప ఇంకేవీ చూపించొద్దన్నాడయ్యా... మా బామ్మర్ది.

గౌతం:జాడీలో ఏమున్నాయి?

ఎల్వీ :చూపించొద్దన్నాడన్నానా... (టీ.సీ.అనంత్ వచ్చి)

అనంత్ : టికెట్ ప్లీజ్... టికెట్... టికెట్ చూపించవయ్యా!

ఎల్వీ :మనకింకోపాలి సెపరేట్‌గా బొట్టెట్టి సెప్పాలా సారూ! చూపించటం కుదర్దు... అట్లా పైకిపో...

అనం: తిక్కోడిలాగున్నావే... టికెట్ కొన్నావా అసలూ?

ఎల్వీ :మరదే మనకు మండేది. తిక్కోళ్ళమైతే రెండు తిక్కట్లెందుక్కొంటామయ్యా?

అనం :రెండా!.. రెండెందుకూ?

ఎల్వీ :ఒకటి హైదరాబాద్‌కి... ఇంకోటి ఫ్లాట్‌ఫారానికీ... సూడు!

(టీసీ లాక్కొని తక్కని పంచ్ చేసిస్తాడు.)

ఎల్వీ :నీయమ్మ కడుపుకాలా... బంగారం లాంటి రెండు తిక్కట్టులకీ బొక్కెట్టేసినావే! తొంభై మూడు రూపాయలు పోసి నిన్ననే బందరులో కొన్నా... అప్పుడే బొక్కెట్టేసినావే... సొమ్మన్నాకక్కు... కొత్తవన్నా కొనియ్యి.

అనం:తింగరిమేళం... తొందరగా బైటికి తెమలవయ్యా... (వెళ్ళిపోతాడు)

ఎల్వీ :బొక్కడ్డ తిక్కట్లతో బైటికిపోయేదెట్లాగురా దేవుడా!... (గోడమీదున్న వెంకటేశ్వరస్వామి పోస్టరుతో) నువ్వే దారి సూపించుసామీ!

(అప్పుడే వచ్చిన ఐరన్‌లెగ్ శాస్త్రి పక్కనే ఉన్న వెయింగ్‌మిషన్ మీదెక్కి టికెట్ తీసుకుంటాడు )

ఎల్వీ :అదీ మన ఎంకన్నసామి పవరంటే... తిక్కట్లిప్పించే ఉండీని నేరుగా ఇక్కడికే తెప్పించేసావా సామీ!... నాకూ ఆసేత్తోనే ఓ పావలా తిక్కట్టిప్పించవయ్యా పంతులూ!

ఐరన్ :పావలాకు టిక్కెట్టేంటయ్యా! రూపాయివ్వు.

ఎల్వీ :ఊరునుంచొచ్చామని ఎర్రోడనుకుంటున్నావా?.. సిలకలపూడి.. బందరు సరుకు... మాకూ శాస్తరం తెలుసులేవయ్యా... తప్పుకో!

(చెప్పులిప్పేసి... చెంపలేసుకుని... మిషన్‌చుట్టూ మూడుసార్లు తిరిగి... పావలా బిళ్ళేసి... భక్తిగా నిలబడతాడు) (చెప్పుల్తో శాస్త్రి మాయం!)

ఎల్వీ : నా సెప్పులు... నా సెప్పులు...

(దూరం నుంచి వి.హెచ్.పి. ఊరేగింపులో అరుపులు... జై శ్రీరాం!... జై శ్రీరాం! అంటూ)

ఎల్వీ : వస్తన్నా... వస్తన్నా... సెప్పులు కనపడక సస్తున్నా... జై సీరాం కాదయ్యా... ఎల్.బీ.సీరాం... (అంటూ బైటికిపోతాడు)

(స్టేషన్ బైట... ఆటోలో ఆలీతో)

ఎల్వీ : సిరంజీవి ఇల్లు తెలుసా?

ఆలీ : యూమీన్ జూబిలీహిల్స్?

ఎల్వీ : జూబిలీఇల్లుకాదు... సిరంజీవి ఇల్లు.

ఆలీ : య్యా.. పోలీస్‌స్టేషన్ పక్కనే ఉంటుంది... ఆటో కావాలా?

ఎల్వీ : ఎంతవుద్ది?

ఆలీ : రెండొందలు.

ఎల్వీ : (మీటరు చూపించి) ఈ గడియారంతో కూడా కలిపా?

సిలకలపూడిలో సైకిలు కూడా ఇంత సవగ్గా రాదే! కుర్రాడా! నువ్వెంతక్కొన్నావూ?

ఆలీ : అరవై వేలు.

ఎల్బీ : ఇంకో వెయ్యేసి ఆ నాలుగో సెక్కరం కూడా ఏయించుకోరాదా! ధర ఇంకాస్త పలుకుద్ది... వస్తా!

(ముందుకు పోతుంటే ట్రాఫిక్ పోలీసు ఎమ్మెస్ నారాయణ కనిపిస్తాడు)

ఎల్బీ : టైమెంతయిందీ?

ఎమ్మెస్: (వాకీటాకీలో మాట్లాడుతూ) వన్ మినిట్.

ఎల్బీ : వన్‌మినిటా.

ఎమ్మెస్ : కాదయ్యా (వాచీ చూసి) ఒకటీ... పది.

ఎల్బీ : మరందుకే మనకు మండేది. అయితే ఒకటవుద్ది... లేకపోతే పదవుద్ది... ఒకటీ... పదీ... రెండూ ఎట్లా అవుద్దయ్యా! (ట్రాఫిక్ సిగ్నల్ చూసి) నీడకోసం నీకీ గుంజే దొరికిందా?

ఎమ్మెస్ : గుంజకాదు... ట్రాఫిక్ సిగ్నల్.

ఎల్బీ : సిగ్గులా!... నడిరోడ్డు మీదే పాతేశావు... ఇంకే సిగ్గులూ! సేతిలోది పోనే కదా... సుబ్బారాయుడికోపాలి నెంబరు నొక్కు...

ఎమ్మెస్ : సుబ్బారాయుడెవరూ?

ఎల్బీ : మన కరెంటు మంతిరి (సిగ్నల్స్ చూపించి) మిట్టమజ్జాన్నం యేల అట్టహాసంగా... ఈ రంగు రంగుల దీపాలేందో...ఆ కతేందో... కనుక్కుందాం కరంటిట్టా కాల్తా ఉంటే ముక్కేమంతిరి ఏం సేస్తన్నాడో... ఆ ముక్కా కనుక్కుందాం. నెంబరు నొక్కు...

ఎమ్మెస్ : మందేపూరు బాబూ!

ఎల్బీ : సిలకలపూడి... బందరు పక్కది. సినిమా తియ్యాలనొచ్చాలే. సిరంజీవెక్కడుంటాడో తెల్సా?

ఎమ్మెస్ : తెల్సు ముక్కు మూసుకుని పక్కసందులోకిపో... పోస్టరుంటుంది అందులో ఉంటాడు మెగాస్టార్.

ఎల్బీ : మనక్కావాల్సింది పోస్టర్లో సిరంజీవి కాదసే...

ఎమ్మెస్ : అయితే... చెవులు మూసుకుని ఆ చెరువు కట్టెక్కు... ఎదురుగానే ఉంటుంది పెద్ద కటౌట్. అందులో ఉంటాడు నీక్కావాల్సిన చిరంజీవి.

ఎల్బీ : కట్ట అవుటు కాదయ్యా... మనక్కావాల్సింది మాట్లాడే సిరంజీవి

ఎమ్మెస్ : నోరు మూసుకుని నేరుగా ఆర్.టి.సి.క్రాస్‌రోడ్స్‌లో దిగు సప్తగిరి టాకీస్‌లో దాగూరుంటుంది. టిక్కెట్టుకొని కూర్చున్నావంటే మూడు గంటలపాటు మాట్లాడుతూనే ఉంటాడు సిరంజీవి.

ఎల్బీ : మదమెక్కి మాట్లాడతా ఉన్నావా... మనక్కావాల్సింది మనతో మాట్లాడే సిరంజీవి అంటే బుర్రకెక్కటం లేదా!

ఎమ్మెస్ : ఆ ముక్క ముందే చెప్పాలి. ఓ పనిచెయ్. ఎదరగా కనపడుతుందే ఫ్లై ఓవర్...

ఎల్బీ : ఏదీ... పిల్లకాయలాడుకొనే ఆ పెద్ద జారుడుబండా... అదెక్కాలా...

ఎమ్మెస్ : వద్దు... దిగు... ఆ పక్కనే ఉంటుంది టాంక్‌బండు... అదెక్కు.




ఎల్బీ : సరే ఎక్కా...

ఎమ్మెస్: కళ్ళు గట్టిగా మూసుకుని ముప్పై అడుగులు...

ఎల్బీ : ముందుకు నడవాలా... నడిచా...

ఎమ్మెస్ : కాదు... వెనక్కు పరిగెత్తు...

ఎల్బీ : (సంబరంగా) పరిగెత్తా. సిరంజీవి ఇంట్లో పడిపోతామా?

ఎమ్మెస్: కాదు... చెరువు నీళ్ళల్లో పడిపోతావు. ఆ నీళ్ళకి నీ కళ్ళు కుళ్ళిపోతాయి. చిరంజీవి ఐ బ్యాంకోళ్ళొస్తారు. వాళ్ళనడుగు... చిరంజీవి అడ్రసు కరెక్టుగా చెబుతారు.

ఎల్బీ : బాగా సెప్పావు. (జాడీ దించి బంతిలాంటిది తీసి ఎమ్మెస్ చేతిలో పెడుతూ) ఇదుంచు.

ఎమ్మెస్ : ఏంటిదీ? బాంబులాగుందే!

ఎల్బీ : బాంబే... ఇసరవాక... పేలిపోతావు.

ఎమ్మెస్ : (గజగజ వణుకుతూ) మరేం చెయ్యాలి?

ఎల్బీ : ఇట్టాంటివే సీమబాంబులు ఈ జాడీ నిండా ఉన్నాయని మీ పోలీసోళ్ళకి పోనుకొట్టు. చప్పున జీపుతో వచ్చేసెయ్యమను. ఆలీసెంసేస్తే జాడీ మొత్తం పేలిపోగలదు.

(జీపొచ్చి ఎల్బీ శ్రీరాంని తీసుకెళుతుంది)(పోలీస్‌స్టేషన్లో)

ఇన్‌స్పెక్టర్ జీవా: జాడీనిండా సీమబాంబులున్నాయన్నావు గదరా!... ఏవీ?

ఎల్బీ : సీమబాంబులంటే సీమలో తయారైన బాంబులు కాదు. సీమటపాకాయల్లాంటి బాంబులు. సిరంజీవితో సినిమా చేస్తన్నాం గదా... వందోరోజు కాల్చుకుందామని మొన్న దీపావళికి మిగిలిపోయిన వాటిని మోసుకొచ్చా... ఇవిగో! (చూపిస్తాడు) పోలీస్‌టేషన్ పక్కనే సిరంజీవి ఇల్లంటగా... రైలుటేషన్నుంచి ఫ్రీగా తెచ్చినందుకు... తేంక్స్...టా..టా.. (కావిడి...జాడీతో సహ హడావుడిగా పరిగెత్తి పారిపోతాడు)



# లలిత సంగీతం



ప్రముఖ గాయకుడు, స్వరకర్త
లలిత సంగీత విద్వాంసుడు,
వాగ్గేయకారుడు

## ఎం.చిత్తరంజన్

సమర్పిస్తున్న శీర్షిక ఇది.
ఫోన్ నెం. 040-27402993

**రచన**
శ్రీమతి జొన్నవాడ రాఘవమ్మ
**గానం**
శ్రీమతి సి.విజయలక్ష్మిశర్మ
**సంగీతం**
చిత్తరంజన్
**రాగం**
వకుళాభరణం (కర్ణాటక సం॥)
14 వ మేళకర్త రాగం
బసంత్ ముఖారి (హిందుస్తాని సం॥)
**తాళం**
చతురశ్రగతి (కర్ణాటక సం॥)
కహరువా (హిందుస్తాని సం॥)
**ఆరోహణ**
స రి గ మ ప ద ని స
**అవరోహణ**
స ని ద ప మ గ రి స

## నవ్వకే నెలవంక నవ్వకే



ప: నవ్వకే నెలవంక నవ్వకే
చల్లని నీ కాంతి జగతిపై ప్రసరింప ॥నవ్వకే॥
చ: చక్రవాకపు జంట చెలరేగినదిమింట
మిసిమి వెన్నెల సోన వసుధపై కురిపింప ॥నవ్వకే॥
చ: కలువ మొగ్గల సిగ్గుతెరల తొలగింపకే
కన్నెమనసుల వలపు తలపులను రేపకే ॥నవ్వకే॥
చ: తెలిమబ్బులను దాటి కళల సొగసును పెంచి
నిండు పున్నమి వేళ నిలువకే నా ముందు ॥నవ్వకే॥

షడ్జము, శుద్ధ రిషభం, అంతరగాంధారం, శుద్ధ మధ్యమం, పంచమం, శుద్ధ దైవతం, కైశికి నిషాదం యీ రాగంలోని స్వరాలు.

కర్ణాటక సంగీతంలో యీ రాగం ప్రచారంలో లేనిదిగా చెప్పవచ్చు. దీని తరువాతి మేళకర్త అయిన మాయామాళవగౌళ ఎక్కువ ప్రచారంలో వున్నది. వకుళాభరణం రాగం భక్తి, విరహ విషాదాలకు అనువైనది. హిందుస్తానిలో యీ రాగాన్ని బసంత్ ముఖారి అనే పేరుతో వ్యవహరిస్తారు. లలిత సంగీతంలోను, చలన చిత్రాలలోను కూడా యీ రాగాన్ని వాడడం చాలా అరుదుగా కనిపిస్తుంది. లలిత సంగీతంలో నేను యీ రాగాన్ని సుమారు ఏడు, ఎనిమిది గీతాలకు వినియోగించి బాణీలు కూర్చాను. "తిరుపతి పురవాసా శ్రీ వేంకటేశా" (రచన: పులికంటి కృష్ణారెడ్డి - బృందగానం), "నిన్ను కానని కనులు నాకు ఉండినను ఫలమేమిరా" (రచన: జొన్నవాడ రాఘవమ్మ) మొదలైనవి మచ్చుకుకొన్ని. చలనచిత్ర సంగీత దర్శకులలో శ్రీ సి.ఆర్.సుబ్బరామన్ "కలయిదని నిజమిదని" (దేవదాసు - గానం: ఘంటసాల) అనే గీతాన్ని వకుళాభరణం రాగంలో స్వరపరచి చరణం మధ్యలో కాకలి నిషాదాన్ని చేర్చి కొంత మిశ్రమం అల్పంగా చేశారు. 'లైలామజ్ను' చిత్రంలో కూడా సుబ్బరామన్ "రావో నను మరచితివో" (గానం: ఘంటసాల, భానుమతి) అనే పాటలలో వకుళాభరణ రాగాన్ని ఆధారంగా చేసుకుని అన్యస్వరాలను ఎక్కువగా మిశ్రమం చేశారు. ఆ పాటలెంతో జనాదరణ పొందిన విషయం అందరికీ తెలిసిందే.

నెలవంక వెన్నెలలకే తట్టుకోలేని విరహిణియైన ముగ్ధ నిండు పున్నమి కళల సొగసులను ఎలా ఓర్చుకుంటుంది? అందువల్లనే కలువ మొగ్గలను సైతం కలత పెట్టవద్దని, కన్నెమనసుల్లో వలపు తలపులను రేపవద్దని చంద్రుని వేడుకుంటుంది. కవయిత్రి రాఘవమ్మగారు సున్నితమైన భావాలను వెలార్చిన "నవ్వకే నెలవంక" అనే చక్కని విరహ గీతాన్ని నా సంగీత సారథ్యంలో విజయలక్ష్మి శర్మ మృదుమధురంగా గానం చేసింది ఆకాశవాణిలో.

యజుఃశాఖ శ్రీ వైష్ణవ సంప్రదాయ కుటుంబంలో జనకుంట శ్రీనివాసాచారి రాగమ్మ దంపతులకు 1928లో జన్మించారు రాఘవమ్మ. శ్రీమాన్ జొన్నవాడ వేదాంతాచారి వీరి భర్త. రాఘవమ్మగారి తండ్రి, సోదరులు రామాయణ భారత భాగవతాలను ప్రచారం చేస్తూ ఉండగా రాఘవమ్మగారికి కూడా ఆ గ్రంథాలు కరతలామలకాలు అయినాయి. అహర్నిశలు బాల్యం నుండి చేసిన భాగవత పారాయణ వీరిలో భక్తిని, కవితాశక్తిని పెంచాయి.

పాఠశాల చదువు లేకపోయినా ఆ చిన్నారి కృష్ణయ్య ఆమె దైనందిన జీవితాన్ని తనవైపు తిప్పుకున్నాడు. "నాకేమీ తెలియదు భక్తిగేయాలకు ప్రేరణ భాగవతం. నా రచనలకు పలుకునిచ్చినవాడు జగద్గురువు శ్రీ కృష్ణస్వామియే" అంటారీమె.



శ్రీమతి జొన్నవాడ రాఘవమ్మ

వైవాహిక జీవితంలో, కుటుంబ పోషణలో ఒడిదుడుకులు లేకుండా అప్పుడప్పుడు మిగిల్చిన డబ్బుతో ఒక పొలాన్ని కొని అందులో పూలు, పండ్ల మొక్కలు పెంచుతూ తీరిక సమయంలో గేయరచనలు చేశారు. 30 సంవత్సరాల క్రితం పాలమూరులో జరిగిన కవి సమ్మేళనంలో రాఘవమ్మ గారు పాల్గొనటం జరిగింది. మృదుమధురాలు, రసస్ఫోరకాలు అయిన రాఘవమ్మ గారి గేయాలు అప్పటినుండి రాగాలను సంతరించుకొని ఆకాశవాణిలో ప్రసారం కావటం ప్రారంభం అయింది. రేడియో కళాకారులు గాయకులు అయిన వేంకటగోపాలం గారి సహకారంతో 1972లో రాఘవమ్మగారి 48 గేయాలు 'రాధికాగీతాలు' అనే పేరుతో పుస్తకంగా



రూపుదిద్దుకోవటం జరిగింది. ఆ పుస్తకంలోని చాలా గీతాలకు నేను స్వరరచన చేశాను. చాలామంది గాయనీ గాయకులు ఆమె పాటలను ఆకాశవాణిలో తరచూ పాడుతూండేవారు. దూరదర్శన్‌లో కూడా రాఘవమ్మగారి పాటలు ఎన్నో ప్రసారమైనాయి. మహబూబ్‌నగర్‌లో నివాసముంటున్న ఆమెను రెండుమూడు పర్యాయాలు నేను కలుసుకోవడం జరిగింది. 1999లో నేను ఒక కార్యక్రమానికై ఆ ఊరు వెళ్ళినపుడు నా రాక గురించి తెలుసుకొని అస్వస్థురాలై వుండి కూడా ఆమె నన్ను చూడడానికి ఎంతో అభిమానంతో వచ్చారు. కృష్ణభక్తి తప్ప యితర మేమీ కోరని నిరాడంబర జీవి ఆమె.

శ్రీమతి రాఘవమ్మగారి గీతాలను చిన్న నాటి నుండి నేటి వరకూ తన సొంత బాణీలో వినిపిస్తున్న ఆమె తనయ శ్రీమతి ఖేడా జానకమ్మగారు ధన్యురాలు. నిరంతరం కృష్ణభక్తిలో తాదాత్మ్యం చెందే రాఘవమ్మగారు ప్రణయ, దేశభక్తి, ప్రకృతి గీతాలను మనోజ్ఞంగా వ్రాసినా, కృష్ణునిపై ఆమె రచించిన గీతాలలో ఆమె పారవశ్యం ఎక్కువగా మనకు గోచరమౌతుంది. "హృదయ కమలములోన నీ మృదు పదములను కనుగొంటిరా - యదుకులోద్భవ నంద సుత నీ పదములకు శరణంటిరా" అంటూ అనవరతం ఆ మురళీధరుని సేవలో జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న ఆదర్శ భక్తశిఖామణి శ్రీమతి రాఘవమ్మగారు ధన్యజీవి.

## వకుళాభరణం / బసంత్ ముఖారి రాగం
## ఆధారంగా కొన్ని చిత్రగీతాలు

| పాట | చిత్రం | గానం | స్వరకర్త |
|---|---|---|---|
| **తెలుగు** | | | |
| 1. కలయిదనీ నిజమిదనీ | దేవదాసు | ఘంటసాల | సి.ఆర్.సుబ్బరామన్ |
| 2. రావో నను మరచితివో | లైలామజ్ను | ఘంటసాల, భానుమతి | సి.ఆర్.సుబ్బరామన్ |

# మిస్టర్ పెళ్ళాం



దర్శకత్వం
బాపు

కథ-స్క్రీన్‌ప్లే-సంభాషణలు
ముళ్ళపూడి వెంకటరమణ

వెండితెర నవల

**8**

నవలీకరణ
ఇలపావులూరి మురళీమోహనరావు

**జరిగిన కథ**

బాలాజీ, ఝాన్సీ భార్యాభర్తలు. బాలాజీకి ఆడవారంటే చులకన భావం. బ్యాంకులో క్యాషియర్‌గా ప్రమోషన్ పొందిన రోజే మేనేజర్ చేసిన మోసం వల్ల క్యాష్‌లో లక్ష రూపాయలు తేడా వస్తుంది. సస్పెండ్ అవుతాడు. ఈ విషయం బయటకు పొక్కి, వేరే ఏ ఉద్యోగమూ దొరకదు. ఝాన్సీ తన కాలేజ్‌మేట్, గోపాల్ కంపెనీలో రికమెండ్ చేస్తానంటుంది. తన కథ తెలిసాక వాళ్లు పొమ్మంటారంటాడు బాలాజీ. అయితే తనే ఉద్యోగానికివెళతానంటుంది ఝాన్సీ. అలా అయితే తను ఇంటిపని చూసుకుంటానంటాడు బాలాజీ. నష్టాల్లో నడుస్తున్న గోపాల్ కంపెనీ లాభాల బాటలో ప్రయాణించే సూచనలివ్వటంతో ఝాన్సీని తమ కంపెనీలో కీలకమైన స్థానానికి ఎంపికచేసుకుంటారు. ఝాన్సీని పికప్ చేసుకోవటానికి వచ్చిన గోపాల్ బాలాజీతో మాట్లాడుతూ వుంటాడు.

-(ఇక చదవండి)

గోపాల్ కూడా పకపక నవ్వాడు. "నాకు కూడా పత్రికలలో వంటలపేజీ చూసి రకరకాల వంటలు చెయ్యడం హాబీ" అన్నాడు.

కేరింతలు కొడుతూ నవ్వాడు బాలాజీ. "అరె... నాక్కూడా సేమ్" అని బెడ్రూమ్ వైపు చూసి "ఝాన్సీ... పాపం ఆయన వెయిట్ చేస్తున్నారు" అన్నాడు. గోపాల్‌కు మరి కొంచెం దగ్గరగా జరిగి "... మీ కంపెనీలో జీతాలెలా ఉంటాయండీ? ఈ బేసిక్కులూ, అలవెన్సులూ లాంటివి చేరి?" అడిగాడు నిన్న తన భార్య చెప్పింది నిజమో కాదా అని నిర్ధారించుకుందామని.



ప్రతి భర్తా మొదటి తారీకు జీతం రాగానే భార్యకు తెలియకుండా ఎంత కొట్టేయాలా అని ఆలోచిస్తాడట! కానీ పాపం ఝాన్సీ ఉద్దేశ్యం మాత్రం వేరు.

" ఫర్ ఎగ్జాంపుల్... మన సివంగికిచ్చిన ఉద్యోగంలాంటిది ఉందనుకోండి..." చెబుతున్నాడు గోపాల్.

అతనెక్కడ నిజం బైటపెట్టేస్తాడేమోనని 'వచ్చేస్తున్నా వచ్చేస్తున్నా' అంటూ పరుగుపరుగున వాళ్ల మధ్యకు చేరి "సారీ గోపాల్.. లేటయింది... పద..." అన్నది గోపాల్ మాటలను త్రుంచేస్తూ.

తరలి వచ్చిన వసంతంలా హుందాగా, అందంగా కనిపిస్తున్న ఝాన్సీని గౌరవభావంతో చూశాడు గోపాల్.



"లేటేంటి ఝాన్సీ! నీలాంటి జీనియస్ ఎంత లేటుగా వచ్చినా ఫస్టే. కమాన్" అని బాలు వంక తిరిగి "వస్తానండీ... దోంత్ వర్రీ. షీ ఈజ్ ఇన్ గుడ్ హాండ్స్." చెప్పి బయటకు నడిచాడు. ఝాన్సీ కూడా గోపాల్ వెంట నడిచింది.

'అమ్మా అమ్మా నేనూ వస్తానమ్మా' అంటూ పిల్లలిద్దరూ తల్లి కొంగు పట్టుకుని నడిచారు. గోపాల్ కారు డోరు తెరిచి ఝాన్సీ కోసం చూస్తున్నాడు. సాక్షాత్తూ యజమానే అలా నిలుచోవడంతో ఝాన్సీలో కంగారు.

చంటాడిని ఎత్తుకుని ముద్దాడింది. "దోంత్ వర్రీ. దే ఆర్ ఇన్ గుడ్ హాండ్స్" అన్నాడు బాలాజీ ఎగతాళిగా.



"చంటాడికి ముందు పెరుగన్నం పెట్టాలి. తరువాత పప్పు కలపాలి. గుర్తుందిగా. లేకపోతే అల్లరిపెట్టేస్తాడు. విసిరేస్తాడు...వస్తానూ..." జాగ్రత్తలు చెప్పింది భర్తకు.

బాలాజీ వెక్కిరింతగా నవ్వి "యూ సిల్లీ మదర్. హే...పిల్లల పెంపకం గురించి నాకు సలహాలిస్తావా? చిల్డ్రన్... గో యిన్ హహహ... చిల్డ్రన్ ఆర్ చిల్డ్రన్" అన్నాడు స్టైల్‌గా గోపాల్ వంక చూసి.

కారు డోర్ డెరిచి అలాగే పట్టుకున్నాడు గోపాల్. అంటే... గోపాల్

పక్కనే ఝాన్సీ కూర్చోవాలి!

భార్య ఏం చేస్తుందా అని కోరగా చూడసాగాడు బాలాజీ.

"థాంక్స్" అని ఫ్రంట్‌డోర్ తెరుచుకుని కూర్చుంది ఝాన్సీ. బాలాజీ మనసు కుదుట పడ్డది.



ఔరా మగాడి సహజ గుణం! ఇంతలోనే ఎంత అనుమానం! అన్యాయం, అనుమానం ఆడవారి సొత్తంటారు కానీ మగాడిలో అంతకంటే ఎక్కువ పాళ్ళలోనే ఉంటాయి.

గోపాల్ బ్యాక్‌సీట్లో కూర్చోగానే డోర్‌ను ఫెడేల్‌మని మూశాడు బాలాజీ. డోర్ అంచులకున్న గ్రీజు బాలు చేతులకంటింది. బాలుకది తెలియలేదు. రిలీఫ్‌గా చేతులతో ముఖం మీది చెమటను తుడుచుకున్నాడు. ముఖం నిండా అంటింది గ్రీజు మసి.



తెలివితక్కువవాడు చెత్తని ఒకసారి తొక్కేసి నిర్లక్ష్యంగా ముందుకు సాగిపోతాడు. తెలివిగలవాడు తన కాలు తొక్కింది దేనినీ అని పరిశోధిస్తాడు. అంటే ముందు చేతితో రాసి దానిని ముక్కుదగ్గర పెట్టుకుని వాసన చూస్తాడు. ఆ విధంగా తెలివిగలవాడు కాలికి, చేతికి, ముక్కుకు అంటించు కుంటాడన్న మాట! పాపం... మన బాలాజీ కూడా అలాంటివాడే!

వాళ్ళు వెళ్ళగానే పిల్లల రెక్కలు పట్టుకుని లోపలకు లాక్కొచ్చాడు. ఇద్దరినీ సిపాయిల్లా నించోబెట్టాడు. తాను కమాండర్‌లా నిలుచున్నాడు.

అటెన్షన్... స్టాండిటీజ్... అనిపించి సెల్యూట్ చేయించాడు. "చిల్డ్రన్... చూశారుగా... అమ్మ ఆఫీసుకెళ్ళింది. ఈరోజు నుంచీ డాడీ కింగ్డమ్. అంటే నేను. అనగనగా ఒక రాజు. వాడే వీడు. మీరిద్దరూ నా ప్రజలు. నా చల్లని పాలనలో.." అంటుండగా పిల్లలిద్దరూ పకపక నవ్వడం మొదలెట్టారు.

బాలాజీకి కోపం వచ్చింది. "ఏంటా పిచ్చి నవ్వు? నా మొహం కోతిలా ఉందా?" అంటూ అద్దంలోకి చూశాడు. ముఖాన అంటిన నల్లని గ్రీజు మరకలు గమనించి ఉలికి పడ్డాడు. పిల్లవాడు 'గప్‌చుప్' అన్నట్లు వేలునోట్లో పెట్టుకున్నాడు.



"నో... నో...నో.. నోట్లో వేలు తీసెయ్" అన్నాడు బాలాజీ.

పిల్లాడు నోట్లో వేలు తీశాడు. 'దట్స్ గుడ్' గర్వంగా నవ్వాడు బాలాజీ. కానీ వాడు మామూలు బాలుడా? ముళ్ళపూడి వారి బుడుగాయె! ముఖం మీద కొట్టినట్లుగా ఈసారి నాలుగు చేతివేళ్ళు నోట్లోపెట్టుకున్నాడు.

దెబ్బతిన్నట్లు చూశాడు బాలు. "ఓహో....తిరుగుబాటా? ఇలాంటపుడు ఏం చెయ్యాలి..." అని ఆలోచిస్తున్నట్లుగా తానూ నోట్లో వేలు పెట్టుకున్నాడు. పిల్లలిద్దరూ నవ్వగానే గభాల్న వేలు తీసేశాడు బాలు.

రేడియోలో ఏదో ప్రోగ్రాం వస్తున్నది.

'ఇపుడు పిల్లల సంరక్షణ గురించి...' ప్రకటన వస్తున్నది.

'మ్యావ్.... మ్యావ్' అన్నారు పిల్లలు.

'కుమారి నాగమణిగారు..'

'మ్యావ్... మ్యావ్...' అన్నారు పిల్లలు మళ్లీ.

వాడి చిలిపి చేష్టలకు ముచ్చటపడి "పిల్లలు కాదర్రా.... పిల్లులు... ఐమీన్ పిల్లలు... " చెప్పాడు బాలు.



నాగమణి ప్రసంగం మొదలైంది "అరు నిమ్మకాయలు తెచ్చి... బాగా స్నానం చేయించి...."

పిల్లలను పెంచడం ఎలాగా అని ఆలోచిస్తున్న బాలాజీకి రేడియో ప్రసంగం వెతకబోయిన తీగ కాలికి తగిలినట్లుగా తోచింది.

'ఇపుడు మనం రేడియోలో బామ్మగారు చెప్పినట్టు చేద్దాం....ఏం?' అన్నాడు. 'నాకు స్కూలుకు టైమైంది. జడెయ్' అంది పెద్దమ్మాయి. 'అంతేకదా' అని నూనె చేతిలో పోసుకున్నాడు బాలాజీ. 'నాకూ జడెయ్' మారాం చేశాడు పిల్లాడు. బాలాజీ నవ్వి "నీకు జుట్టులేదు కదమ్మా" అన్నాడు పిల్ల తలకు నూనె రాస్తూ. 'ఉంది' అని గోల చెయ్యసాగాడు పిల్లాడు. వాడి గోలకు చెవులు పగిలి పోయాయి బాలాజీకి. ఇంతలో వంటింట్లో ఏవో గిన్నెలు కిందపడ్డ చప్పుడు వినిపించింది. వంటింట్లోకి పరిగెత్తాడు. స్టౌ మీది నుంచి పాలగిన్నె కిందపడ్డది. ఆ గిన్నెను ఎత్తబోగా చేతులు చుర్రున కాలాయి. గభాల్న దాన్ని వదిలేశాడు.



బాలాజీ అవస్థ ఇలా ఉంటే అక్కడ పిల్లలిద్దరూ కొట్టుకుంటున్నారు. 'అమ్మా' అని పిల్లాడు శ్రీకృష్ణుడు పాంచజన్యం పూరించినట్లు కంటిన్యువస్‌గా అరుస్తున్నాడు. అలా అరవవద్దని తమ్ముడిని మందలించింది పిల్ల. పిల్లాడు కోపంతో అక్క చెంపలు వాయించాడు. 'చూడు డాడీ తమ్ముడు కొడుతున్నాడు' కంప్లెయింట్ ఇచ్చింది పిల్ల.



అసలే పనిమీద పనితో కోపంగా ఉన్న బాలూ "కొడితే నువ్వు మళ్లీ చితక్కొట్టు" అన్నాడు. చీపురుతో నేలమీద కొడుతూ. దాంతో నేలమీద ఒలికిందంతా కళ్లలో పడింది.

'అబ్బా' అని అరిచాడు కళ్ళు నులుముకుంటూ.

పిల్లలు కొట్టుకుంటు న్నారు. రేడియో బడబడ చప్పుడు చేస్తున్నది. గరగరమని పెద్ద శబ్దాలు వినిపిస్తున్నాయి. బాలాజీకి సహనం నశించింది. చీపురుతో అలాగే హాల్లోకి వచ్చాడు. "రేయ్ గాడిదా... మగాడిదా... తప్పు...రా.. తప్పు...' అని విడదీసి పిల్లాడిని ఎత్తుకుని మూలనున్న బీరువామీద కూర్చోబెట్టాడు. " కదిలావో, బుర్రబద్దలౌతుంది. ఖబడ్దార్" అని హెచ్చరించి ఇవతలికొచ్చాడు.



రేడియోలో ఉపన్యాసం

వస్తున్నది. 'పాపకు చక్కగా చిక్కుతీసి దువ్వుతూ జడఅల్లాల్లి...' వినిపించింది.



బీరువా మీద కూర్చున్న బుడుగు 'అమ్మా' అని అరుస్తున్నాడు ధారగా.

కోపంగా బీరువా దగ్గరకెళ్ళాడు బాలాజీ. "నో... అమ్మ కాదు... డాడీ.. డాడీ అని ఏడువు" అరిచాడు.

"నో... నేను అమ్మా అనే ఏడుస్తాను" పెంకెగా అన్నాడు పిల్లాడు. "ఏడు..." అని పాప దగ్గరకు పరిగెత్తాడు. తలకు చిక్కు తీస్తున్నాడు. 'అబ్బా... నొప్పి" ఏడ్చింది పిల్ల.

ఇంతలో రేడియోలో - "పిల్లలు ఏడవటం సహజం. బాలానాం రోదనం బలం... అంటే పిల్లలకు ఏడుపే బలం. అది మనం పట్టించుకో కూడదు." వినిపించింది.



పిల్ల నొప్పితో ఏడుస్తుంటే అది సహజమే అనుకున్నాడు బాలాజీ. నానా అవస్థపడి చివరకు అస్తవ్యస్తంగా జడవేసి ముడేశాడు. బీరువాపైనున్న పిల్లాడు 'నన్ను దింపు... నన్ను దింపు' అని నానా భీభత్సం చేస్తున్నాడు. "ఏడువ్... ఏడువ్.. అదే బలం" అని పిల్ల జడను మరింత గట్టిగా ముడేశాడు బాలాజీ.

* * *

బీరువా మీద కూర్చున్న గడుగ్గాయి "అమ్మా... అమ్మా" అని పట్టువదలని బాలవిక్రమార్కుడిలా గొంతు చించుకుని అరుస్తూనే ఉన్నాడు.

ఇంతలో వాకిట్లోకి ఒక యువతి వచ్చింది. భుజాన వేలాడుతున్న సంచిలో ఏవో వస్తువుల తాలూకు శాంపిల్స్ ఉన్నాయి.



పిల్లల గోలతో చిరాగ్గా ఉన్న బాలాజీ కోపంగా వచ్చి "లేరు... నేనే మేడమ్‌ను. ఏం కావాలి? సేల్సా? నేనేం కొనను. గో.. గో.." కసిరాడు. సేల్స్‌గర్ల్ నవ్వి 'ఇది మీరుకొనే సరుకు కాదులెండి." అని వెళ్ళింది. ఇంతలో బీరువా మీదున్న పిల్లాడు దువ్వెన తీసుకుని విసిరాడు. అది సుదర్శన చక్రంలా సూటిగా వెళ్ళి యువతికి తగిలింది 'అబ్బా..." అని వెనుతిరిగి గుమ్మంలో నిలుచున్న బాలాజీని చూసింది కోపంగా. తాను కాదన్నట్లు దీనంగా చూశాడు బాలాజీ. కోపంగా వెళ్ళి పోయిందామె.



మళ్ళీరేడియో ఉపన్యాసం వినసాగాడు.

"ఇపుడు చాకు తీసుకుని..."

చాకు తీసుకుని నిలుచున్నాడు బాలు. అక్కడే పిల్ల కూర్చుని మళ్ళీ జడ వేసుకుంటున్నది. 'తీసుకుని?' అని డౌటొచ్చి ఆగిపోయాడు.

"సగానికి నిలువునా నరికి....."

"నరికి?" కత్తి పైకెత్తి అనుమానంగా చూశాడు బాలు.



"బాగా కలిపిన ఉప్పుకారం పరపరా రాసి"

బాలు అయోమయంలో పడి కత్తిని నిలువుగా పట్టుకుని కిందికి వంగుతున్నాడు. అది చూసి కంగారు పడ్డది పాప. "డాడీ.... చంపేస్తావా?" అన్నది భయంగా.

"ఉండమ్మా... నువ్వు కంగారు పడద్దు. నన్ను పెట్టాదు. డోంట్ పానిక్...డోంట్ పానిక్ డోంట్ పానిక్" అన్నాడు.



ఇంతలో నర్సయ్య చేత గిన్నె పట్టుకుని హడావిడిగా వచ్చాడు. "ఏవోయ్? ఈ పూట వంటేం చేశావోయ్?" అడిగాడు. "తగిలేశా" అన్నాడు బాలాజీ చికాగ్గా.

"పోన్లెద్దూ. నాకొక కప్పుడు కందిపప్పు అప్పిప్పిస్తావా?" అన్నాడు నర్సయ్య.

"ఇప్పిప్పించను. నాకొళ్ళు మండిపోతున్నది" కోపంగా అన్నాడు బాలు.

"ఖర్మ... ఇదే మా అమ్మదైతే కప్పుతో కప్పుడిచ్చి గుప్పెట్లో గుప్పెడిచ్చేది." అని వెళ్ళిపోయాడు నర్సయ్య.

బీరువా మీద కూర్చున్న పిల్లాడు పాత వస్తువేదో ఒకటి తీసుకుని నర్సయ్య మీదికి విసిరాడు అది వజ్రాయుధంలా నేరుగా వెళ్ళి నర్సయ్య వీపు విమానం మోత మోగించింది. బాలాజీయేం అలా విసిరాడనుకుని "అబ్బ... ఇవ్వనని ఇంకోసారి చెప్పొచ్చుగదయ్యా" కుయ్‌మని పారిపోయాడు నర్సయ్య.



అది చూసి బాలు నవ్వి "వెరీ గుడ్ బ్రదరూ... కొట్టు... ఇంకోటి కొట్టు..." అన్నాడు. పిల్లాడు పాత కరెంటు బల్బు ఒకటి తీసుకున్నాడు.

ఇంతలో స్కూలు రిక్షావాడొచ్చాడు. "అమ్మా... స్కూలు టైమయింది" అన్నాడు.

బల్బును వాడికేసి విసిరాడు పిల్లాడు. అది వెళ్ళి గడపకు తగిలి ఠప్పున పగిలిపోయింది. గాజుపెంకులు చిందర వందరగా పడ్డాయి. రిక్షావాడికి భయం వేసి పారిపోయాడు. బాలు పరిగెత్తి తలుపేశాడు.



ఇంకో పాత డబ్బా తీశాడు పిల్లాడు. అప్పటికే వాడి ప్రతాపానికి అదిరిపోయిన బాలు "చాలు.. ఇక చాలు... డబ్బా అక్కడ పెట్టు..." అని పిల్లాడిని దించి ముద్దాడి ఒరే బ్రదరూ.. ప్లీజ్... నన్ను కాన్సన్‌ట్రేట్ చెయ్యనీ" అన్నాడు. మళ్ళీ ఉపన్యాసం వింటున్నాడు.



''పొద్దుటే చన్నీళ్ళతో స్నానం చేయించి...''

''చేయించాం తల్లీ' అన్నాడు బాలు విసుగ్గా.

''ఉతికిన బట్టలు వేసి...''

''వేశామండీ' అరిచాడు బాలు.

రేడియో దగ్గరకెళ్ళి పిల్లాడు స్టేషన్ మార్చాడు. అక్కడ మరో ఉపన్యాసం వస్తున్నది. పిల్లాడు స్టేషన్ మార్చిన విషయం బాలు గమనించలేదు.



"తగినంత ఉప్పు కలిపిన ముక్కల్ని..." విన్పించింది. అర్థంకాక అటు ఇటు చూశాడు బాలాజీ.

"మూడో రోజున జాడీలో పెట్టి మూత పెట్టాలి..." తల బాదుకున్నాడు బాలు.

''ఇలా చేస్తే ఉప్పు కలిపిన ముక్కలు పుల్లగా కమ్మగా చాలా కాలం నిలవ ఉంటాయి...''

బాలు రేడియో దగ్గరకెళ్ళి దాని నెత్తిమీద గుద్దాడు. 'ఢా'మ్మని శబ్దంతో రేడియో ఆగిపోయింది.

పిల్లలిద్దరికీ చెరో కంచం ఇచ్చాడు. పప్పు వడ్డించాడు.

"నాకు పుప్ప వద్దు" అన్నాడు పిల్లాడు.

"పుప్ప కాదురా... పప్పు.." చెప్పాడు బాలు.

"పుప్ప' అని గట్టిగా అరిచాడు పిల్లాడు.



''తినరా... మింగు... కోపంగా అరిచాడు బాలు గరిటె తీసుకుని.

"పుప్ప" పిల్లాడు మళ్ళీ అరిచాడు.

బాలుకు ఏదో గుర్తొచ్చింది 'చంటాడికి ముందు పెరుగన్నం పెట్టాలి. తరువాత పప్పు పెట్టాలి. లేకపోతే అల్లరి పెట్టేస్తాడు. విసిరేస్తాడు." భార్య చెప్పిన మాటలు జ్ఞప్తికొచ్చాయి.

"ఏడిశాడు. మమ్మీకాదు. ఇది డాడీ రాజ్యం" మనసులో అనుకుని 'కలుపు' అని గద్దించాడు.



పిల్లాడు మరీ మొండిగా చేతులు కట్టేసుకున్నాడు.

బాలు తానే పప్పు, అన్నం కలిపాడు. "ముందు పప్పు తినాలి. ఆ తరువాతే పెరుగు... తిను." అని పిల్లాడి చెయ్యిని కంచంలో అదిమాడు.

ఉన్నట్లుండి పిల్లాడెందుకో బుద్ధిగా తలవంచుకున్నాడు. బాలు గర్వంగా ఫీలయ్యాడు.

వెనకటికెవడో సన్యా (న్నా)సి వీధి వెంట వెళ్తుంటే బారెడు కొమ్ములున్న గొర్రె పొట్టేలు ఒకటి ఎదురొచ్చిందట. దాన్ని చూసి సన్యాసి కుమ్ముతుందేమోనని భయపడుతుండగా గొర్రెపొట్టేలు క్షణం పాటు తలవంచిందట. ఆ గొర్రెపొట్టేలు తనను చూసి గౌరవిస్తున్నదని మురిసిపోతూ దీవిద్దామని చెయ్యెత్తాడట ఆ సన్యాసి. అంతే... మెరుపు వేగంతో వచ్చి సన్యాసి పొట్టలో కుమ్మటం, సన్యాసికి నక్షత్రమండలం కనిపించటం క్షణంలో జరిగిపోయింది. పందెపు పొట్టేలు మరో పొట్టేలుతో యుద్ధానికి దిగేముందు అలాగే తలవంచుతుందని అప్పుడు సన్యాసికి చెప్పారట ఎవరో.



మన బుడుగ్గాయ్ కూడా అలాంటి పొట్టేలు బాపతేనని తెలియక నవ్వుకున్నాడు బాలు. చేతనున్న పప్పు ముద్దను విసిరి తండ్రి ముఖానికేసి కొట్టాడు . బాలు నుదుట స్టిక్కర్ బొట్టులా అంటుకుపోయింది పప్పుముద్ద. దాన్ని చూసి పిల్లలిద్దరూ వెకిలిగా నవ్వారు. బాలుకు రోషం పొడుచుకొచ్చింది.

"రాస్కెల్... వేలెడంత లేవు. నీకే అంతపొగరుంటే నాకెంత ఉండాలి?" అని తానూ ఒక పప్పు ముద్ద చేతిలో పెట్టుకుని లేచాడు. పిల్లాడు బాలుకు అందకుండా అటు ఇటు పరిగెత్తుతున్నాడు. బాలు వాడివెంట పరిగెత్తుతున్నాడు. చివరకు పిల్లాడు వీధిలోకి పరుగుతీశాడు. బాలు కోపంగా పప్పు ముద్దను విసిరేశాడు. పిల్లాడు తప్పించుకున్నాడు. ముద్ద వెళ్ళి నర్సయ్యతో కలిసి తమ ఇంటికొస్తున్న ఆయన భార్య ముఖం మీద పిడకలా అంటుకుపోయింది.

* * *



అది ఒక స్కూలు. గంట మోగుతుంటే పిల్లలందరూ క్లాస్‌లకు పరిగెత్తుతున్నారు. వాచ్‌మన్ గేటు మూసెయ్యబోతుండగా పిల్లాడిని చావలా చంకనపెట్టుకుని పిల్లను బర బర ఈడ్చుకుంటూ రొప్పుతూ వగరుస్తూ వచ్చాడు బాలాజీ. పిల్లాడిని దించి గేటులోపలకు తోసి 'హమ్మయ్య' అని ఊపిరి పీల్చుకున్నాడు.

'అమ్మా' అని పిల్లాడు ఏడవసాగాడు. ఉలికిపడ్డాడు బాలాజీ. అపుడు గుర్తుకొచ్చింది అతనికి స్కూలుకు వెళ్ళవలసింది పిల్ల అని.



"ఒరేయ్... నువ్వేంట్రా అక్కడున్నావ్... బాబ్బాబు... నీకు దణ్ణం పెడతాను. ఒక్కసారి గేటు తియ్యి'' వాచ్‌మన్‌ను బతిమలాడి గేటు తీయించి పిల్లను లోపలదించి గబగబ బయటపడాలనే ఉద్దేశ్యంతో పిల్లాడిని లాక్కొన్నా పొరబాటున వాడితో పాటు పిల్లను కూడా బయటకు లాక్కొచ్చాడు. మళ్ళీ 'హమ్మయ్య' అని గాలి పీల్చుకుని చూసేసరికి ఇద్దరు పిల్లలూ బయటే ఉన్నారు.'అరె నువ్వేంటే ఇక్కడున్నావ్' అని పిల్లను కసిరి మళ్ళీ వాచ్‌మన్‌ను బతిమలాడి గేటు తెరిపించి పిల్లను లోపలకు తోశాడు.

ఒక్క పూట స్కూలుకు పిల్లలను పంపడానికి బ్రహ్మప్రళయమైంది. ఈ అవస్థ తన భార్య రోజూ పడుతుందన్న విషయం గుర్తుకు రాలేదు బాలాజీకి.

-(ఇంకావుంది)




నలభై ఏళ్ళుగా సినీ పరిశ్రమ
తీరుతెన్నులపై అధ్యయనం
చేసిన రచయిత, జర్నలిస్టు, నటుడు

# రావి కొండలరావు

రాసిన వ్యాసమిది



(ఆ పాతకాలపు తెలుగు మాస్టారు, అంతకుముందు, అంటే కొంతకాలానికి ఆచార్య ఆత్రేయగారిని కలుసుకున్నారు - తన శిష్యుడి ద్వారా. ఆత్రేయగారెవరో, ఆయనేల రాశారో ఏమీ తెలీదు మాస్టారికి పాపం. అసలు సినిమాల గురించే ఏమీ తెలియని వాడికి, ఆత్రేయ గారి గురించి ఏం తెలుస్తుంది? అంతకుముందు ఆరుద్ర గారిని కలిశారు - ఓ ఇంటర్వ్యూ లాగించేశారు. అలాగే ఆత్రేయగారు కూడా "మీ తెలుగు మాస్టారు, నన్ను కలిస్తే ఏమంటారు?" అని అడగడంతో, ఆయనతో నిజంగానే జరిగిన ఇంటర్వ్యూ ఇది)



"అయ్యా! నమస్కారము. ఇటీవలే నేను ఆరుద్ర అనే రచయితను కలుసుకున్నాను - ముచ్చటించడం జరిగింది. ఆయన కవిత్వాలూ, అదే అంతా ఆధునికం - సినిమా పాటలూ గట్రా రాస్తారుట. కొన్ని విన్నాను. తమరు కూడా సినిమాలకే రాస్తారుట కదా" అని అడిగారు మాస్టారు.

"అవునండీ! పాటలూ, మాటలూ రాస్తాను" అన్నారు అతి వినయంగా ఆత్రేయ.

"రెండూ మీరే! వేర్వేరుగా రాస్తూ వుంటారుట కదా, కొన్ని సినిమాలకి. అంటే, పాటలు ఒకరు, మాటలు ఒకరూ అలా. అవునూ, నాకు తెలియక అడుగుతాను - మాటలు రాసేవాళ్లు పాటలు రాయలేరండీ? మన ప్రసిద్ధ గ్రంథములలో పద్యములు, గద్యములూ వుంటాయి. రెండూ ఒకరే రాస్తారు. అలా రాయలేరా మీ సినిమా వారు?" అని అడిగారు మాస్టారు అమాయకంగా.

"రాయగలరనుకోండి. సౌలభ్యం కోసం - ఇంకొకరికి పని కల్పించడం కోసం అలాంటి ఏర్పాటు జరిగింది. దానివల్ల ఏదో ఒక దానిమీదనే మనసు నిలుపుకుని బాగా రాయవచ్చు గదా" అన్నారు ఆత్రేయ నచ్చజెపుతున్నట్టు.

"అంటే మీరు మనసు నిలుపుకుని రెండూ బాగా రాయలేరా?"

"అహఁ, అనికాదు! తీరికనిబట్టి రెండూ రాసేవారు రెండూ బాగానే రాస్తారు"

"ఈ సినిమాలకి రాకముందు తమరు నాటకములు రాశారుట. పౌరాణికములా?"

"కాదండి. సాంఘికాలు, ఎన్ జీ వో - అని నాటకం రాశాను"

"ఓహో! ఆంగ్ల భాషలో కూడా రాశారన్నమాట!"

"తెలుగేనండీ. ఎన్ జీ వో అంటే - నాన్ గజిటెడ్ ఆఫీసర్. తెలుగులో గుమస్తా. గుమస్తా అన్న పేరు కూడా వుంది ఈ నాటకానికి"



"డబ్బింగ్ నేమ్ అన్నమాట. అవునూ, తెలుగువాళ్ల కోసం, తెలుగు నాటకం అయినపుడు తెలుగు పేరే "గుమస్తా" అని వుంచవచ్చు కదా. ఈ ఇంగిలీషు పేరెందుకు?"

"పొరపాటయిపోయిందిలెండి మాస్టారూ. ఈ సలహా నాకెవరూ ఇవ్వలేదు. ఇప్పుడు మీరు చెప్పారు గనక, గుమస్తా అన్నపేరే ఉంచుతాను" అన్నారు ఆత్రేయ అతి వినయంగా.

"ఇంకా ఏమేమి రాశారు?"

"ఎవరు దొంగ? అని నాటిక రాశాను."

"సైలెన్స్! ఎవరు దొంగ? అని ఒక నాటకమా? 'ఎవరు దొంగ?' అని మీరు అడగడం ఏమిటి - రాసినవారు తమకి తెలీదా? ఆ దొంగెవరో? నాటకం చూసిన ప్రేక్షకులు చెప్పాలేమిటి తమకు? ఆఁ?"

"చెప్పక్కర్లేదు మాస్టారూ. ఆ పేరు అలా వుంటుంది."

"సర్లెండి. ఇలాంటి వన్నీ రాసి తమరు చిత్రములలో ప్రవేశించారన్న మాట. ఈ చిత్రములలో మీరు ముందుగా రాసినదేమిటి?"

"దీక్ష అన్న సినిమాలో 'మనుషులంటే వీళ్లేనా?' అన్న పాట రాశాను."

"సైలెన్స్! పాటా అది? 'మనుషులంటే వీళ్లేనా?' అని శుద్ధ వ్యావహారికంలో పాటా? ఏంబాగుందది? మాట్లాడుకుంటున్నట్టు వుంది గాని, రచనాశిల్పము, కవిత్వలక్షణమూ ఏవీ అందులో?" అని స్థాయి పెంచి అడిగారు మాస్టారు.

"మాటలూ పాటలూ అన్నీ వ్యవహార భాషలో వుంటేనే అందరికీ అర్థమవుతాయి. సినిమాలు అందరూ చూడాలిగదా. ప్రబంధాలు, గ్రంథాలూ కొందరే కదా చదవగలరు!... మాస్టారూ, మీరు 'మూగమనసులు' చూశారా?"

"సాంఘికమా! నేనీ సాంఘికములు చూడను"

"రక్షించారు. అందులో ఓ పాట ఉంది. అది వింటే ఇంకా తిడతారేమో మీరు!... "మానూ మాకును కాను - రాయీరప్పను కాను" అని రాశాను!"

మాస్టారి మొహం చేదుమందు మింగిన రోగి మొహంలా అయింది.

"సైలెన్స్ సైలెన్స్!... ఏమిటా పాట? ఏమిటా పాట?... రాయీ రప్పా అని మామూలుగా అంటాం. అది పెట్టి పాట రాయడం ఏమిటి - ఆఁ ... కడుధూర్తము! ఎవరైనా రాయగలరు కదా, దానికి తమవంటి నాటక రచయిత లెందుకూ?"

"సినిమా పాటలు జనం కోసం. అవి ఎంత సింపుల్‌గా వుంటే అంత ప్రాచుర్యం పొందుతాయి"

"సర్లెండి. ఈ సినిమాలు చూడని వాడికి నాకెందుకు మధ్య?" అన్నారు మాస్టారు 'పోనీ' అని తగ్గి.

"అన్నట్టు మాస్టారూ, "వెంకటేశ్వర మహాత్మ్యం" అన్న సినిమాకి నేనో పాట రాశాను. పౌరాణికం. చూసివుంటారేమో తమరు!"

"ఆఁ.... అవునవును... చూశాను. బావుంది. మీరు అటువంటి పురాణ చిత్రములకే రాయండి. 'మానూ మాకూ' అంటూ సాంఘికముల్లో రాసి పేరు పాడుచేసుకోకండి..."

"అలాగే - మంచి సలహా"

"అవునూ - ఆచార్య అని వుంది తమ పేరులో. తమరు కాలేజీలో గట్రా ప్రొఫెసరా?" అని అడిగారు - అమాయకంగా.

"కాదండి! నా పేరులో వెనకాల వున్న ఆచార్యని ముందుకు నెట్టాను"

"ఓహో - ఆత్రేయాచార్యా అని తమపేరా?"

"కాదు మాస్టారూ. నా పేరు నరసింహాచార్య. ఆత్రేయ గోత్రనామం"

"ఓహో!... ఆ గోత్రనామాన్నే తమ నామధేయంగా మార్చుకున్నారన్నమాట. ఆయనెవరూ, ఆరుద్ర - ఆయన తన జన్మనక్షత్రాన్నే పేరుగా మార్చుకున్నట్టుగా - తమరు గోత్ర నామాన్ని పేరుగా మార్చుకున్నారన్నమాట... అవునూ ఎందుకిలా మీ సినిమా వాళ్లు పేర్లు మార్చుకుంటారు? అల్లసాని పెద్దన, బమ్మెరపోతన,శ్రీనాథుడు - వీరెవరూ పేర్లు మార్చుకోలేదే! ఆఁ?"



"వాళ్లు మార్చుకోలేదు గదా అని, మేం మార్చుకుంటున్నాం లెండి. ఐనా, సినిమాల్లో నటీనటులు కూడా పేర్లు మార్చుకుంటారు మాస్టారూ!"

"అలాగా! అయితే, నాగేశ్వర్రావు, సావిత్రి ఈ పేర్లు వాళ్ల సొంత పేర్లు కాదా?"

"అవి సొంతపేర్లే. శోభన్‌బాబు, శరత్‌బాబు, జయంతి - ఇలాంటి పేర్లు మార్చుకున్న పేర్లు"

"సర్లెండి - నాకెందుకు? మీరెలా మార్చుకుంటే నాకేంగాని - ఇప్పుడు మీరు విరివిగా సినిమాలు రాస్తున్నారా?"

"రాస్తున్నాను. ఎక్కువగా పాటలు"



"అవును అవే రాయండి. అవే కావాలంటున్నారు కదా! జనులకి! "రా - ఇక్కడ కూచో - నిలబడు..." అన్నట్టు పాట రాస్తేనే, అది సినిమా పాట. సాహిత్యం, చట్టుబండలూ ఏమీ అక్కర్లేదు. మరి, మీరు ఎందుకూ రాయడం? పామరులెవరైనా రాయవచ్చునే"

"పోనీ మాస్టారూ, తమరు రాస్తారా ఏదైనా పాట - సాహిత్య విలువలుగల పాట?... డబ్బు ఇస్తారు"

"నాకేం అక్కర్లేదు. నేనిలాంటి సాంఘికాలకి రాయను. ఆ కథలూ గట్రా నాకు నచ్చవు. ఓ ఇద్దరు ప్రేమించుకోడాలూ, మధ్యలో తండ్రులు అడ్డు పడ్డాలూ - ఈ పిల్లదీ పిల్లవాడూ తలిదండ్రుల్ని ఎదిరించి పెళ్లిచేసుకోడాలూ - ఇవే కదా మీ సినిమా కథలు? జనానికి ఇవే కదా మీరు నేర్పుతున్నారు? అలాంటి సినిమాలకి రాయడానికి మీరే తగును, మీరే సమర్థులు!... అసలు సినిమా అంటే తెలియనివాడికి నాకెందుకు పాటలూ గట్రా?... మీరే రాసుకోండి." అన్నారు మాస్టారు, కొంత కోపం, కసీ మిళాయించి.

అంతలో జగ్గయ్యగారు అటువచ్చారు - షూటింగ్‌లోవుండి. అంచేత మేకప్‌లో వున్నారు. ఆత్రేయగారు జగ్గయ్యగారిని పరిచయం చేశారు.

ఒక్కసారి, మాస్టారి ముఖం కాంతులతో వెలిగింది. లేచి, ఆయనకు నమస్కారం పెట్టి - "ఆహా! ఎన్నాళ్లకెన్నాళ్లకు!.. తమవంటి మహానటుల దర్శనం ఇంతకాలమునకు లభించింది" అన్నారు మాస్టారు అమిత సంతోషంగా.

"చాలా సంతోషం మాస్టారూ!" అన్నారు జగ్గయ్యగారు తానూ సంతోషిస్తూ.

"తమది అద్భుతమైన కంఠము. తమ కంఠమన్న నాకు పరమ ఇష్టము"

"సంతోషం మాస్టారూ"

"ఇప్పటికీ నాకు జ్ఞాపకము. తమరు నటించిన పౌరాణికము చిత్రములూ, అందలి పాత్రలూ, తమరు ఎలుగెత్తి చదివిన పద్యములు..."

జగ్గయ్యగారు తడబడ్డారు... అదోలా చూశారు - "కాదు మాస్టారు..." అనబోయారు.

"సైలెన్స్ - కాదేమిటీ? మరీ అంత మొహమాటస్తులయితే ఎలా... అనాడు తమరు నటించిన నాటకములు సావిత్రి, కృష్ణలీలలు వంటివీ చూశాను - ఈ చిత్రములూ చూశాను. తమరు 'కృష్ణలీలలు' చిత్రములో కంసునిగా, కత్తి పట్టుకుని అటూ ఇటూ తిరుగుతూ పాడిన, "ధిక్కారమును సైతునా...." అన్న పాట ఇప్పటికీ నాకు జ్ఞాపకము.

"అహహఁ...... కాదు మాస్టారూ - ఆ పాత్రధారిని నేను కాదు... మీరు అనుకుంటున్నది గగ్గయ్య. వేమూరి గగ్గయ్య. నా పేరు జగ్గయ్య"

ఒక్కసారి మాస్టారు ఖంగుతిన్నారు. మొహం చిన్నదైపోయింది. "అలాగా! తమరు వేరా... జగ్గయ్య! ఈ పేరు అంతగా విన్నట్టు లేదుగాని, గగ్గయ్య పేరు మాత్రం బాగా విన్నాను మహానటుడు. ఇప్పుడేం చేస్తున్నారు - వారు?"

"వారిప్పుడు లేరు మాస్టారూ - పరమపదించారు!"

"అలాగా! అయినా, ఆయన మాత్రం గొప్ప నటుడు. కోపపాత్రలు ధరించడములో ఆయనకి ఆయనే సాటి... తమ కేశ సౌందర్యము చక్కగావున్నదే" అని అభినందించారు.

"కాదు మాస్టారూ. ఇది విగ్గు...."

"ఓహో... సాంఘిక చిత్రములలో కూడా విగ్గులు ధరించెదరన్నమాట... ఎందువల్ల?"

"నాకు జుట్టులేదు మాస్టారూ. తక్కువ"

"ఓహో... అందువల్ల విగ్గులు... అంతా కృత్రిమమే. ఈ రంగుపూసుకోడమూ, విగ్గులు ధరించడమూ అంతా కృత్రిమమే."

"అసలు సినిమాయే కృత్రిమం కదా మాస్టారూ"

"అవుననుకోండి. ఏమిటో, ఈ సాంఘిక పాత్రలు, చిత్రములూ, పాటలూ... ఇవన్నీ నాకు నచ్చవు."

"ప్రజలకు బాగా నచ్చుతాయి!"

"అలాక్కానీండి.... సైలెన్స్...." అంటూ మాస్టారు శిష్యుడితో, నెమ్మదిగా నిష్క్రమించారు. ■




చిత్రం
**రెఫ్యూజీ (2000)**
రచన
**జావెద్ అఖ్తర్**
సంగీతం
**అనూ మలిక్**
గానం
**అల్కాయాగ్నిక్, సోనూనిగమ్**
అభినయం
**అభిషేక్ బచ్చన్, కరీనా కపూర్**

## మేరే హమ్ సఫర్

మేరే హమ్‌సఫర్, మేరే హమ్‌సఫర్, మేరే పాస్ ఆ, మేరే పాస్ ఆ (2)
హమేఁ సాథ్ చల్‌నా హై ఉమ్ర్ భర్, మేరే పాస్ ఆ, మేరే పాస్ ఆ (2)
మేరే పాస్ ఆ ॥మేరే హమ్‌సఫర్॥

హై సఫర్ యే హమారా నయా నయా
కిసీ పల్ అంధేరా జో హోగయా ॥హై సఫర్॥
కహీఁ ఖో న జాయేఁ యే రెహగుజర్
మేరే పాస్ ఆ, మేరే పాస్ ఆ ॥హమ్‌ఁ సాథ్॥

జరా ఠహర్ జా మేరే హమ్ నవా
యహాఁ అగ్‌లే మోడ్ పే హోగా క్యా ॥జరా ఠహర్ జా॥
కిసే హై పతా, కిసే హై ఖబర్
మేరే పాస్ ఆ, మేరే పాస్ ఆ ॥హమేఁ సాథ్॥

జో ఘరోఁ కో ఛోడ్‌కే హైఁచలే (2)
ఉన్హే క్యా డరాయేంగే ఫాస్‌లే ॥జో ఘరోఁ కో॥
హమేఁ జానా హై దిల్ కే నగర్,
మేరే పాస్ ఆ, మేరే పాస్ ఆ ॥హమేఁ సాథ్॥

హిందీ చిత్రాలలో ఇటీవలి కాలంలో ఉత్తమ సంగీతం, ఉత్తమ గీతం జాతీయ అవార్డులు రెండూ పొందిన చిత్రం 'రెఫ్యూజీ'. ముఖ్యంగా సంగీత దర్శకుడిగా ఎన్నో ఒడిదుడుకులు ఎదుర్కొని ఎంతో పరిణతి సాధించిన అనూమలిక్ కృషికి లభించిన గుర్తింపు ఇది. గీత రచయిత జావెద్ అఖ్తర్ అయితే అప్పటికే మూడు జాతీయ అవార్డులు పొందారు. 1997లో 'సాజ్' చిత్రానికి, 1998లో 'బార్డర్' చిత్రానికి, 1999లో 'గాడ్‌మదర్' చిత్రానికి ఉత్తమ గీతరచయితగా జాతీయ అవార్డు అందుకుని హ్యాట్రిక్ సాధించారు. 2001లో 'రెఫ్యూజీ' చిత్రానికి, 2002లో 'లగాన్' చిత్రానికి మళ్ళీ ఆ అవార్డు ఆయనకు లభించింది.



వెటరన్ మ్యూజిక్ డైరెక్టర్ సర్దార్ మలిక్ గారబ్బాయి అయిన అనూమలిక్ 'ఆపస్ కీ బాత్' చిత్రంతో చిత్రరంగ ప్రవేశం చేశారు. అందులోని 'మొహబ్బత్ రంగ్ లాయేగీ ఆహిస్తా ఆహిస్తా' పాట ఆయనకు గుర్తింపు తెచ్చింది. మన్‌మోహన్ దేశాయ్ తీసిన భారీ చిత్రాలు 'మర్ద్', 'గంగా జమునా సరస్వతి'లకు ఆయన సంగీతం అందించారు. యాక్షన్ చిత్రాల ట్రెండ్ మారి రొమాంటిక్ చిత్రాలు రావటంతో ఆ ట్రెండ్‌కి అనుగుణంగా మారటానికి ఆయనకు సమయం పట్టింది. 'సోనీ మహివాల్' వంటి హిట్ చిత్రాలు అందిస్తూ పట్టుదలతో కృషి చేశారు. 'రాధా కా సంగమ్' చిత్రం ఆయనకు టర్నింగ్ పాయింట్ అయింది. లతా మంగేష్కర్, అనురాధా పౌడ్వాల్ పాడిన పాటలు అందరినీ ఆకట్టుకున్నాయి. ఆ తర్వాత మహేశ్‌భట్ తీసిన టెలీఫిల్మ్ 'ఫిర్ తేరీ కహానీ యాద్ ఆయీ'లో 'తేరే దర్ పర్ సనమ్', 'బాదలోఁ మేఁ ఛుప్ రహా హై చాంద్ క్యోఁ' పాటలు శ్రోతలను ఉర్రూతలూగించాయి. ఇక 'బాజీగర్'తో వెనుదిరిగి చూడాల్సిన అవసరం లేకుండా సాగిపోయారు. 'సర్', 'అకేలే హమ్ అకేలే తుమ్', 'మైఁ ఖిలాడీ తూ అనాడీ', 'విజయపథ్', 'బోర్డర్', 'విరాసత్', 'జోష్' చిత్రాలతో పండితులను, పామరులను మెప్పిస్తూ విజయపథంలో సాగిపోయారు. ఇతరుల సంగీతాన్ని కాపీ చేస్తున్నారనే విమర్శలు వచ్చినా తన స్వంత శైలిలో ఎన్నో హిట్స్ అందించారు. 2001 లో పాపులర్ అవార్డులన్నీ 'కహోనా ప్యార్ హై' చిత్రానికి దక్కగా ప్రభుత్వ అవార్డు 'రెఫ్యూజీ'కి దక్కడం గమనార్హం. 'మేరే హమ్ సఫర్' వంటి అద్భుతమైన మెలొడీ అనూమలిక్ ప్రతిభను కళ్ళకు కట్టినట్టే 'పంఛీ నదియా'లోని సాహితీ సౌరభం హృదయాన్ని తడుతుంది. 'పంఛీ నదియా' పాటకు అన్ని పాపులర్ అవార్డులతో పాటు జాతీయ అవార్డు అందుకున్నారు జావెద్ అఖ్తర్.

'బార్డర్' చిత్రంలో దేశభక్తిని, యుద్ధం మిగిల్చే విషాదాన్ని సమపాళ్ళతో చూపించిన జె.పి.దత్తా 'రెఫ్యూజీ'లో దేశ సరిహద్దులకు అతీతమైన ప్రేమకథ చెప్పారు. ఈ అంశాన్ని రాజ్‌కపూర్ 'హెన్నా'లో చర్చించారు. 'రెఫ్యూజీ'తో అభిషేక్ బచ్చన్, కరీనా కపూర్ చిత్రరంగానికి పరిచయం అయ్యారు. దేశ సరిహద్దు దాటాలనుకునేవారిని ప్రభుత్వాలకు తెలియకుండా దాటించే యువకుడైన రెఫ్యూజీ పాత్రలో అభిషేక్ బచ్చన్, అతని సహాయంతో భారత్ నుంచి పాకిస్తాన్ చేరుకుని అతని ప్రేమలో పడే యువతిగా కరీనా కపూర్ నటించారు. తమ ప్రేమకు అడ్డు చెప్పేవారిని కాదని వారు కొత్త జీవితం ప్రారంభించినపుడు వచ్చే పాట 'మేరే హమ్‌సఫర్'.

యమన్ రాగం ఆధారంగా సాగిన గొప్ప గీతంగా ఈ పాటని చెప్పుకోవాలి. ఈ పాట వింటుంటే "ఏ షామ్‌కి తన్ హాయియా (తెలుగులో "ఏకాంతము సాయంత్రము' పాట) దగ్గర్నుండి 'జబ్ దీప్ జలే ఆనా' వరకు యమన్‌లోగల పాటలన్నీ కళ్ళముందు కొచ్చి నిలబడతాయి. అల్కాయాగ్నిక్ స్వర జీవితంలో ల్యాండ్‌మార్క్‌గా నిలిచిపోయే గీతమిది.

హమ్‌సఫర్ అంటే సహచరుడు లేదా సహచరి. 'పాస్ ఆ' అంటే 'చెంతకు రా' అని. 'సాథ్ చల్‌నా' అంటే కలిసి నడవటం. ఉమ్ర్ భర్ అంటే జీవితాంతం.

## పంఛీ నదియాఁ

పంఛీ నదియాఁ పవన్ కే ఝోంకే
కోయీ సర్‌హద్ నా ఇన్హే రోకే ॥పంఛీ నదియాఁ॥
సర్‌హదేఁ ఇన్‌సానోఁ కే లియే హైఁ
సోచో తుమ్‌నే ఔర్ మైనే క్యా పాయా ఇన్సాఁ హోకే ॥పంఛీ నదియా॥

జో హమ్ దోనోఁ పంఛీ హోతే
తైర్‌తే హమ్ ఇస్ నీల్ గగన్ మేఁ పంఖ్ పసారే
సారీ ధర్తీ అప్‌నీ హోతీ, అప్‌నే హోతే సారే నజారే
ఖులీ ఫిజావోం మేఁ ఉడ్‌తే (2)
అప్‌నే దిలోఁ మేఁ హమ్ సారా ప్యార్ సమాకే ॥పంఛీ నదియాఁ॥

జో మైఁ హోతీ నదియా ఔర్ తుమ్ పవన్ కే ఝోంకే, తో క్యా హోతా (2)
పవన్ కే ఝోంకే నదీకే తన్ కో జబ్ ఛూతే హైఁ (2)
లెహరేఁ హీ లెహరేఁ బన్‌తీ హైఁ
హమ్ దోనోఁ జో మిల్‌తే తో కుఛ్ ఐసా హోతా
సబ్ కెహతే యే లెహర్ లెహర్ జహాఁ భీ జాయేఁ
ఇన్‌కో న కోయీ టోకే ॥పంఛీ నదియాఁ॥











'నా సహచరుడా, నా సహచరుడా, నా దరికి రా, నా దరికి రా
కలిసి సాగుదాం కడదాకా, నా దరికి రా, నా దరికి రా
నా దరికి రా'

ఒక్క క్షణం కూడా ఒకరికొకరు దూరం కాకుండా కలిసి జీవనం సాగించాలని వారి ఆశ. జీవితాంతం తోడుగా ఉండాలని బాసలు చేసుకుంటున్నారు.

సఫర్ అంటే పయనం. నయా అంటే కొత్తది. పల్ అంటే క్షణం. అంధేరా అంటే చీకటి. 'ఖోజాన' అంటే తప్పిపోవటం. రెహగుజర్ అంటే సహచరుడు.

'కొత్త కొత్త పయనం మనది
ఏ క్షణమైనా చీకటి అలముకుంటే
దారి తప్పుతామేమో ప్రియా, నా దరికి రా, నా దరికి రా'

తమ కొత్త జీవనయానంలో ఎప్పుడైనా దిక్కుతోచకపోతే తాము ఎంచుకున్న దారి తప్పిపోతామేమో అని ఆమె భయం. అందుకే ఎప్పుడూ తన చెంతనే ఉండమంటూంది.

ఠహర్‌నా అంటే ఆగటం. హమ్‌నవా అంటే ప్రియమైనవారు. 'అగ్లామోడ్' అంటే తరువాతి మలుపు. 'కిసే పతా' అన్నా 'కిసే ఖబర్' అన్నా 'ఎవరికి తెలుసు' అని.

'కాస్త ఆగు ఓ ప్రియతమా
ఈ మలుపు దగ్గర ఏమౌనో
ఎవరికి తెలుసు, ఎవరికి ఎఱుక; నా దరికి రా, నా దరికి రా'

ఎప్పుడూ ప్రమాదాల అంచున గడిపే అతను ఆచి తూచి అడుగేయాలనుకోవటం సహజమే కదా. తమ పయనం ఎక్కడికి దారి తీస్తుందో అని కలవరపడుతూనే ఆమెను తన తోడుగా ఉండమంటున్నాడు. కలవరంలోనే తోడు ఎక్కువ అవసరం కదా!

ఘర్ అంటే ఇల్లు. ఛోడ్‌నా అంటే వదలటం. డరానా అంటే భయపెట్టడం. ఫాస్లే అంటే దూరాలు. 'దిల్ కా నగర్' అంటే హృదయ నగరు.

'గూడు వదిలి వచ్చినవారు
దూరభారాలకు బెదిరిపోరు
మన గమ్యం హృదయనగరు; నా దరికి రా, నా దరికి రా'

ఇల్లు వదిలి కొత్త జీవితం కోసం అన్వేషిస్తూ సాగేవారు దూరభారాలకు భయపడరని ఆమె సాంత్వన పలుకుతోంది. ప్రేమ సామ్రాజ్యమే తమ గమ్యమని గుర్తు చేస్తోంది.

'పంఛీ నదియా' పాట వసుధైక కుటుంబ సందేశాన్ని అందించే పాట. కళ్యాణిరాగం ఆధారంగా మధురాతి మధురంగా సాగిపోతుంది. సరిహద్దులనేవి లేకుండా అందరూ సామరస్యంతో జీవిస్తే శాంతి వెల్లివిరుస్తుందనే ఆశాభావం ఉందీ పాటలో. పంఛీ అంటే పక్షులు. నదియాఁ అంటే నదులు. 'పవన్ కో ఝోంకే' అంటే గాలి తెమ్మెరలు. సరహద్ అంటే సరిహద్దులు. రోక్‌నా అంటే ఆపటం. ఇన్‌సాన్ అంటే మనుషులు.

'పక్షులు, నదులు, గాలితెమ్మెరలను
ఏ సరిహద్దూ అడ్డుకోదు
సరిహద్దులు మనుషులకే
మరి నువ్వూ నేనూ మనుషులమై సాధించిందేమిటి?'

పక్షులు ఎక్కడికైనా ఎగిరిపోగలవు. నదులు ఒక దేశం నుంచి మరొక దేశానికి ప్రవహించగలవు. గాలి తెమ్మెరలు ఎక్కడికైనా ప్రయాణించగలవు. వాటికి పాస్‌పోర్టులు, వీసాలు అవసరం లేదు. సరిహద్దులు అడ్డుకునేది మనుషులనే. మరి మనషులుగా పుట్టి మనం సాధించినదేమిటి? దేశాల పేరుతో సరిహద్దులు ఏర్పరచుకొని ద్వేషాలు పెంచుకోవటమేనా?

తైర్‌నా అంటే ఈదటం. పంఖ్ అంటూ రెక్కలు. ధర్తీ అంటూ భూమి. నజారే అంటే దృశ్యాలు. 'ఖులీ ఫిజాయేఁ' అంటే విశాలమైన ప్రకృతి అనుకోవచ్చు.

'మనమిద్దరమూ పక్షులమైతే
ఈ నీలాల నింగిలో రెక్కలు విప్పుకుని ఈదేవారం
ప్రపంచమంతా మనదే అప్పుడు, దృశ్యాలన్నీ మన సొంతం
విశాలమైన ప్రకృతిలో ఎగిరేవారం
మన హృదయాల్లో ప్రేమంతా నింపుకుని'

ఆ ప్రేమికులిద్దరూ పక్షులై ఉంటే రెక్కలు విప్పుకుని నీలాల నింగిలో ఈదేవారట. మనుషులకు ఈదటం తెలుసుగానీ ఎగరటం తెలియదు కాబట్టి 'ఆకాశంలో ఈదటం' అనే ప్రయోగం చేశారనుకోవచ్చు. అలా పక్షులై ఎగిరిపోతే ప్రపంచమంతా వారి సొంతమే. అన్ని సుందరమైన



దృశ్యాలూ చూడవచ్చు. హృదయాల్లో ప్రేమంతా నింపుకుని విశాలమైన ప్రకృతిలో స్వేచ్ఛగా విహరించేవారు. దేశాల పేరుతో వారినెవరూ విడదీయాలని చూసేవారు కాదు.

తన్ అంటే తనువు. ఛూనా అంటే తాకటం. లెహరేఁ అంటే అలలు, కెరటాలు. టోక్‌నా అంటే అపటం, అడ్డుపడటం.

'నే నదినైతే, నువు గాలితెమ్మెరలైతే ఏమవుతుంది
గాలితెమ్మెరలు నది తనువును తాకితే
కెరటాలే ఎగసేను
మనమిద్దరం కలిస్తే అదే జరిగేను
అప్పుడందరూ అనేవారు - ఈ కెరటాలు
ఎక్కడికి వెళ్ళినా వీటిని ఆపవద్దని'

గాలి తెమ్మెరలు నదిని తాకితే కెరటాలు ఎగిసినట్లే వారిద్దరిలో ప్రేమ ఎగసింది. వారే నదీ, గాలీ అయి ఉంటే ఆ కెరటాలను ఎవరూ ఆపేవారు కాదు. వారు మనుషులవటంతో అందరూ అడ్డుకుంటున్నారు. మనుషులవటం వల్ల మనకు ఒరిగిందేమిటి? సాటి మనుషుల పట్ల ప్రేమ చూపటానికి ఇన్ని అవరోధాలెందుకు?

జె.పి.దత్తా తన తాజా చిత్రం 'ఎల్.ఓ.సి.'ని భారీ తారాగణంతో రూపొందిస్తున్నారు. సంజయ్‌దత్, సునీల్‌శెట్టి, నాగార్జున, సైఫ్ అలీ ఖాన్, అక్షయ్ ఖన్నా, అభిషేక్ బచ్చన్, అజయ్ దేవ్‌గన్, రవీనా టాండన్, రాణీ ముఖర్జీ, కరీనాకపూర్ నటించిన ఈ చిత్రం త్వరలో విడుదల కానుంది.

**- పి.వి.సత్యనారాయణ రాజు**



# కర్ణాటక సంగీత పితామహుడి అస్తమయం

**'భావయామి రఘురామమ్' (రాగమాలిక)**
**'దేవదేవ' (మాయామాళవగౌళ)**
**'పంకజలోచన' (కళ్యాణి)**

ఈ స్వాతితిరునాళ్ (హాసం 47వ సంచిక) కీర్తనలు వింటూంటే ఛట్టున గుర్తుకువచ్చే సెమ్మంగుడి శ్రీనివాస అయ్యర్ ('చీను' పేరుతో విఖ్యాతులు) మరిలేరు. అక్టోబరు 31 న తన 95 వ యేట చెన్నయ్‌లో కాలధర్మం చెందారు. ముగ్గురు కుమారులు, ఇద్దరు కుమార్తెలతో బాటు అశేష సంగీతాభిమానులను శోకసముద్రంలో ముంచి దివికేగిన ఈ సంగీత పితామహుడు గురుకుల విద్యాభ్యాసానికి ఒక ఆదర్శప్రాయమైన ఉదాహరణగా నిలిచారు.

నలుగురు ఉద్దండుల వద్ద అభ్యాసం చేసే అదృష్టం కలిగింది చిన్నారి చీనూకి. తన 9 వ యేట, 1917లో విజయదశమినాడు ప్రముఖ వయొలిన్ విద్వాంసుడు, తన జ్ఞాతి అయిన సెమ్మంగుడి నారాయణస్వామి అయ్యర్ వద్ద గురుకుల విద్య మొదలుపెట్టాడు. తరువాత గోటువాద్య నిపుణుడు సఖారామారావు వద్ద, ఆ పిదప గాయకుడు, సంగీతకళానిధి ఉమలాయపురం స్వామినాథ అయ్యర్ వద్ద, చివరిగా మహారాజపురం విశ్వనాథ అయ్యర్ వద్ద నేర్చుకోవడం జరిగింది.

గురుకుల పద్ధతిలో గురువు ఇంట్లోనే ఉంటూ నేర్చుకోవడం వల్ల లాభం పొందిన చీనూ తన శిష్యులకు కూడా అలాగే నేర్పారు. అందువల్లనే ఆయనను మహావిద్వాంసుడిగా మాత్రమే కాక, మహామనిషిగా కీర్తింపబడ్డాడు. ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి, యేసుదాసు కూడా ఆయన వద్ద కొన్ని కీర్తనలు అభ్యసించారు. ఆయననుండి నేర్చుకోవడం ఒక గౌరవమంటారు సుబ్బులక్ష్మి. టి.ఎన్.కృష్ణన్, టి.ఎమ్.త్యాగరాజన్, పి.ఎస్.నారాయణస్వామి, ఎస్.హరిహర అయ్యర్, కె.ఆర్.కుమారస్వామి అయ్యర్, పాలై సి.కె.రామచంద్రన్, వి.సుబ్రమణియమ్, వాసుదేవన్, వైగా జ్ఞానస్కందన్..ఇలా ఎందరో సంగీతకారులు ఆయన శిష్యవర్గంలోని వారే! చిత్రం ఏమిటంటే ఎంతో పేరు వచ్చాక కూడా కొన్ని కీర్తనలు నేర్చుకోవడానికి అరియక్కుడి, టి.బృంద, జి.ఎన్.బాలసుబ్రమణియన్ వంటి వారివద్ద శ్రీనివాస అయ్యర్ శిష్యరికం చేశారు. అదీ ఆయన జ్ఞానతృష్ణ!

ఒక ఉత్తమమైన ప్రయత్నానికి అంకితం కావడానికి కూడా ఆయనే మేలిమి ఉదాహరణ!

కేరళలోని తిరువాన్కూర్ సంస్థానం వారు ఆయనను 1939లో ఆస్థాన విద్వాన్‌గా నియమించారు. రెండేళ్ల తర్వాత తన 33 వ యేట ఆయన స్వాతితిరునాళ్ మ్యూజిక్ అకాడెమీలో చేరారు. త్వరలోనే ప్రిన్సిపాల్ గా ప్రమోట్ అయి, 1963 వరకు అక్కడే ఉన్నారు. మహారాజా స్వాతితిరునాళ్ వివిధభాషలలో కంపోజ్ చేసిన కృతుల సాహిత్యం దొరికింది గాని ట్యూన్ గురించి ఏ ఆధారమూ దొరకలేదు. హరికేశనల్లూర్ ముత్తయ్య భాగవతార్, తదితరుల సహాయంతో శ్రీనివాస అయ్యర్ రాగనిర్ధారణ చేసే పనిలో పడ్డారు. 200 కీర్తనలను నొటేషన్‌తో సహా ప్రచురించారు.

అంతేకాదు తన కచ్చేరీలలో విధిగా రెండు స్వాతితిరునాళ్ కీర్తనలు పాడాలన్న నియమం పెట్టుకున్నాడాయన. 1947 నాటికే మద్రాసు మ్యూజిక్ అకాడెమీ ఆయనను 'సంగీతకళానిధి' బిరుదుతో సత్కరించింది. ఆ బిరుదు అందిన అతి పిన్నవయస్కుడాయన. అప్పటికి ఆయన వయసు 39 మాత్రమే. స్వాతితిరునాళ్ అకాడెమీ పదవినుండి మూడేళ్లు సెలవు తీసుకుని మద్రాసు ఆలిండియా రేడియోలో కర్ణాటక సంగీతవిభాగానికి చీఫ్ ప్రొడ్యూసర్‌గా పనిచేశారు. సంగీతాన్ని ప్రజలకు చేరువ చేయాలని తహతహ లాడిన ఆయన అన్నేళ్లు కచేరీలు చేసినా కొత్త పాటలు కట్టడం, కొత్తరాగాలు కూర్చడం వంటివి చేయలేదు. "మనకు వారసత్వంగా వచ్చిన సంపదను అనుభవించడానికే జీవితకాలం చాలదు." అనేవారాయన.

నిజమే, సంగీతవారసత్వం ఆయనకు కుటుంబపరంగా వచ్చిందనే చెప్పవచ్చు. తమిళనాడులో తంజావూరు జిల్లా సంగీతానికి, సాహిత్యానికి, భరతనాట్యానికి పుట్టిల్లయితే వారి సెమ్మంగుడి గ్రామం పలువురు సంగీతకారులకు ఉగ్గుపాలు పట్టిన వూరు. 1908 జూలై 25న తిరుక్కొడి కావల్‌లో మేనమామ కృష్ణఅయ్యర్ (ఆయనా వయొలిన్ విద్వాంసుడే) ఇంట పుట్టిన చీను తన 18 వ యేట తొలిసారి కచ్చేరి చేశి అంచెలంచెలుగా అభివృద్ధి చెందుతూ పద్మభూషణ్, దరిమిలా పద్మవిభూషణ్ కూడా పొందారు.

ఈ ప్రతిభావ్యుత్పత్తులు సునాయాసంగా వచ్చాయనుకుంటే పొరబాటే! రోజుకి ఎనిమిది గంటలు ప్రాక్టీసు చేయగా చేయగా గొంతు బలపడింది. ఖంగుమని పలకసాగింది. అయినా దక్షిణామూర్తి పిళ్లయ్ వయొలిన్ కు మారిపొమన్నారు. అయ్యో అనుకున్నా గురువు మాట మన్నించారు చీను. కానీ గొంతుపై పట్టు సాధించాలన్న పట్టుదల మాత్రం వదులుకోలేదు. గొంతు సాఫీ కావడానికి నశ్యం వాడమని రాజాజీ ఇచ్చిన సలహా పనిచేసింది కానీ ముక్కుతో పలికే ధ్వని మాత్రం తగ్గించలేక పోయింది. టాన్సిల్స్ ఆపరేషన్ తర్వాత ఆ 'నాసికత' మరింత పెరిగింది. వర్జ, వక్రరాగాల ఆరోహణావరోహణలలో ఆధార షడ్జమాన్ని అదుపులో పెట్టడానికి పెనుగులాడ వలసివచ్చేది. దాన్ని తనకు అనువుగా మలచుకుంటూ ఆడియన్స్‌ను ఆకట్టుకుంటూ 'నాసికత'నే తన ముద్రగా మార్చుకుంటూ ఆయన సంగీతప్రస్థానం సాగింది. ఈ ప్రయోగాలకు ఆయన పాండిత్యం అడ్డువచ్చేది కాదు.

పాతతరానికి చెందినవాడైనా, ఆయన కచేరీలలో త్యాగరాజు, శ్యామాశాస్త్రి కీర్తనలతో బాటు సుబ్రహ్మణ్య భారతి లలితగీతాలను కూడా పాడడానికి వెనుకాడేవాడు కాడు. 'భావయామి రఘురామమ్' అనే కీర్తన సావేరి రాగంలో పాడే సాంప్రదాయం తప్పించి రాగమాలికలో కూర్చి చిత్తస్వరాలు చేర్చి మరింత జనరంజకం చేశారు. సంగీతం విషయంలో వీణ బాలచందర్, బాలమురళీకృష్ణ వంటివారితో తలపడినా స్వతహాగా ఆయన చమత్కారి, హాస్యప్రియుడు.

తన తొలి కచేరీ గురించి చెబుతూ "1926లో నా 18 వ యేట కుంభకోణం నాగేశ్వరస్వామి గుడిలో జరిగింది. అళగనంబి పిళ్లయ్ మృదంగం. పూజారికూడా ఊరికే కూచోలేక ఓ ఘటం పట్టుకుని తయారయ్యాడు. నా గానంతో వరుణదేవుడు ప్రసన్నుడయ్యాడు. వర్షం కురిపించి ఉన్న 10,15 మంది శ్రోతలూ పారిపోలేకుండా చేశాడు. వర్షం ఎంత ఉధృతంగా ఉందంటే నా పాట నాకే వినబడలేదు. అందుకే ఏం పాడానో నాకే గుర్తులేకుండా పోయింది." అనేవారాయన నవ్వుతూ!

**- కమ్యూనికేటర్ ఫీచర్స్**

ఓ రజకుడు తన గాడిదను వెతుక్కుంటున్నాడు కాని ఎక్కడా దొరకలేదు. విసుగు చెందని విక్రమార్కునిలా వెదుకుతూ వెదుకుతూ ఒక ఫార్మ్‌హౌవుస్‌కు వెళ్లాడు. అక్కడ వాచ్‌మన్ అతన్ని ఆపేశాడు.

"నా గాడిదను వెతుక్కుంటున్నానయ్యా" అంటూ లోపలికి వెళ్లబోయాడా రజకుడు. "వేధవ్వేషాలు కాకపోతే, ఇక్కడకు నీ గాడిదెట్లా వస్తుందయ్యా? గూబ మీద ఒక్కటిచ్చుకున్నా నంటే ముల్లోకాలు కనిపిస్తాయి పో! పో." అన్నాడా వాచ్‌మెన్.



"నిజంగానా? అయితే ఆ పని చెయ్యిబాబు. ఆ ముల్లోకాల్లో, నా గాడిద ఎక్కడుందో నేను శ్రమ లేకుండా వెతికేసుకుంటాను" అని అన్నాడా రజకుడు ఆనందంగా.

రవి : ఏం తింటున్నావు?
సూర్య : తెలివికి మందు.
రవి : ఏదీ నాక్కొంచం పెట్టు.
సూర్య ఇచ్చాడు.
రవి : (తిన్న తర్వాత) పోదూ మరీ బడాయి! ఇది కలకండ..
సూర్య : మరదే... తినగానే నీకెన్ని తెలివితేటలు వచ్చాయో చూసావా....?



బామ్మా! నా మొహం అస్తమానం కడగద్దు.
నీ వయసులో ఉన్నప్పుడు నేను నా మొహాన్ని రోజుకి మూడుసార్లు కడుక్కునే దాన్ని తెలుసా?
అందుకే మరి, నీ మొహం ఇంత ముడతలు పడిపోయింది.



సైకిలింగ్‌లో ఛాంపియన్లు ఓ ముగ్గురు కలిసి రైల్లో ప్రయాణం చేస్తుండగా సిగ్నలు ఇవ్వనందుకు మధ్యలో రైలు ఆగిపోయింది.
మొదటివాడు : బహుశా చక్రంలో గాలి కొట్టిస్తున్నాడేమోరా అందుకే ఆగింది.
2వ అతను : గాలి కొట్టించడం ఇంత సేపా... బహుశా టైరు పంక్చరు అయి ఉంటుంది!
3వ ఛాంపియన్: ఉండండి. అసలు సంగతి నేను చూస్తా (అంటూ క్రిందకు దిగి రైలు చక్రాలకేసి చూసి) ఒరే వీటికి అసలు ట్యూబులే లేవురా ఎవరో దొంగిలించేశారు.



ఒకావిడ టాక్సీలో వెళుతున్నది. మలుపు వచ్చినప్పుడల్లా చెయ్యి బైట పెట్టడం చూసి నువ్వు నిశ్చింతగా డ్రైవు చేసుకో... వానొస్తే చెప్తాలే" అందామె.



పల్లెటూళ్లో ఉండే ఒకాయన పట్నం చూసి వచ్చాడు. ఇరుగు పొరుగువారు ఉత్సాహం కొద్దీ వివరాలు అడిగారు.
"అంతా బావుంది కాని పట్నంలో అంతా పరమ పీనాసి వాళ్ళు బస్సు మీద బస్సు పెట్టి ఒకే ఒక్క డ్రయివర్‌తో నడిపిస్తారు. ఇద్దరి డ్రైవర్ల పనిని ఒక్కడే చేయాల్సి వస్తోందక్కడ" అంటూ చెప్పాడాయన డబుల్ డెక్కర్ బస్సుల గురించి.



ఓ ఆఫీసులో స్టాఫ్ ఇలా మాట్లాడుకుంటున్నారు.
ఒకతను : మీకిది తెలుసా మా పక్కింటాయనకు శిక్ష పడింది. అతను తన భార్యను జూలో లోతుగా ఉన్న చెరువులోకి తోసేసాడు. అందులోని మొసళ్లు ఆమెను తినేసాయి.
ఇంకొకతను (అమాయకంగా) : "జూలో జంతువులకి ఏ రకమైన తిను బండారాలూ పెట్టకూడదని అతనికి తెలియదులా ఉంది పాపం"



ఈ జోకులను పంపినవారు : జి.బి.లక్ష్మి, హైదరాబాద్.

"ఏం కోయదొరా... నా చెయ్యి చూసి జరగబోయేది చెప్పగలవా!?"
"తప్పకుండా చెబుతాను దొరా తప్పకుండా చెబుతాను. ఉన్నదున్నట్టు చెబుతాను... లేన్ది లేనట్టు చెబుతాను. ఇంకొన్ని దినాల్లో నీ పెండ్లాము మర్డరయిపోతాది దొరా మర్డరయిపోతాది"
"ఆ సంగతి నాకూ తెలుసులేవాయ్... నేను పట్టుబడతానా లేదా అది చెప్పు ముందు"



ఈ జోకును పంపినవారు : కాసాని లక్ష్మీనారాయణ అండ్ పార్టీ, హైదరాబాద్.

"నేను ప్రేమిస్తున్న అమ్మాయినే నువ్వు ప్రేమించటం ఏం బాగాలేదురా! మన్నమిద్దరం మంచి ఫ్రెండ్స్ కాబట్టి... ఆమెను ఎవరు పెళ్లి చేసుకోవాలో టాస్ వేసి తేల్చుకుందాం ఒకే?"
"ఇంత చిన్న విషయానికి టాస్ ఎందుకురా! పెళ్లి నువ్వే చేస్కుందువు గాన్లే నేను జస్ట్ ప్రేమిస్తున్నానంతే!"





"చల్లని సాయంత్రం... ఎవరూ లేని ఏకాంతం... నన్నగా మొదలైన వర్షం... ఇప్పుడు నీకేమనిపిస్తోంది లతా?..."
"మేడమీద ఆరేసిన ఒడియాలు తడిసిపోతాయోనని కంగారుగా ఉంది మోహన్..."

"నా భార్య రోజూ రాత్రి రెండు, మూడు వరకూ ఒక్కోసారి నాలుగు గంటల వరకు కూడా నిద్రపోకుండా అలాగే మేల్కొని వుంటుంది డాక్టరు గారూ మందేమైనా ఇస్తారా..."
"అంతవరకూ ఆమె ఏం చేస్తూవుంటారు."
"నేను బార్‌నుండి వచ్చేవరకు ఎదురుచూస్తూ వుంటుందండీ!"



ఈ జోకులను పంపినవారు : మామిడి మహేంద్ర, పూణే.

బాబురావు, రాజారావులు బార్‌లో మందు కొడుతున్నారు.
"త్వరగా కానీ లేకపోతే మా ఆవిడ ఊర్కోదు. తొందర చేశాడు రాజారావు"
"నాకా భయం లేదు. ఇవాళ శుక్రవారం. మా ఆవిడకి భక్తి ఎక్కువ" అన్నాడు బాబూరావు ధీమాగా!
"అంటే పూజ, మడి వగైరా వగైరాతో నీ విషయం పట్టించుకోదా!?"
"అదేం కాదు... శుక్రవారం నా మీద చెయ్యి చేసుకోదంతే"



టీచర్ : చంటీ! పౌష్టికాహారం అంటే ఏమిటీ?
చంటి : ప్లేట్‌మీల్స్ మేడమ్.
టీచర్ : సంపూర్ణాహారమంటే?
చంటి : ఫుల్ మీల్స్ మేడమ్.



"...అలా ఒక దశలో పొత్తిళ్లలోని శిశువు చీర కట్టుకున్న వారినంతా తన తల్లి అనుకోవడం జరుగుతుంది" అన్నారు సైకాలజీ మాష్టారు పాఠం చెబుతూ...
"మరి ఫ్యాంటు తొడుక్కున్నవారినంతా డాడీ అనుకోవడం జరగదా సార్?" వినిపించింది వెనుక బెంచీ నుంచి....



ఈ జోకును పంపినవారు : బి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.

చాలా కాలం తరువాత కనపడిన విద్యార్థితో "ఏరా అబ్బాయ్ ఉద్యోగమేదో చేస్తున్నావని విన్నాను. ఏవిటా ఉద్యోగం" అని అడిగారు మాష్టారు.
"ఫైర్ సర్వీసులో సార్" అన్నాడా విద్యార్థి వినయంగా.
"విన్నావుటే...." అన్నారు మాష్టారు గర్వంగా వాళ్లావిడ వైపు తిరిగి
"అదేలెండి.. కొంపలార్పే ఉద్యోగమేగా..." అందా ఇల్లాలు మూతి తిప్పుకుంటూ.



ఆపరేషన్‌కి ఇంతవుతుందని చెప్పి అంతాముందే మాట్లాడుకున్నాక ఇప్పుడు బిల్లింత ఎక్కువైందేంటి డాక్టర్...!?
"మరి...!? కడుపులో పెట్టి కుట్టేసిన కత్తెర్లకీ వాటికీ కూడా ఛార్జి చెయ్యాల్సిందేనని పై అధికారులు రూల్సు పాస్ చేస్తే బిల్లు ఎక్కువ అవదా!?



"అతి ఛాదస్తుడెవర్రా?"
"కొత్త చెప్పులకి కూడా పసుపు బొట్లు పెట్టి వాడేవాడు సార్" చెప్పాడో విద్యార్థి వినయంగా.



ఈ జోకులను పంపినవారు : జయంతి వెంకటరమణ, పెందుర్తి.



# బాపు విశ్వరూపం 24

(గత సంచిక తరువాయి)

ఆ 'తూర్పు వెళ్ళే రైలు' సినిమాలోనే 'పల్లె నిదుర లేచింది' అని టైటిల్ సాంగ్ ఒకటుంది. దానికి బాపుగారు 'తబలా మీద రైలుబండి వెళుతున్నట్టు ఓ నడక కావాలి, దాంతో పాట కావాలి' అని అడిగారు. దానికి తబలా ప్లేయర్ ధృవుడు. తను మహదేవన్ గారి దగ్గర వాయించేవాడు. అప్పుడు నాకు అసిస్టెంట్ గుణసింగ్. చాలా అద్భుతమైనటువంటి మురళీగాన విద్వాంసుడు. ఆ మధ్యనే దివంగతుడయ్యాడు. మేమందరం కలిసి రైలుబండి వెళుతున్నట్టు ఎలా ఉండాలో అని ఒక నడకను అనుకుని ఆ పాటను చేశాం. బాపుగారికి ఎంత అల్ప సంతోషి అంటే రిహార్సల్ చేస్తున్నప్పుడు కొద్దిగా వినిపించగానే ఎంతో సంబరపడిపోయారు. 'ఇదేనండి నేననుకున్నది... ఎగ్జాక్ట్లీ... అలాగే వచ్చింది' అని.



బ్యాక్‌గ్రౌండ్స్‌లో పెద్ద రిస్ట్రిక్షన్స్ చూపించేవారు కాదు. ఆయనకు మెలోడియస్‌గా ఉండాలి. ఆయనకు కొన్ని నచ్చని ఇన్‌స్ట్రుమెంట్స్ ఉన్నాయి ఒకటి ట్రంపెట్ మరొకటి షెహనాయ్. ఎందుకో మరి నాకు అర్థం కాదు... బాపుగారికి ఈ రెండు ఇన్‌స్ట్రుమెంట్స్ నచ్చవు. 'అవి నాకు మాత్రం వాడకండి' అని అనేవారు. ఆయనకు బాగా నచ్చింది 'ఎకౌస్టిక్ క్లాసికల్ గిటార్ గెట్‌గిటార్ కాని టల్వ్‌స్ట్రింగ్స్ గిటార్, ఫ్లూట్‌లో పీకోలాగా వాయించే పర్క్యూషన్స్ తర్వాత కొన్ని సౌండ్స్ ఉండేటువంటి సింథసైజర్ ఇవన్నీ చాలా ఇష్టం.

ఆయన అన్నిరకాల సంగీతాల్నీ విని అధ్యయనం చేసేవారు. ఆయన దగ్గర చాలా కలెక్షన్లు ఉండేవి.'జాకీ'లో 'అలా మండిపడకే జాబిలి' పాట పల్లవిమీద ఫ్లూట్ కాంబినేషన్‌లాగ ఓ ఇంటర్లూడ్ వస్తుంది. అది ముందు కంపోజ్ చేసుకున్నప్పుడు లేదు. ఆయన ఒక ఇంగ్లీషు పాటలో విని 'నాకు ఇలా కావాలి' అని అడిగి చేయించుకున్నారు. అప్పట్లో ఇప్పుడున్నటువంటి విస్తారమైన సింథసైజర్స్ లేవు. అప్పుడు మాధవపెద్ది సురేష్ నా సింథసైజర్ ప్లేయర్. అతని దగ్గరున్న ఇన్‌స్ట్రుమెంట్ లోంచి సౌండ్ పట్టుకొచ్చి వాయిస్తే బాపుగారికది చాలా నచ్చింది. పల్లవిలోనూ, పాటంతా అయిపోయాకా కోడా లాగా వచ్చే ఆ మ్యూజిక్ మీదే ఎండ్ అవుతుంది కూడా! ఆయనకు ఆ పాట ఎంతో ఇష్టం. అందులో ఉన్నటువంటి ఆ బిట్ ఆయనకి చాలాచాలా ఇష్టం.

'సీతమ్మపెళ్ళి' మ్యూజిక్ కూడా ఒక గమ్మత్తయిన అనుభవం నాకు. విజయకృష్ణ ఆఫీసులో కంపోజింగ్. బాపుగారు సెట్‌లో ఉన్నప్పుడు చాలా తక్కువ శబ్దం ఉంటుంది. ఎక్కడా అరవడాలు ఉండవు. అలాగే కంపోజింగ్ చేస్తున్నప్పుడు కూడా. ఆయన వేరే ఏమీ పనిచేయకుండా ఊరికే అలా కూర్చుని 'మీరేం చేస్తున్నారో చూస్తాను' అన్నట్టు ఉండరు. ఏదో పుస్తకం చదువుకుంటూనే ఉంటారు. అప్పట్లో ఆయన పైప్ కాల్చేవారు. పైప్ నోట్లో పెట్టుకుని పుస్తకం చదువుకుంటూ ఉండేవారు. నాకు సన్నివేశం చెప్పేవారు. మేం మా కంపోజింగ్ బృందంతో ఒక రాగంలో ఒక ట్యూన్ అనుకుంటూ ఉంటామనుకోండి అది ఆయనకు నచ్చని రాగమైతే నేను ఎప్పుడు ఆయన వైపు చూస్తానా అని చూస్తూండేవారు. అసలు మాతో ఇన్వాల్వ్ అయ్యేవారు కారు. పుస్తకం చదువుతూ ఉండేవారు. ఎప్పుడైనా ఆయనవైపు తిరిగినపుడు పుస్తకంలోంచి తల ఎత్తి ఈ రాగం అక్కర్లేదు అన్నట్లుగా కళ్ళు చిట్లించేవారు. అది నాకు అర్థమయ్యేది. వెంటనే వేరే రాగంలోకి వెళ్ళిపోయేవాళ్ళం. అలాగే... ఆయనకు నచ్చిన రాగం, నచ్చిన నడక వచ్చిందంటే కనుబొమ్మలు పైకి ఎగరేసి బాగుంది అన్నట్టుగా చూసేవారు. అంతే... అంతకంటే ఏమీ లేదు. తర్వాత ఓ పల్లవిని ఓ చరణాన్ని చేసి వినిపిస్తే - ఎక్కువ ఆల్టర్నేటివ్స్ కూడా అడిగేవారు కాదు. దానికి అద్భుతంగా మాటలు రాసేటువంటి కవులు... ఆరుద్రగారు, సుందరరామమూర్తి గారు లాంటి వారు ఉండేవారు. ఇవన్నీ కూడా నాలాంటి సంగీతదర్శకుడికి... అప్పటికి దొరికిన వరాలు అన్నమాట.

ఓరోజున ఓ పాట చేసేసి, పేకప్ చేద్దామని వెళ్ళిపోతుంటే సుందరామ్మూర్తిగారు పేపరుమీద ఓ రెండు లైన్లు రాసిచ్చారు. అందులో 'ఆకుపచ్చ చందమామ' అన్న ప్రయోగం ఎంతో బాగా చేశారు. అది చూసి నేనూ, సుందరరామమూర్తి సంతోషపడుతుంటే - 'ఏంటి... మాకు చెప్పరా... మాకు ఇవ్వరా... మీ సంతోషం' అని అడిగారాయన. అది చూపించాను. 'ఇంతమంచి పల్లవిని వదిలేస్తే ఎలాగండి. మనం ఎక్కడన్నా ఒక సన్నివేశం పెట్టుకుని అయినా ఈ పాట చేయాలి. ఈ పద్ధతిలో చరణాలు రాసేయండి గురువుగారు' అని, వేటూరి గారి చేత చరణాలు రాయించి - ఆ పాటను రికార్డ్ చేయడం కూడా జరిగింది.



రీ-రికార్డింగ్‌కి కూడా ఎంత ఇనిస్పిరేషన్ ఇచ్చేవారంటే - ఓ చిన్న ముక్కను ఎక్కడనుంచో తీసుకొచ్చి ఇచ్చి 'దీన్ని డెవలప్ చేసి థీమ్ చేయగలమా' అని అడిగేవారు. తమాషాగా ఉండేది. ఒక గజల్‌లో.... మెహదీహసన్‌గారు 'హహహహా...' అని ఫినిష్ చేస్తారు. ఆ పీస్ ఆయనకు చాలా ఇష్టం . దీన్ని ఏదైనా డెవలప్ చేయగలరా అన్నారు. రకరకాల ఇన్‌స్ట్రుమెంట్స్‌లో దాన్ని ఒక అందమైన థీమ్ మ్యూజిక్‌గా చేసి 'హమ్‌పాంచ్' సినిమాకి అంటే 'మనవూరి పాండవులు' హిందీ వెర్షన్‌లో ఉపయోగించడం జరిగింది. లక్ష్మీకాంత్ - ప్యారేలాల్ గారు ఆ 'హమ్‌పాంచ్' సినిమాకి సంగీత దర్శకులు. రీ-రికార్డింగ్ సమయానికి ఆ సంస్థ ఫైనాన్షియల్‌గా కొంచెం ఇబ్బందిలో పడింది. బోనీకపూర్ తమ్ముడు అనిల్‌కపూర్ 'ప్రత్యామ్నాయంగా వేరెవరిచేతనైనా చేయిద్దామండి. ఇప్పటికే చాలా కాస్ట్లీ అయింది' అని అన్నారు. అనిల్‌కపూర్ అప్పటికింకా ఆర్టిస్టుకాలేదు... ప్రొడక్షన్ వ్యవహారాలు చూసేవారు, బోనీకపూర్ ప్రొడ్యూసర్. వారి తండ్రిగారు సినిమా ప్రొడక్షను నుంచి ఇంచుమించు అస్త్రసన్యాసం చేసేశారు. అలా వారు అడిగినపుడు బాపుగారు మహదేవన్‌గారి పేరు చెప్పి ఉండవచ్చు, ఎవరి పేరైనా చెప్పి ఉండవచ్చు.... 'బాలుగారితో చేయిద్దామండి' అన్నారు. అసలు నేను ఊహించలేదన్నమాట నన్ను రీ-రికార్డింగ్ చేయమంటారని. ఆ సినిమాలో

థీమ్ చూసారంటే 'హా...... రారే రసా'... ఈ థీమ్ ఎన్నిసార్లు వస్తుందో చెప్పడానికి వీల్లేదు. దాన్ని రకరకాల ఇన్స్ట్రుమెంట్స్‌తో మేం వాయించడం జరిగింది. సినిమాలో కూడా చాలా అద్భుతంగా అమిరింది.



జెమినిలో ఈ థీమ్ మ్యూజిక్ మేం రీ-రికార్డ్ చేస్తున్నప్పుడు ఓరోజు వాసూరావు (ఇప్పుడు సంగీత దర్శకుడైన వాసూరావు అప్పుడు నా దగ్గర బేస్‌గిటార్ వాయించేవాడు) ఓ చిన్న కుర్రాణ్ణి తీసుకొచ్చాడు. "ఈ కుర్రాడు మ్యాండలిన్ వాయిస్తాడు. ఒకసారి మీరందరు వినాలి" అని అన్నాడు. నేను, బాపుగారు, బోనీకపూర్, అనిల్‌కపూర్ మేమందరం కూర్చొని విన్నాం. ఏదో మామూలు పాటలు వాయించాడు. బాగానే ఉంది. తర్వాత నేను సరదాగా స్వరం రాయడం వచ్చా అన్నాను. 'రాదండి' అన్నాడు. అప్పుడా అబ్బాయికి బహుశా పది పన్నెండు ఏళ్ళు ఉంటాయేమో! 'సరే నేను ఊరికే ఒక హమ్మింగ్ లాగ అంటాను దాన్ని నువ్వు వాయిస్తావా' అన్నాను. 'అనండిసార్ అన్నాడు . ఆ థీమ్‌ని నేను పాడితే ఒకటి రెండుసార్లు విన్న తర్వాత వాయించడం మొదలుపెట్టాడు మ్యాండలిన్ మీద. బాపుగారు వెంటనే ఈ సీన్‌లో మనం ఈ అబ్బాయి మ్యాండలిన్‌నే వాడుకుందాం అన్నారు. అప్పట్లో మ్యాండలిన్ ప్లేయర్‌కి 50 - 55 రూపాయలు పేమెంట్ ఉండేది. బోనీకపూర్ జేబులోంచి 100 రూపాయలు తీసి ఆ అబ్బాయికిచ్చాడు. ఆ అబ్బాయే ఇవాళ ప్రపంచ ప్రఖ్యాతిగాంచిన మ్యాండలిన్ విద్వాంసుడు చిరంజీవి శ్రీనివాస్. ఆ తర్వాత ఆయన క్లాసికల్ మ్యూజిక్‌లో చాలా నిష్ణాతుడై ఎందరినో అధిగమించి ఇవాళ ప్రపంచస్థాయికి చేరుకున్నాడు. మొట్టమొదటిసారి సినిమాకు మైకుముందు అతనిచేత వాయింపజేసిన గౌరవం నాకు మిగిలింది అది కూడా బాపుగారు నాకిచ్చిన సదవకాశం వల్ల... చాలాచాలా సంతోషించే విషయం అది.




అందరూ అనుకుంటారు బాపుగారికి తెలుగు సినిమా, మన కొబ్బరిచెట్లు, కోనసీమ, రాజమండ్రి ఇలాంటివే ఇష్టం అని... వేరే సంగీతం నచ్చదనీ! ఆయన దగ్గర వెస్ట్రన్ మ్యూజిక్ కలక్షన్ కూడా చాలా ఉంది. దాంట్లోంచి ఎన్నో విషయాలను, ఎన్నో గమ్మత్తయినటువంటి పీసెస్‌ను వినిపించి అనుకరించకుండా వాటిని అనుసరించమనడం - వాటిని చాలా అందంగా షేప్ చేయించుకోవడం - ఆయనకే సాధ్యమైంది.

మహదేవన్‌గారు మ్యూజిక్ చేసిన సినిమా 'రాజాధిరాజు' లో ఆ ప్రభావం చాలా కనపడుతుంది. ఇది మాత్రమే కాదు బాపుగారు - వేకువఝామునో, రాత్రిపూటనో ఇంటిపక్క మామిడి చెట్టుమీద ఉన్న కోయిల ఎప్పుడు కూస్తుందా అని టేపురికార్డర్ పెట్టుకుని గంటల తరబడి రికార్డులు చేసుకోవడాలు. తర్వాత చాలా సౌండ్ ఎఫెక్టులు టేప్ చేసుకుని ఆయన సినిమాలలో రీ-రికార్డింగ్‌లుగా వాడుకోవడాలులాంటివి కూడా ఉన్నాయి.

మన సినిమాల్లో కేవలం చెప్పుల చప్పుడు, కార్లు, బస్సులు రావడాల్లాంటి శబ్దాలు - లేకపోతే కాకుల అరుపులు పిచ్చుకల అరుపులు లాంటివే బాగా వినిపిస్తూవుంటాయి. శ్రద్ధగా మనం గమనించామంటే 'సీతాకల్యాణం' లో ఆడవాళ్ళు నడిచివస్తున్నపుడు, ఆడవాళ్ళు అనే కాదు... అసలు పురాణపురుషులు వాళ్ళకున్నటువంటి దుస్తులతో నడుస్తున్నప్పుడు ఎలాంటి శబ్దం వస్తుంది. కాళ్ళకున్నటువంటి కంకణాలు ఎలాంటి శబ్దాలు చేస్తాయి. గాజులు ఎలాంటి శబ్దాలు చేస్తాయి. ఇవన్నీ కూడా బాపుగారు అద్భుతంగా వినిపింపచేశారు. కావాలంటే ఈ టీవీలో ఇప్పుడు వస్తున్న 'భాగవతం'లో అలాంటి శబ్దాలని ప్రత్యేకంగా వినిచూడండి తెలుస్తుంది... బాపుగారు ఎంత శ్రద్ధగా ఉంటారో...

అడిగిందే తడవుగా ఎన్ని బొమ్మలు నాకు వేసిచ్చారో ఆయన!?... అప్పుడెప్పుడో నేను అడిగిన చిన్న చిన్న విషయాల దగ్గర నుంచి మొన్న 'మన ఘంటసాల' బయోగ్రఫీ పుస్తకం దాకా ఆయన వేసిన బొమ్మలను నేను ఉపయోగించుకోవడం జరిగింది. ఓసారి బాలగోపాలుడుగా నేను బొద్దుగా నెమలి పింఛం పెట్టుకుని గిటార్ వాయిస్తుంటే చుట్టు అందరూ చప్పట్లు చరుస్తూన్నట్టు ఓ బొమ్మ వేశారు. అలాగే కొన్ని పుస్తకాలు ప్రింట్‌చేసే భాగ్యాన్ని, వరాన్ని నాకిచ్చారు ఆయన. మొదటిది 'ఆండాళ్ తిరుప్పావై' రెండోది 'జనార్దనాష్టకం'.

ఆ పుస్తకాల్ని ప్రింట్ చేయించి నేనేదో ఫేవర్ చేశానని బాపురమణగార్లు అనుకుంటారు... కానేకాదు... అది వారు నాకిచ్చినటువంటి వరంగా నేను భావిస్తాను. నాకున్న కొద్దిపాటి పరిజ్ఞానానికి వాళ్ళ మనసుల్లో ఎంతో పెద్ద పీట వేసి కూర్చోబెట్టుకున్నారు. 'బాలుసరస్వతి నమస్తుభ్యం' అని నా బొమ్మవేసి అందులో ప్రింట్ చేయించారు. నాకొచ్చిన డాక్టరేట్లు కంటే పద్మశ్రీ కంటే కూడా ఈ కితాబు, నేను జీవితంలో మరిచిపోలేనటు వంటిది.

(వచ్చే సంచికలో మరికొంత)

# కొత్త బాణీ వినిపిస్తున్న దలేర్(డాలర్) మెహంది



నిన్న మొన్నటి వరకూ తనదైన శైలిలో యువతను ఉర్రూతలూగించిన పంజాబీ పాప్‌గాయకుడు దలేర్ మెహంది ఇప్పుడు పోలీసుల బాణీలకు అనుగుణంగా డాన్స్ చేయాల్సిన పరిస్థితిలో పడ్డారు. పొడవైన కుర్తా ధరించి, రెండు చేతులు పైకెత్తి 'బల్లే..బల్లే...', 'బోలో తారారారా....' అంటూ నృత్యాలు చేసిన ఈ గాయకుడుని ఇవాళ పాటియాల పోలీసులు నిద్ర పోనివ్వటం లేదు. యువకులను అక్రమ మార్గాలలో విదేశాలకు తీసుకు వెళ్తున్నాడనే ఆరోపణలను దలేర్ మెహంది ఎదుర్కొం టున్నారు. నిజానికి ఈ రాకెట్‌కు ప్రధాన సూత్రధారిగా దలేర్ సోదరుడు షంషేద్ పేరును చెబుతున్నారు.



అయితే దలేర్ మెహందీ అండ దండలుతోనే ఈ అక్రమ వ్యాపారం, చట్ట వ్యతిరేక కార్యకలాపాలు జరుగుతున్నాయని పోలీసుల వాదన.

1995లో 'బోలో తరారా రా' ఆల్బమ్‌తో దేశ వ్యాప్తంగా దలేర్ మెహందీ కీర్తిగడించారు. ఈ ఆల్బమ్ జాతీయ స్థాయిలో అమ్మకాలలో రికార్డు సాధించింది. ఒక్క కేరళ రాష్ట్రంలోనే దాదాపు లక్ష క్యాసెట్లు అమ్ముడయ్యాయని ఈ రంగానికి చెందిన వారు చెబుతున్నారు. పది పన్నెండేళ్లు పంజాబ్ పాప్‌గాయకుడిగా దలేర్ తెచ్చుకున్న పేరు, సంపాదించుకున్న ఇమేజ్ ఇవాళ ఈ ఆరోపణల కారణంగా ప్రశ్నార్థకమయ్యాయి.

'సంగీతం తనకి దేవుడిచ్చిన వరం' అని చెబుతారు దలేర్ మెహంది. సంగీత కుటుంబంలోనే దలేర్ జన్మించాడు. పాట్నాలో పుట్టిన దలేర్ చిన్న వయసునుంచి తన కుటుంబసభ్యులతో కలిసి గురుద్వారాలో పాటలు పాడటం మొదలు పెట్టాడు. అయితే తన గాత్రాన్ని కేవలం గురుద్వారా కే పరిమితం చేయకుండా - ప్రపంచానికీ వినిపించా లన్నదీ అతని కోరిక. అందుకే పాట్నా నుండి గోరఖ్‌పూర్ చేరాడు. అక్కడ ఉస్తాద్ రాహత్ అలీఖాన్ దగ్గర శిక్షణ పొందాడు. దాంతో శాస్త్రీయ సంగీతంలోనూ అతనికి పట్టు ఏర్పడింది. అయితే గాయకుడిగా మారడానికి ముందు - కొద్దికాలం టాక్సీ డ్రైవరుగానూ వర్క్ చేశాడు.

జవహర్ వట్టల్ స్వర రచన చేయగా, దలేర్ మెహందీ పాడిన పాటల్ని మెగ్నా సౌండ్ సంస్థ 1995లో 'బోలో తారారారా' పేరుతో విడుదల చేసింది. అది మొదలు...ఇక దలేర్ వెనుదిరిగి చూడాల్సిన అవసరం ఏర్పడలేదు. దాని తర్వాత విడుదలైన ఆల్బమ్ 'హో జాయేగీ బల్లే బల్లే.....' ఆ తర్వాత 'తునక్ తునక్ తున్...'. ఇవన్నీ దేశ వ్యాప్తంగా బాగా అమ్ముడు పోయాయి. నెలలు తరబడి దలేర్ మెహందీ పేరును మ్యూజిక్ చార్ట్స్‌లో నిలిచేలా చేశాయి. భారత దేశ స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సందర్భంగానూ దలేర్ రెండు పాటల్ని పాడాడు. 'వజహ్ ముష్కరానే కీ','50-50' అనే ఈ ట్రాక్స్‌కు శ్రోతల నుండి మంచి ఆదరణ లభించింది.

ఆ తర్వాత దలేర్ పంజాబీ పాప్ నుండి సినిమా రంగంలోనూ తన అదృష్టాన్ని పరీక్షించుకునే ప్రయత్నం చేశాడు. అమితాబ్ 'మృత్యుదాత', సన్నాడియోల్ 'అర్జున్ పండిట్', తాజాగా 'ఖాఫ్' చిత్రాలలో పాటలు పాడి స్పెషల్ అప్పియరెన్స్ ఇచ్చాడు. ఈ సినిమాలు బాక్సాఫీస్ దగ్గర బోల్తా కొట్టినా - దలేర్ పాటలకి, డాన్స్‌కు మంచి పేరొచ్చింది. దీనితో పాటుగా ఛానల్ వి లో బెస్ట్ మేల్ సింగర్‌గా వరుసగా 1996,97,98 సంవత్సరాలలో దలేర్ ఎంపికయ్యాడు. 1997, 1998లో స్క్రీన్ వీడియోకాన్ తరఫున బెస్ట్ మేల్ పాప్ సింగర్ అవార్డుల్ని పొందాడు.

**పచ్చని ప్రకృతి ఆరాధకుడు:**

దలేర్ కేవలం సంగీత ప్రపంచానికి మాత్రమే పరిమితం కాలేదు. పర్యావరణ పరిరక్షణను భుజానికెత్తుకున్నాడు. ఢిల్లీ మహానగరాన్ని పచ్చగానూ, పరిశుభ్రంగానూ ఉంచాలనే ఆలోచనతో దలేర్ 'గ్రీన్‌డ్రైవ్' ప్రారంభించాడు. ఢిల్లీలో ఇప్పటికే దాదాపు 5 లక్షల మొక్కలను దలేర్ నాటించాడు. ఇదే కార్యక్రమాన్ని దేశ వ్యాప్తంగా చేయటం కోసం పాఠశాలలు, సామాజిక సేవా సంస్థలు, అంతర్జాతీయ సంస్థలతో అవగాహన ఒప్పందాలు ఏర్పాటు చేసుకున్నాడు. మొక్కల్ని నాటేందుకు ఎవరు ముందుకొచ్చినా వాటిని ఉచితంగా అందించటానికి దలేర్ సిద్ధంగా వున్నాడు. ఈ కార్యక్రమాలన్నింటినీ దలేర్ మెహందీ, 1997 నుండి డి.ఎం. ఎంటర్‌టైన్‌మెంట్ ప్రైవేట్ లిమిటెడ్ పేరుతో నిర్వహిస్తున్నాడు.



**'డాలర్' మెహందీ:**

సాధారణ స్థాయినుండి దలేర్ స్టార్ గాయకుడిగా ఎదగటం వెనుక కేవలం అదృష్టం ఒక్కటే వుందనుకుంటే పొరపాటే - నిరంతర పరిశ్రమ, కొత్తదనం కోసం ఆరాటం, శ్రోతల మనోభావాలను గ్రహించి తనదైన బాణీలను పలికించటంలో బాంగ్రా కింగ్‌గా దలేర్ ఎదిగాడు. అయితే ఈ ఎదుగుదల వెనుక ఎదుర్కొన్న కష్టాలూ అనేకం ఉన్నాయి. దలేర్ తరహా కాస్ట్యూమ్సును ధరించి, అలానే పాటలు కొందరు పాడినా - ఈ స్థాయి విజయాన్ని మిగిలిన వారు సాధించ లేకపోయారు. తాజాగా పోలీసుల కేసులో ఇరుక్కున్న దలేర్ తన పలుకుబడిని ఉపయోగించి ఇందులోంచి బయటపడాలని ప్రయత్నించారు. కానీ పోలీసులు దలేర్ స్థావరాల మీద దాడి చేసి బలమైన ఆధారాలను హస్తగతం చేసుకోవటంతో దలేర్ తాను బోనులో చిక్కినట్లే అయింది. ఈ రాకెట్‌లో ప్రధాన పాత్రధారి షంషేద్ తన సోదరుడే అయినా - అతనికి తనకి వ్యాపారపరమైన సంబంధాలు లేనే లేవని దలేర్ వాదిస్తున్నాడు. 'నా ఎదుగుదలను చూసి ఓర్వలేని కొందరు ఈ రకంగా కుట్ర పన్నారన్నది' దలేర్ మాట. తన పాటల్ని కూడా నిషేదించాలని కొందరు గతంలో ప్రయత్నించారని...వారి విమర్శలకు తల ఒగ్గి 'ఏక్ దానా' ఆల్బమ్ ప్రసారాన్ని ఆపేశానని దలేర్ అన్నాడు. నలుపైపుల నుండి ఈ రకమైన విమర్శలు రావటంతో 2001లోనే దలేర్ తనకు, తన కుటుంబ సభ్యులకు సెక్యూరిటీ ఏర్పాటు చేసుకున్నాడు.



ఇవన్నీ ఒక ఎత్తు అయితే సంగీత వర్గాలు మాత్రం దలేర్‌ను ముద్దుగా 'డాలర్' మెహందీ అని పిలుచు కుంటాయి. ఆల్బమ్‌లోనూ, సినిమాల్లోనూ, వీడియోలలో, స్టేజ్ షోలలో పాడటానికి దలేర్ భారీగా డబ్బులు వసూలు చేస్తాడనే విమర్శ వుంది. దీని గురించి వివరిస్తూ "ఇదంతా వ్యాపార ప్రపంచం. మొదట్లో నాకు ఇవ్వాల్సిన డబ్బులు ఇవ్వడానికి కూడా విపరీతంగా తిప్పించుకునే వారు. ఇహ ఇక లాభం లేదని ఏ కాంట్రాక్టు అయినా - స్టాంప్ పేపర్లమీద రాసుకోవాల్సిందేననే షరతు పెట్టాను. ఇంత నిక్కచ్చిగా వ్యవహరిస్తున్నాడనే నా మీద ఈ తరహా విమర్శలు వస్తున్నాయి" అని అంటున్నాడు.




**తగ్గిన ఆల్బమ్స్ అమ్మకాలు:**

దలేర్ మీద మానవ అక్రమ రవాణా కింద ఛార్జ్‌షీట్ దాఖలు కావటంతో ఆయన ఆల్బమ్స్ అమ్మకాలు బాగా తగ్గాయని అంటున్నారు. అయితే కేవలం దలేర్ వే కాకుండా పాప్ ఆల్బమ్స్ అన్నింటి అమ్మకాలు సంవత్సరంగా తగ్గు ముఖంలోనే వున్నాయని - అయితే దలేర్ పై వచ్చిన ఆరోపణలు వల్ల ప్రత్యేకించి ఆయన ఆల్బమ్స్ సేల్స్ బాగా తగ్గాయని చెబుతున్నారు. టిప్స్ సంస్థ అధికారులు మాత్రం అమ్మకాలు తగ్గడానికి ఛార్జ్‌షీట్ దాఖలు కావటానికి ఏ మాత్రం సంబంధం లేదని అంటున్నారు. పాటలు వినాలనుకునే శ్రోత - గాయకుడి వ్యక్తిగత వివరాలకి ప్రాధాన్యం ఇవ్వడు. పాకిస్తానీ గాయకుడు అద్నామ్ సామీ ఆల్బమ్స్‌కి ఇండియాలో వున్న గిరాకీనే ఇందుకు ఓ ఉదాహరణ అని అంటున్నారు.

**దలేర్ తరహాలో మరికొందరు..**

కేవలం దలేర్ మెహందీనే కాదు దాదాపుగా ఇదే ఆరోపణలు మరికొందరు కళాకారుల మీద వచ్చాయి. మరో పంజాబీ గాయకుడు సుఖ్వీందర్ సింగ్ మాన్, నృత్య కళాకారిణి మల్లికా సారాబాయి మీద కూడా అక్రమ మానవ రవాణా విషయమై విమర్శలు వున్నాయి. సహజంగా కళాకారులు సున్నిత మనస్కులై వుంటారు. ఓ సాధారణ స్థాయి నుండి ఒక్కో మెట్టు అధిరోహిస్తూ వారు ఉన్నత స్థాయికి చేరుకోవటానికి ఎన్నో కష్టనష్టాలు అనుభవిస్తారు. ఈ అడ్డంకుల్ని ఛేదించుకుంటూ తమలోని సున్నితత్వాన్ని కాపాడుకుంటూ వాళ్లు ముందుకెళ్లాలి. ఈ ప్రయాణంలో ఎదురయ్యే చిన్న విమర్శ అయినా వాళ్ల మానసిక స్థితిని అల్లకల్లోలం చేస్తుంది. తెలిసో తెలియకో చేసే చిన్న చిన్న పొరపాట్లు - ఇమేజ్ కారణంగా ఏర్పడే నిర్లక్ష్యం....ఇవన్నీ ఒక్కోసారి ఊహించని విఘాతాలను కలిగిస్తాయి. కనులు తెరిచి, బాధ్యతలను గుర్తించి మెసలుకోకపోతే కళ్ల ముందు నిర్మించుకున్న కెరీర్ ఒక్క రోజులో కుప్పకూలిపోతుంది. ప్రస్తుతం దలేర్ మెహందీ అదే స్థితిలో వున్నారు. ఇవాళ ఆయన స్టేజ్ మీద కంటే కోర్టు, పోలీస్ స్టేషన్లలోనే ఎక్కువ గడపాల్సి వస్తోంది.

**- వి. అరుణ సత్యవతి**

**క రాజు కథలు**

# ఆవిష్కారక్రమం

సింగీతం శ్రీనివాసరావు

అపుడెపుడో - కాలేజీల కాలం. ఖాసా సుబ్బారావు గారు, గోరాశాస్త్రిగార్ల ప్రోత్సాహంతో భారతి, స్వతంత్ర లాంటి పత్రికల్లో కొంతకాలం నా రచనా కేళి సాగింది. ఆనాడు రాసిన "అంత్యఘట్టం" నాటికను ఇప్పుడు కూడా ఆంధ్ర విశ్వవిద్యాలయంలాంటి చోట్ల ప్రదర్శిస్తున్నారంటే అదో తృప్తి. ఆ రోజుల్లోనే టంగుటూరి సూర్యకుమారిగారు నటించి, ప్రదర్శించిన 'చిత్రార్జున' నాటకం పాటలతో సహా రాసాను. ఈ ప్రదర్శనను పండిత జవహర్‌లాల్ నెహ్రూగారు ఢిల్లీలో చూశారు. ఆ తర్వాత టామ్ బకన్ అనే స్కాట్లండ్ రచయిత దీనిని ఇంగ్లీషులో తర్జుమాచేస్తే, దీన్ని అమెరికాలో తెలుగు పాటలతో ప్రదర్శించారు. ఈ తర్వాత నేను పెద్దగా రాసిందేదీ లేదు. "మీ సినిమాలకి మీరే మాటలు రాస్తే బాగుంటుంది" అని జంధ్యాలగారు చాలాసార్లు చెప్పారు. ఆయన మాటల్ని కాదనలేక "పుష్పక విమానం" తీశాను. "మీరు పాటలు రాయండి" అంటూ వేటూరిగారు ఎప్పుడూ ప్రోత్సహిస్తూ వుండేవారు. 'భైరవద్వీపం'లో ఒక పాట ఆయన రాయాల్సుంది. ఎన్నాళ్లకూ ఆయన దర్శనం లభించకపోయేసరికి గత్యంతరం లేక నేనే "విరిసినది వసంతగానం" పాట రాశాను. ఆ పాట బాగా రాశారని వేటూరిగారు మెచ్చుకోవడమే నాకొచ్చిన పెద్ద అవార్డు.



మళ్ళీ యిన్నాళ్ళకు 'హాసం' చదువుతూంటే నాకూ కథలు రాయాలని బుద్ధి పుట్టింది. కాలేజి రోజుల ఉత్సాహం మళ్ళీ పుట్టుకొచ్చింది. ఆ రోజుల్లో పింగళి నాగేంద్రరావుగారు నా చేత స్క్రిప్టు ఒక రఫ్ వర్షన్ సీన్లు రాయించేవారు. వాటిల్లోంచి ఎన్నో ఐడియాలూ, శ్రీకృష్ణార్జున యుద్ధంలో అర్జునుడి పేరు 'అజిభీధఘపావిశ్వేసకి' లాంటివి ఎన్నో వచ్చేవి. ఇంట్లో వాటిని ఫెయిర్ కాపీ చేసే పని నా అర్ధాంగి కళ్యాణిది. మళ్ళీ ఆ రోజులు గుర్తొచ్చేలా ఈ కథల్ని కళ్యాణే ఫెయిర్ కాపి చేసింది. ఈ కథల్ని ఆనందింస్తూ - "ఎన్‌జాయ్" చేస్తూ అంటే కరెక్ట్‌గా చెప్పామనిపిస్తుంది- రాశాను. చదివిన వాళ్ళు యింతో కొంతో ఎన్‌జాయ్ చేస్తే మరింత ఆనందిస్తాను.

సింగీతం శ్రీనివాస రావు

అనగనగా ఓ రాజ్యం. దాన్ని పాలిస్తున్న ఓ రాజుగారు. నిజానికి ఈ రాజుగారిపేరు అనవసరం. మా అమ్మమ్మ అనగనగా ఓ రాజని కథ మొదలెట్టెదే తప్ప ఏరోజూ రాజు పేరు చెప్పలేదు. కాని ఆ రోజులు వేరు. కథ బాగుంటే చాలు. రాజే పేరును గురించి ఎవరూ పట్టించుకునేవారు కారు. రోజులు మారాయ్. ఇపుడు కథ ఎలా వున్నాసరే, అది యే రాజును గురించి, అతని పేరేమిటని అడుగుతారు. పెద్ద పేరైతే ఎగబడి వింటారు. పేరు లేకపోతే దాని దరిదాపులలోకి కూడా రారు. అందుకని పేరంటూ ఏదో ఒకటి ఉండాలి కనుక మన రాజును క్లుప్తంగా "క" అని పేరు పెట్టుకుందాం. ఈ క రాజు కథలు ఎన్నో ఎన్నెన్నో.

క రాజుగారికి ఒక మంత్రి. అతని పేరంటారా? అఖ్ఖర్లేదు. పేరుండ వలసింది ముఖ్యులకే.

క రాజుగారు మొదట్నుంచీ కళాప్రియులు. పొద్దున్న లేచినప్పట్నుంచి సాయంత్రం వరకూ వివిధ కళలను, కళాకారులను ప్రోత్సహించడమే అతని నిత్య కర్తవ్యం. తిండి, గుడ్డ, కొంప లాంటి సాధారణ విషయాలను మంత్రికప్ప చెప్పేవాడు. ఈ పనుల్ని మంత్రి తన ఉప మంత్రులకు పురమాయిస్తే, వాళ్ళు తమ క్రిందున్న పదహారు ఉపోప మంత్రులకు అంటగట్టేరు. ఇలా ఇలా ఆజ్ఞలు చివఱవరకు ప్రాకి రాజ్యంలోని ప్రజలంతా "అహా! మన రాజ్యంలో అందరూ ఆజ్ఞాపించేవారే" అని సగర్వంగా చెప్పుకునేవారు.

కళాకారులను ప్రోత్సహించడమే కాకా, తనే ఒక కళాకారుడై ఎన్నో ప్రయోగాలు చేశాడు క రాజుగారు. తెల్ల కాగితం మీద తెల్ల రంగులతో "సర్వాంతర్యామి" అనే చిత్రపటాన్ని గీస్తే, అందరూ దాన్ని ఎంతగానో మెచ్చుకున్నారు. దీపాల్ని ఆర్పేసి దృశ్యాన్నంతా జనమే ఊహించుకోవాలంటూ "ఊహ" నాటకాన్ని రాస్తే, దాని ప్రదర్శనను జనం మళ్లీ మళ్లీ చూసి రకరకాలుగా ఊహించుకున్నారు. దేవాలయాల్లో మంత్రాలకు తాళ వాద్యాలు జతచేసి తాళంలో వల్లిస్తే భక్తులు తండోపతండాలుగా వస్తారని చెప్పాడు. కాని పూజారుల నేర్పరితనం ఈ అంతస్తును చేరుకోలేక ఈ ప్రక్రియ కుదరలేదు. ఇలా ఎన్నెన్నో రకాలుగా నూతనత్వాన్ని

తీసుకురాడానికి ప్రయత్నిస్తున్న క రాజుకు ఒక రోజు ఒక అరుదైన ఆలోచన వచ్చింది.

అది తన నగరంలో మయ సభను మరిపించ చేసే ఒక అపూర్వమైన భవనాన్ని కట్టాలని. రాజుగారికి ఆలోచన రావడమెంత? ఆజ్ఞలు దొర్లడమెంత? మరుక్షణం మంత్రి, ఉపమంత్రులు, ఉపోప మంత్రులు, వారి పరివారం అంతా భవన నిర్మాణ కార్యక్రమంలోకి దిగారు.



రాజ్యంలోని శిల్పులు, చిత్రకారులు, భవన నిర్మాణ నిపుణులు ఎక్కడెక్కడ వున్నారో అందరూ నగరం చేరవసిందిగా ఆజ్ఞాపించారు. ఇంతమంది కళాకారులు మన రాజ్యంలో దొరుకుతారా అని మొదట మంత్రి సందేహించాడు. తీరా చూడబోతే ప్రతి వూరిలో, ప్రతి వీధిలో, ప్రతి ఇంట్లో యింతో అంతో కళాకారులు వున్నారని తెలిసి మంత్రి ఆశ్చర్యబోయాడు. అన్నదానానికి వచ్చిన జనంలా కళాకారులందరూ అంతఃపుర మైదానం దగ్గర చేరారు. భవన నిర్మాణ మంత్రి ఆదేశాను సారం ఎవరెవరికెంతెంత సత్తా వున్నదో పరీక్షలు చేసి వారి వారి యోగ్యతల ప్రకారం వారికి వివిధ శాఖ లలో నిర్మాణపు పనులు అప్పగించారు.

అంచెలంచెలుగా భవన నిర్మాణం పునాదులతో మొదలై పై గోడలు, స్తంభాలు, రూపు దిద్దుకో సాగింది. మొత్తంమీద అనతి కాలంతోనే మొత్తం భవనం గదులతో సహా, ఉద్యానవనాలతో సహా, రంగు రంగుల గోడలతో సహా పూర్తయింది.

భవనం పైన శిఖరంలాగ ఒక అర్ధగోళాకారపు గోపురం కట్టారు. దానికి మకుటం లాగ ఒక కలశాన్ని నిర్మించారు. గోపురానికి చక్కటి పసుపు రంగు పూశారు. పై కలశానికి రంగు పుయ్యడం ఒకటే మిగులుంది. దానికి బంగారు రంగు పూయవలసుంది. కాని దానికి మాత్రం పూయవద్దని క రాజుగారు ఆజ్ఞాపించారు.

మంత్రికర్థం కాలేదు. సవినయంగా క రాజుగార్ని అడిగాడు. కలశానికి ఎందుకు రంగు పూయవద్దన్నారు? క రాజుగారు వివరించారు.

"మంత్రీ! ఇంత కాలంగా ఎందరో కళాకారులు ఈ భవన నిర్మాణంలో కష్టపడ్డారు. వారి పారితోషికాలు వారికిచ్చామనుకోండి అది వేరే విషయం. కాని, ఈ తరుణంలో మొత్తం పని చేసిన వారిలో ఉత్తమ కళాకారుడెవరో ఎంపిక చేసి గౌరవించాలని నాకనిపించింది. అందుకని ఈ భవన ప్రారంభోత్సవం నాడు ఆ కళాకారునిచే ఈ కలశానికి బంగారు రంగు పూయించి అతనికి బంగారు పతకం ఇవ్వాలని నిశ్చయించాను"

క రాజుగారి ఆలోచనకు అందరూ ముగ్ధులయ్యారు.

కాకపోతే ఎవరా ఉత్తమ కళాకారుడు? అది నిర్ణయించే దెవరు? ఆ నిర్ణయం రాజుగారు చేస్తేనే సబబు. అని అందరూ ముక్త కంఠంతో చెప్పడంతో చిఱునవ్వుతో రాజుగారే ఆ బాధ్యతను స్వీకరించారు. కాని ముహూర్తం రోజునే తన నిర్ణయాన్ని ప్రజలయెదుట వెల్లడిస్తానని చెప్పాడు.

భవన ప్రారభోత్సవానికి ముందురోజు సాయంత్రం దాకా ఊరంతా ఒకే కలకలం, వాదోపవాదాలు, రాజుగారు ఎవర్ని ఎంపిక చేస్తారా అని. చివరికి చీకటి పడేసరికి తేలిన వార్త - మొత్తం పనిచేసిన వాళ్ళల్లో చివరి జాబితాలోనికి వచ్చినవారు ఇద్దరే యిద్దరు. వాళ్ళు అన్నదమ్ములు. రంగులు



పూసే ప్రక్రియలో నిపుణులు. ఇద్దరూ ప్రతిభావంతులే అయినప్పటికీ అన్న కంటే తమ్ముడే కాస్త మెరుగైన వాడని అందరూ చెప్పుకుంటారు. రాత్రయేసరికి రాజుగారు తమ్ముణ్ణే ఎంపిక చేశారనే వార్త ప్రబలిపోయింది.

ఉదయ భానుని కిరణాలు భవన గోపురాన్ని కొత్తరంగు పూయించుకోడానికి ఎదురు చూస్తున్న కలశాన్ని కాంతివంతం చేశాయి. కలశానికి రంగు పూసేందుకు వీలుగా గోపురాన్ని అంటుకొని కలశం వరకు ఒక ఇనుప నిచ్చెన అమర్చబడి వుంది.

ఉత్సవానికి వచ్చిన జనంతో అంతా కిటికిటలాడుతోంది. క రాజుగారు ఆగమించారు. భవన నిర్మాణంలో కృషి చేసిన వారిని అభినందిస్తూ, ఈ రోజు తాము ఎంపిక చేసిన ఉత్తమ కళాకారుడిగా "అన్న" పేరు వెల్లడించారు. జనమంతా ఒక్క క్షణం నిర్ఘాంతపోయారు. కాని ఇది రాజుగారి నిర్ణయం. అంతా మౌనం. వేదిక మీదకి అన్న వచ్చి బంగారు రంగులో ముంచిన కుంచెను చేత బట్టుకొని, నిచ్చెన యెక్కి కలశానికి రంగు పూశాడు. నలుమూలలూ కరతాళ ధ్వనులతో మారుమ్రోగింది. బంగారు పతకం బహూకరణతో సభ ముగిసింది.




సాయంకాలం క రాజుగారు ఏకాంతంగా వున్న సమయంలో మంత్రి ప్రవేశించి సవినయంగా అడిగాడు.

"మహారాజా! ఉత్సవం బ్రహ్మాండంగా జరిగింది. కాని ఒక సందేహం"

"ఏమిటది?"

"ఉత్తమ కళాకారులైన అన్నదమ్ములలో తమ్ముడే ప్రతిభావంతుడని అందరూ చెప్తారు. కాని మీరు మాత్రం అన్ననే ఎంపిక చేశారు. దీని అంతరార్థం......"

"మంత్రీ! మీరు చెప్పినమాట వాస్తవం. నిజానికి తమ్ముడే ప్రతిభావంతుడు. కాని నిజాలువేరు, అవసరాలను బట్టి తీసుకునే నిర్ణయాలు వేరు. అందరూ తమ్ముడి ప్రతిభను గురించి చర్చించుకున్నారే కాని అతని తదితర అర్హతలను గురించి ఆలోచించలేదు. చిన్నప్పుడు తమ్ముడికి పక్షవాతం వచ్చి కాళ్ళు పడిపోయాయి. భవనానికి అద్భుతంగా రంగులు పూసినా అది ఒకచోటనుంచి మరోక చోటకి డేకుతూ చేసిందని అందరికీ తెలుసు. మరి ఈనాటి ఉత్సవానికి అతన్ని ఎంపిక చేస్తే అతను నిచ్చెన ఎలా ఎక్కగలడు! కలశానికి ఎలా రంగు పూయగలడు? అదే అన్న ఐతే ప్రతిభలో కొద్దిగా తక్కువైనప్పటికీ నిచ్చెన ఎక్కగలడు. ఉత్సవాన్ని జయప్రదం చేయగలడు.

చూడండి మంత్రీ! జీవితంలో ఎవరైనా సరే ప్రతిభ వున్నంత మాత్రాన సరిపోదు. నిచ్చెన ఎక్కగలిగుండాలి" అంటూ రాజుగారు అంతఃపురంలోనికి వెళ్ళిపోయాడు.

క రాజుగారి మాటల్ని నెమరు వేస్కుంటూ అలాగే వుండిపోయాడు మంత్రి.

# ఎలుక వచ్చె ఇల్లు భద్రం

ఇలపావులూరి మురళీమోహనరావు



18

**హెచ్చరిక**

విరగబడి నవ్వితే గుండె చిక్కబట్టి ఊపిరాడక అవస్థపడేవారు కామెడీ యాక్ట్ 2003 ప్రకారం ఈ సీరియల్ చదవడం నిషేధం.

ఒకవేళ మీ పొట్టచెక్కలైతే పత్రిక నుంచి ఎలాంటి పరిహారం రాదు. ఈ హెచ్చరిక ఈ సీరియల్ పూర్తయ్యేంత వరకు అమలులో ఉంటుంది.





## జరిగినకథ



వెంకట్రావు, సుందరిల ఇంట్లో ఓ ఎలుక చేరి నానా రభసా చేస్తూంటుంది. దాన్ని చంపడానికి పెట్టిన మందును వాళ్ల పాప రుచిచూడడంతో ఉత్తుత్తి పరీక్షల పేరిట డాక్టర్లు వేలాది రూపాయలు ఖర్చుపెట్టిస్తారు. మేనేజరు ఇంటినుండి పిల్లిని తెస్తారు. మర్నాడు చీలికలు పేలికలై కనిపించింది ఎలుక. అప్పటినుండి పిల్లీ కనబడడం మానేస్తుంది. కంగారుపడు తూండగానే కొన్నాళ్లకు ఆరుకూనలతో సహా అటకమీద ప్రత్యక్షమవుతుంది. పాలెక్కువై పిల్లి కూనలలో ఒకటి చనిపోవటంతో ప్రాయశ్చిత్తం చేయించాలన్న పక్కింటి ఆండాళ్ళమ్మ సలహా విని వెంకట్రావు పురోహితుడు శాస్త్రిని కలుస్తాడు. శాస్త్రి వెంకట్రావు ఇంటికి వచ్చి నరకబాధల బూచిచూపి ఇరవై వేల రూపాయల ఖర్చుతో శాంతి చేయించాలంటాడు. గత్యంతరం లేక వెంకట్రావు ఒప్పుకుంటాడు. పూజకు కూర్చున్నాక బాదంపప్పు, వక్కలు తేలేదని, అవి లేకపోతే అనర్థాలు తప్పవని భయపెట్టి వాటిని తీసుకురమ్మంటాడు. తూతూ మంత్రాలు చదివి తెచ్చిన పూజా సామాగ్రి, ఫలహారాలు మూటకట్టుకుని వెళ్లిపోతాడు శాస్త్రి. జరిగిన తతంగమంతా తన కొలీగ్ నారాయణకు చెప్తాడు వెంకట్రావు

(ఇక చదవండి)

"ఒక్క ఎలుక మూలంగా నీకింత నష్టం వచ్చిందంటే నాకెందుకో నమ్మబుద్ధి కావడంలేదు తరచి తరచి చూస్తే, దీర్ఘంగా మనసుతో ఆలోచిస్తే నాకు ఒకటే విషయం స్ఫురిస్తున్నది" అన్నాడు సూపరెంటెంట్ నారాయణ.

''ఏంటండీ అది?'' అడిగాడు వెంకట్రావు.

''ఇదంతా వాస్తు పురుషుడి లీలా విలాసం. ఆయన ఆటలో ఎలుక, పిల్లి, పోలీసులు, పిల్లి కూనలు, శాస్త్రి... వీరంతా పావులు.'' గంభీరంగా అన్నాడు నారాయణ.

ఆ మాటలకు ఆశ్చర్యపోయాడు వెంకట్రావు.

''వాస్తుపురుషుడా... మధ్యలో ఆయనెవరు?" అన్నాడు.

చిద్విలాసంగా నవ్వాడు నారాయణ.

"మనిషికి పస్తు... ప్రభుత్వానికి శిస్తు, ఇంటికి వాస్తు అనేవి అతి ముఖ్యమైనవి. రెండు రోజులు పస్తుంటేనే కానీ మనిషికి ఆకలి విలువ తెలియదు. అపుడే కష్టపడి పనిచేస్తాడు. శిస్తులు సక్రమంగా వసూలైతేనే కానీ ప్రభుత్వం సజావుగా నడవదు. అలాగే వాస్తు సక్రమంగా ఉంటేనే కానీ ఇల్లు సాఫీగా ఉండదు." అన్నాడు.

''నిజంగా వాస్తుకు అంత మహత్యం ఉందంటారా సార్."

''తిన్నగా అంటావేంటోయ్... వాస్తును గురించి గత పాతిక సంవత్సరాలుగా వెయ్యికిపైగా గ్రంధాలను పరిశీలించి పఠించి అవగాహన చేసుకుని సారాంశాన్ని కాచి వడపోసిన వ్యక్తిగా చెబుతున్నాను. వాస్తంటే వాస్తే"

"వాస్తంటే ఏంటి సార్?"

ఎదుటివాడు తెలివితక్కువవాడిలా తనను ప్రశ్నలడిగి తన సమాధానం కోసం ఎదురుచూసే




వాడైతే నారాయణకు ఎక్కడ లేని ఆనందం కలుగుతుంది. ఒక మేక దొరికినందుకు పొంగిపోయాడు నారాయణ. గొంతు సవరించుకున్నాడు.

"జాగ్రత్తగా విను... కుర్రాడివి. గ్రంధపఠనం అంతగా అలవాటు లేనివాడివి. వా ప్లస్ అస్తు వాస్తు. వ అంటే లోకం. అస్తు అంటే బాగుండాలి అని అర్థం. టోటల్‌గా వాస్తు అంటే లోకం బాగుండాలి. అని అర్థం. అంటే ప్రపంచ శ్రేయస్సు కోరేది వాస్తు.

ప్రపంచ శ్రేయస్సు కోరి మన ఋషులు అనేక సూత్రాలు చెప్పారు. వాటిని పాటించడమే వాస్తు పాటించడం. ఈ వాస్తు అనేది నిరుపేదలను లక్షాధికారులను చేస్తుంది. కోటీశ్వరులను వారం రోజుల్లో బిచ్చగాళ్ళను చేస్తుంది. ఉక్కుముక్క లాంటి వాడిని తోలుతొక్కను చేస్తుంది. ఎయిడ్స్ తగిలినవాడిని దుక్కలా మారుస్తుంది. నీకు ఆ విధంగా నష్టం మీద నష్టం వస్తుందంటే వాస్తుదోషం అనడంలో సందేహం లేదు.'' వివరించాడు నారాయణ.

వెంకట్రావును భయం ఆవహించింది. తానీ మధ్యనే ఆరు లక్షలు పెట్టి ఇల్లు కట్టుకున్నాడు. చూసిన వారంతా బాగానే ఉందన్నారు. మళ్ళీ వాస్తు దోషం అంటున్నాడేంటీయన అనుకున్నాడు.

"మరి వాస్తు సంగతి పట్టించుకోని వారి సంగతి?"

"అధోగతే.. మా బాబాయి రిటైరైన తరువాత పది లక్షలు పెట్టి ఇల్లు కొనుక్కున్నాడు. ఆయనకీ వాస్తులమీద నమ్మకం లేదు. చాలా సలహాలిచ్చాను. వినలేదు. గృహప్రవేశం అయిన వారం రోజుల తరువాత లారీ కిందపడి పచ్చడైపోయాడు. అపుడు చూద్దును గదా! ఇంటికి నైరుతివైపు గోలీకాయలు ఆడుకుందామని పిల్లలు చిన్నగుంట తవ్వారు. నైరుతి వైపు గుంట ఉంటే యజమానికి ప్రాణగండం అనివార్యం కదా!"

"ఎక్కడో రోడ్డు మీద మీ బాబాయి గారు లారీకిందపడి చావడానికి ఆ గుంటే కారణమంటారా? లారీ డ్రైవర్ తాగి లారీ నడుపుతుండచ్చు. లేదా మీ బాబాయి గారు పొరబాటున తూలి లారీ కింద పడుండవచ్చు."

నవ్వాడు రంగనాథం.

"వైనాట్? అలాగే జరిగుండొచ్చు. కానీ ఎందువల్ల జరిగిందీ అంటావు? వాస్తుదోషం. ఆ చిన్న గుంటే మా బాబాయిని పెద్ద గుంటలోకి నెట్టింది" అన్నాడు.

వెంకట్రావు చొక్కా తడిసిపోయింది.

* * *

"అయితే ఇపుడేం చెయ్యమంటారు సార్?" అడిగాడు.

నారాయణ మనసు పొంగిపొర్లిపోతున్నది. ఇంతలో ప్యూన్ వచ్చి ఒక ఫైలును నారాయణ టేబుల్ మీదుంచి వెళ్ళిపోయాడు.

అది స్టాఫ్ ఇంక్రిమెంట్స్ ఫైల్.

ఆత్రంగా ఫైలు తెరిచాడు నారాయణ. పైకి కిందికి చూసి నిట్టూర్చాడు.

"చూడు వెంకట్రావ్... నీ ఇంటి వాస్తుదోషం మన హెడ్డాఫీసు వరకూ కొట్టింది. ఎంతో ప్రేమతో నీకు ఇంక్రిమెంట్ రికమెండ్ చేశాను. కానీ వారు



శాంక్షన్ చెయ్యలేదు. చూశావా! వాస్తు దోషం ఎలా ఉంటుందో?" అన్నాడు.

"ఎందుకని సార్?" గాభరాగా అన్నాడు వెంకట్రావు.

"నీ ఫెర్ఫార్మెన్స్ అంత బాగాలేదట. అందుకని ఇంక్రిమెంట్ స్టాప్ చేశారు."

"నా ఫెర్ఫార్మెన్స్ బాగాలేదా? మీరే చూస్తున్నారుగా నేను ఎంత పడి పని చేస్తున్నానో! మీరు రాయందే వాళ్ళకెలా తెలుస్తుంది సార్?

తడబడ్డాడు రంగనాథం.

"నేనే రాశానా? హావునవును. నేనుగాక మరెవరు రాస్తారు? చూశావా వాస్తుదోషం! నాకు తెలియకుండా నేనే నీ పనితనం బాగా లేదని రాశాను. నీ యింటి వాస్తు బాగుంటే నా కలం అలా రాసి ఉండేది కాదు. ఎల్టీసీ అప్పారావును చూడు నెలకు ఇరవై రోజులు ఆఫీసుకు లేట్‌గా వస్తాడు. రెండు గంటలు ముందుగా వెళ్ళిపోతాడు. అతనికి నాలుగు ఇంక్రిమెంట్స్ శాంక్షనయ్యాయి. అటువంటి బద్ధకస్తుడికి నాలుగింక్రిమెంట్సంటే అది అతని ఇంటి వాస్తు ఫలం!" అన్నాడు.

"నా యింటి వాస్తు మన హెడ్డాఫీసుకేం తెలుస్తుంది సార్?"

"పిచ్చివాడా! అదేనయ్యా వాస్తంటే. వాస్తు బాగున్న ఇంట్లో పెళ్ళికూతురు శూర్పణఖలా ఉన్నా సీతలా కనిపిస్తుంది. వాస్తు బాగుండకపోతే ఐశ్వర్యరాయయినా కల్పనారాయిలా కనిపిస్తుంది. నీ యింటి వాస్తు నువ్వు అమెరికాలో ఉన్నా కొడుతుంది. వాస్తు విశ్వవ్యాపితం. అంతెందుకు? మొన్న వైట్ హౌస్‌ను కూల్చేయాలనుకున్న టెర్రరిస్టులు వైట్ హౌస్ వాస్తు బాగుండటంతో దాని జోలికి పోలేక వరల్డ్‌ట్రేడ్ సెంటర్ని కూల్చేశారు. దాని వాస్తు బాగా లేదని తరువాత తేలింది."

"మరిప్పుడు నన్నేం చేయ్యమంటారో చెప్పండి సార్."

"మంచి వాస్తు పండితుడిని కలువు. అతడు చెప్పే సలహాలు పాటించు."

"అటువంటి వాళ్ళెవరైనా ఉన్నారా సార్?"




"వాస్తు భూషణం అని నాకు తెలిసిన ఉద్దండ పండితుడొకాయనున్నాడు. వెంటనే వెళ్ళి ఆయనను మీటవు." చెప్పాడు నారాయణ.

"అలాగే సార్" వెళ్ళిపోయాడు వెంకట్రావు. వెంకట్రావు వెళ్ళగానే అప్పారావు వచ్చాడు.

"సార్... నా ఇంక్రిమెంట్లు?" నసిగాడు.

"ఇంక్రిమెంట్ల సంగతి తరువాత! ఇప్పుడు టైమెంతైంది?" అడిగాడు నారాయణ.

"మీ వాచీ పని చెయ్యడం లేదా సార్?"

"కుళ్ళు జోకులెయ్యకు... వాటీజ్ టైమ్ నౌ?"

"పన్నెండయిందండీ"

"ఆఫీసు ఎన్ని గంటలకు?"

"పది గంటలకు సార్"

"రెండు గంటలాలస్యానికి కారణం?...?"

"తమ పిల్లలని స్కూల్లో దించి ఇంటికి వెళ్ళానండీ. సూపర్ మార్కెట్‌కెళ్ళి సరుకులు తెమ్మన్నారండీ మేడమ్‌గారు. అవి తెచ్చి ఇంట్లో ఇచ్చేసరికి ఆలస్యమైందిసార్. మీరేమైనా అంటే తనతో చెప్పమన్నారండీ... సూపర్నెంటుగారు చాలా స్ట్రిక్టు అని చెబుతూనే ఉన్నానండీ. ఆ.. ఏడిశాడు. వాడొక సూపర్ నువ్వొక చీపురు అన్నారండీ... అంతేకాదు..."

"ఆ..... ఆ... ఆల్‌రైట్ ఆల్‌రైట్... అఫీషియల్ అని రాస్తాన్లే... వెళ్ళి పని చేస్కో..."

"తమ పిల్లల పుస్తకాలకు అట్టలు వెయ్యాలని ఆర్డరువేశారండీ మేడమ్‌గారు. ఆ పని చేస్కోమంటారా? లేక...."

"సరె సరె... ముందు ముఖ్యమైందేదో ఆలోచించుకుని మనం పని చెయ్యాలి. వెళ్ళి అట్టల సంగతి చూడు. గో..."

"నా ఇంక్రిమెంట్లు సార్..."

"మన సిఫార్సుకు తిరుగుంటుందటోయ్... నాలుగు రాశాను. నాలుగూ ఇచ్చారు. నువ్వు చాలా బుద్ధిమంతుడివి. ఆ వెంకట్రావుగాడు చూడు. నా స్కూటర్ స్టెఫినీ మార్చిపెట్టవయ్యా అంటే నేనున్నది ఆఫీసు పన్లు చెయ్యడానికి కానీ పర్సనల్ పన్లు చెయ్యడానికి కాదు అని పోజులు గొట్టాడు. వాడి ఇంక్రిమెంట్లు మొత్తం దిగ్గోశాను. రేపు నేను ఆఫీసరును కానీ... వాణ్ణి ఏదో వంకపెట్టి సస్పెండ్ చేస్తాను." పక పక నవ్వాడు నారాయణ.

"చిత్తం చిత్తం... తమరు తల్చుకుంటే తిరుగేముందిసార్... తమరు ఆఫీసర్ కాగానే..."

"అర్థమయిందిలే.... నీకు ప్రమోషన్ ఖాయం. సరె సరె నువ్వు ఇంటికెళ్ళి అట్టల సంగతి చూడు. మనకు స్టేషనరీ సప్లై చేసే వాడున్నాడుగా. వాడిదగ్గర స్ట్రాంగా ఉండే అట్టలు, గమ్‌బాటిల్ తీసికెళ్ళు. డబ్బులివ్వకు."

"మీరు చెప్పాలా సార్... అసలు డబ్బులడగటానికి వాడికెన్ని గుండెలు!"

ఇద్దరూ నవ్వుకున్నారు.

-(ఇంకావుంది)



# కొమ్మ కొమ్మకో సన్నాయి...

## పాటసారి డైరీలోంచి....





ఆకాశవాణిలో సిరికాకొలను చిన్నదానికి సప్తస్వరాల ఏడువారాల నగలు తొడగిన పెండ్యాల గారికి ఒలేటి వెంకటేశ్వర్లు గారు పాదాభివందనం చేసినప్పుడు, ఎంత పుణ్యము చేసి పాపిగా మారె అని అహల్యను గురించి నేను రాయగానే రమణీయంగా రమణగారు నన్ను చూసి నవ్వినప్పుడు, ఆకతాయి తాళగతులన్నీ మచ్చిక చేసుకుని పుహళేంది నా పాటలను భాగవత గీతాలుగా తీర్చి దిద్దినప్పుడు - అప్పుడప్పుడు నా గుండె వినిపించిన చప్పట్లు ఓ గుప్పెడు -

చిరకాలపు పాటసారినై ఒక్కసారి వెనుదిరిగి చూసుకుంటే ఎన్నో జ్ఞాపకాలనీడలు, ఎన్నెన్నో వసంతాల పూలవాడలు చేరువై ఆప్యాయంగా మనస్సును స్పృశిస్తాయి.

ముఖ్యంగా వాణిజ్య వాణీ పాణినై రాసిన పాటల వల్ల పొందిన సంతోషం కన్న వాణిజ్యపు కొలతలకి దూరమైన పాటల వల్ల కలిగిన ఆనందం మరింత దగ్గరై గతకాల స్మృతి చందనాలను మెత్తగా హృదయానికి పూస్తుంది. అలా నాకు యిష్టమైన పాటలు ప్రేక్షకులకు గుర్తు కూడా వుండక పోవచ్చు. 'సిరిసిరిమువ్వ'లో 'ఝుమ్మంది నాదం' గుర్తున్నట్టు 'అందానికి అందం ఈ పుత్తడి బొమ్మ' అనే పాట వుండకపోవచ్చు. కానీ ఆరెంటిలో హార్దికానందం కలిగించేది నాకు ఈ పాటే! అది వ్యక్తిగతం అనుకోండి.

అందుకనే అనేక ఇంటర్వ్యూలలో మీ పాటల్లో మీకు నచ్చినదేది అనే ప్రశ్న నాగొంతున పడ్డ పచ్చి వెలక్కాయ!

రాఘవేంద్రరావుగారి సినిమాలెన్నో చాలా మందికి గుర్తున్నాయి. కానీ ఆయన తీసిన చాలామంచి చిత్రం ఎందరికి గుర్తుంది!? అందులో పాటలు ఎవరికి వచ్చు!? ఆ చిత్రం 'నిండు నూరేళ్లు' - దాని కంపోజింగు నాగార్జున సాగర్‌లో జరిగింది, రాను రాను పెరిగిపోతున్న సాంకేతిక సమ్మర్ధం (దుష్ట సమాసం - క్షంతవ్యం) లో ఆత్మ, హృదయం, హాయి, సుఖము, సెంటిమెంటు, నిలకడ, మెలోడీ - ఇవన్నీ గాయపడి పోతున్నాయి... మూలపడి పోతున్నాయి.

'వంశవృక్షం, ముత్యాలముగ్గు' వంటి గొప్ప చిత్రాలను తీసిన బాపురమణగార్ల పౌరాణిక చిత్రకల్పనాశిల్పాలు ఆంధ్రులకు తెలుగు అక్షరాలవలె అజంతాలు - అవి కలిగించే మధురాను భూతులు అనంతాలు.

శ్రీ రామోజీరావుగారి అభిరుచికి శిఖరాయమానమైన 'శ్రీ భాగవతం' బాపురమణల కళాతపస్వితకు దర్పణం. హిందీ భాషలో మహాభారతం, రామాయణం సీరియల్స్ తీసి యావద్భారత నీరాజనాలందుకున్న బి.ఆర్.ఛోప్రా, రామానంద్‌సాగర్‌ల కృషికి, నిర్మాణ స్థాయికి, సంప్రదాయానికి ఏమాత్రం తీసిపోని విధంగా 'శ్రీభాగవతం' విశేష వ్యయప్రయాసలకు ఎదురొడ్డి నిర్మించిన 'ఈటీవి' అధిపతులకు అఖండ విజయాన్ని ఆకాంక్షించడమే నేను చేయగలగినపని.

అలనాడు 'పండితులకు మాత్రమే' అన్నట్టు వెలసిన కవిత్రయ భారతాన్ని, పండిత పామర బాలగోపాల జనరంజకంగా 'పాండవోద్యోగ విజయాల' పేరిట రచించిన మహనీయులు తిరుపతి వేంకట కవుల వలె శ్రీ భాగవతం బుల్లితెరకు అనువదించడానికి బాపు రమణలు, ఈటీవి అధినేతలు చేసిన కృషి ఆంధ్రులకు గర్వకారణం.

ఈ 'శ్రీ భాగవతం' రచన విషయంలో ఒకటి రెండు ప్రధానాంశాలు విన్నవించుకుంటాను. ముద్దుల బుడుగు, సుద్దుల తొడుగు అయిన శ్రీ ముళ్లపూడి వెంకట రమణ సంభాషణల రచనలో అందరికీ అర్థమయ్యే ఈనాటి నోటి తెలుగు(పురాణ రచనకు శిష్టవ్యావహారికమే వుండాలి - లేదా గ్రాంధికమే రాయాలి వగైరా నిబంధనలకు ఏనాడో కాలదోషం పట్టింది) నే వాడడం ఎంతో ముద్దుగా వుంది.

అలాగే పాటల రచనలో ఆయా సన్నివేశాలకు తగిన 'డ్రామా' ప్రధానంగా తీసుకుని రాయడం జరిగింది. మాయ, వైష్ణవమాయ ప్రస్ఫుటం కావడానికి, క్షీరసాగర మధనంలోగాని, మోహినీ భస్మాసుర కథలోగాని భాషావధులను లీలగా అధిగమించి మాయాజాలాన్ని పదజాలంతో రంగరించి రాయడం ఒక కొత్త ప్రయోగం. అటువంటి 'మాయ' లేనిచోట పాట కూడా అమాయకంగానే వుండడం యిందులో విశేషం.

'గగనమున కెగిరి - గిరిగిరా తిరిగి
పడదోయు నదిరా మదిరా
సురా నదిరా అది ఇదిరా నెమ్మదిరా
సురా-సురా -సురా-ఎరా-ఎరా-ఎరా
ఇది సురలకు దొరకని దినుసురా
మగ- తనమన తపనల వయసురా
ఇది అసురుల గుండెకు సురసురా
చెలి విసిరిన వలపుల గొలుసురా
రాక్షసురా ఇది ద్రాక్షసురా
తాగిన తల తిరకాసురా
మదిరాపురి మనసురా
మదిరాక్షికిదే సొగసురా అసురా
అమరుల ఉసురా - మధువుల ముసురా'

కామదాహంతో కొట్టుమిట్టాడుతూ, మత్తుల్లై పానమత్తుల్లై 'చుక్క' కోసం ఎగబడుతున్న రాక్షసగణాన్ని ఆట పట్టించడానికి, మాయ చేయడానికి వాడిన ఈ పదజాలంలో ఈ మాయాజాలమే ప్రస్ఫుటంగా కనిపించడం విశేషం. ప్రతి పదార్థాలు వ్రాయవలసినవీ పాటలు అని కవి మిత్రులు ఒకరు అన్నట్లు.... 'తన మనతవనల వయసురా 'సురా-ఎరా' 'పడదోయునదిరా సురానదిరా' 'రాక్షసురా -ఇది ద్రాక్షసురా' (ఓరీ రాక్షసుడా ఇది ద్రాక్షపళ్లతో చేసిన సుర రా) మదిరాపురి మదిరాక్షి - వీటిని వివరిస్తే గ్రంధమే అవుతుంది.

ఈ 'సురా' పదప్రయోగ వైచిత్రికి అబ్బురపడి మిత్రులు, హాసం సంపాదకులు శ్రీ రాజాగారు ముళ్లపూడి వారికి ఫోన్ చేసి 'ఈ సురానది ఎక్కడ పుట్టింది... మదరాసులోనా హైదరాబాదులోనా?' అని అడిగారట. రమణగారు 'సీతాకళ్యాణంలోని 'సుర' గంగ పుట్టినట్టుగా ఏ నదీ పుట్టని మద్రాసు నగరంలోనే ఈ సురా గంగ కూడా పుట్టింది' అనగానే 'అయితే ఇది మదరా**సురా**' అని చమత్కరించారట!

ఈ ఉదంతం నేను ప్రస్తావించడానికి ప్రధాన కారణం సన్నివేశ సాహిత్య కల్పన ఎంత అవసరమో మనవి చేయడానికే! అది ప్రత్యక్షరంలోకి దించగలిగిన నాడు 'డ్రామా' వున్న సన్నివేశాలు సాహిత్య సంగీతాలతో కలిసి నటిస్తాయి.

అదే వస్తువు ఉదాత్తమైనప్పుడు ఉత్తమ ధ్వని, మంత్రధ్వని, సామవేద గాన ధ్వని అక్షరాక్షరం వినిపించగలిగి వుండాలి. బాపూరమణల హృదయం ఎరిగిన నేను అదే పద్ధతి అవలంబించి శుక మహర్షిని గురించి వ్రాసిన ప్రతి అక్షరం ఆ చంటిముక్కంటి వంటినంటి పెట్టుకుని అంగాంగమై అనంగమై ఉండాలని చేసిన వినమ్ర ప్రయత్నమే ఈ పాట.

ఉపనిషద్వీధిలో ఊరేగు హరియో
నిగమాద్రి శిఖరాన నిలిచేటి హరుడో
స్మృతిశాస్త్ర శాఖికా వేణువో పికమో
భవపంజరము వీడి పయనించు శుకమో
శుకమో - వేదముఖమో
బాలసూర్య ప్రభాభాసుడై శుకుడు
పూర్ణచంద్ర ప్రభాహ్లాదుడై అపుడు
సర్వజ్ఞుడై వచ్చె చంటిముక్కంటి
సర్వ ఋషి లోకమ్ము మొక్కె పదమంటి'

ఇక్కడ సర్వజ్ఞశబ్దం శివుడికి పర్యాయపదం గనుక 'చంటిముక్కంటి'గా శుకబాలయోగిని వర్ణిస్తూ వాడడం జరిగింది.

వ్యాసప్రోక్తమై, 'తెలుగుల పుణ్యపేటి' పోతన మహాకవి ప్రణీతమై ఈటీవీ గర్భశుక్తిముక్తాఫలమై వెలువడుతున్న 'శ్రీభాగవతం'లో పాటలు రాయడం నా అదృష్టంగా భావిస్తున్నాను.

'శ్రీ భాగవతం' సీరియల్‌లో మామ మానస పుత్రుడు అప్పు - పుహళేంది సమకూర్చిన సన్నివేశోచిత సంగీతం మధురాతి మధురం. మత్త కోకిల, శార్దూల విక్రీడితం, భుజంగ ప్రియాతం, ఉత్సాహం, లయగ్రాహి, లయ హరిణి, ద్విపద, సీసం, వంటి కవితా ఛందోరీతులను సంగీతంగా మలచి తాళాంతరాలను సృష్టించడం నాడు శ్రీకె.వి.మహదేవన్‌కే చెల్లింది. నేడు అది పుహళేంది సరికొత్త రీతులతో సాధించారు. 'ఆరేసుకోబోయి పారేసుకున్నాను' అనే సీసపద్యం ఎంతో ప్రజారంజకమైన పాటగా పండించిన మామను తలపిస్తూ అప్పు - మోహినీ భస్మాసుర, క్షీరసాగర మథనం, నారద గీతాలు, అహల్యా వృత్తాంతం ఘట్టాలలో కథను పండించాడు.

అహల్యను గురించి
'ఎంత పుణ్యము చేసి పాపిగా మారె
రామ పాదము సోకి రమణిగా మారె'

నేను రాసినప్పుడు రామకథాసుధాంతరంగులైన రమణగారి కన్నులలో పొంగిన సరయూ ప్రవాహం అది రమణగారి మనో బుద్ధీంద్రియాల హృదయ ప్రయాగలో అంతర్వర్తినిగా వుండి పెల్లుబికిన సరస్వతి! నేను మరువలేను.

'బ్రతుకులాంటి పాటలో
బ్రతకలేని బాటలో
బాటసారినీ నన్నీ పాట పాడనీ'

ఏ రచయితకైనా కావలసింది ఆత్మతృప్తి అనే నిర్వచనీయానందమే.

**- వేటూరి సుందరరామమూర్తి**

# రాజా ఆడియో రివ్యూ




**విడుదల : సోహన్ మ్యూజిక్**
**వెల : రూ. 32/-**

ఎస్వీ కృష్ణారెడ్డి, అచ్చిరెడ్డి సంయుక్తంగా నెలకొల్పిన కొత్త సంస్థ ఎస్‌వికె ఫిలిమ్స్ పతాకంపై జగపతిబాబు, నేహ హీరోహీరోయిన్లుగా నిర్మించబడ్డ 'అతడే ఒక సైన్యం' సినిమా ఆడియో సోహన్ మ్యూజిక్ ద్వారా విడుదలయింది. ఇటీవల రివాజుగా మారిన ఆరుపాటల సంప్రదాయానికి భిన్నంగా అయిదు పాటలనే చిత్రంలో పెట్టారు. యస్వీకృష్ణారెడ్డి సంగీత దర్శకత్వంలో తయారయిన ఈ అయిదు పాటలకూ చంద్రబోసే రచయిత.

'నా పాట తేట తెలుగు పాట' అనే పల్లవితో మొదలయ్యే పాట - స్వరకర్తకి, పదకర్తకి, గాయనికి మాత్రమే కాక ఈ పాటతో ఇన్‌వాల్వ్ అయిన ప్రతి వారికి ఎంత మంచి పేరు తీసుకు వస్తుందో పాటలో ఇన్‌వాల్వ్ అయినవారికి అంతకుమించిన ఆనందాన్ని ఇస్తుంది కూడా... హిందోళ రాగచ్ఛాయలలో సాగిన ఈ పాటలో చంద్రబోస్ అందించిన సాహిత్యం అతనికి గౌరవప్రదమైన ప్రశంసలనందిస్తుంది. గాయనిగా సునీత కూడా తను పాడిన టాప్‌టెన్‌లో కచ్చితంగా పేర్కొనవలసిన పాట యిది.

సునీత, హరిహరన్ పాడిన 'మా యింటికి నిన్ను పిలిచి మీ యింటికి నేను వచ్చి టీలు కాఫీలు తాగి మాటాడిస్తే' పాట కృష్ణారెడ్డి మార్కు పాట. పాట మొదలవుతుండగా వచ్చే ఇంటర్లూడ్‌లోనే 'ఎప్పటి కప్పుడు గుండెల్లో' (ప్రేమకు వేళాయెరా) పాట ఛాయలు కనబడిపోతాయి. ఇప్పటి యువతరంలో - ప్రేమిస్తున్నట్టుగా అనుకోవడానికి ఉన్న అవకాశాలను తమాషాగా పేర్కొంటూ రాసిన గీతమిది. అంచేత భావం, భాష రెండూ అందరికీ అందుబాటులో వుండేలా జాగ్రత్తపడ్డారు. మోహన రాగంలో స్వరపరచబడిన ఈ పాటను రెండు మూడు సార్లు విని ఒకటి రెండు సార్లు పాడడానికి ప్రయత్నిస్తే సునీత కంఠంలో ఒదుగు ఒడుపుతో పాటు ఎలాంటి జిలుగులు వలుకుతాయో అవగాహనలో కొస్తుంది. సాహిత్యపరంగా... 'చేస్తూ వుంటే నచ్చేస్తూ వుంటే' అనే కాయినింగ్ బావుంది.

ప్రస్తుతం మంచి క్రేజ్ ఉన్న యస్.పి.చరణ్, సునీత కాంబినేషన్ భవిష్యత్తులో మరింత బలపడేట్టుందనిపిస్తుంది. 'ఆగస్టు పదిహేడూ ఊరంత కనువిందూ' పాట వింటుంటే! భీంప్లాస్ రాగచ్ఛాయల్లో తయారయిన ఈ పాటలో 'ఐ లైక్ డుండుండుండుం' అనే ఫ్రేజ్ చాలా మందిని వెంటాడుతుంది. 'ముద్యోగం' అంటూ చంద్రబోస్ చేసిన చిలిపి ప్రయోగం సరదాగా నవ్విస్తే - 'మనమంతా కలిసుంటే ఇల్లంతా ఇరుకు - ఇరుకింట్లో కష్టాలకి చోటేది' అంటూ చేసిన ప్రయోగంలోని తమాషా శభాష్ అనిపిస్తుంది.

కార్తిక్, సునీత పాడిన 'ఒకటి రెండు మూడు నాలుగూ... ఎన్నో వున్నాయి అంకెలూ' అనే పాట మిగిలిన పాటల కన్నా 'భిన్న'మైనది. ట్యూనూ టోనూ ఒకదానితో ఒకటి పోటీపడితే సాహిత్యం ఈ రెండిటికీ సమాంతరంగా నిలిచి ప్రత్యేకమైన గుర్తింపును పొందుతుంది. చరణాల తొలి భాగం వినగానే 'ఏంటిది.. ఈ మాత్రం ఎవరికి తెలియదు.:. టీ చెయ్యాలంటే ఏం చెయ్యాలో తెలీదా... వర్షం వస్తే ఎలా బైటికి వెళ్ళాలో తెలియదా... వీటన్నిటికి అక్షరగౌరవం కల్పించేసి పాటలో పెట్టాల్సినంత సీనుందా' అని అనిపించడం సహజం... నిజంగా అంతసీనుందో (సినిమాల్లో వాటికి) 'ఎంత సీనుందో' చరణాల ద్వితీయార్ధం వింటే తెలుస్తుంది. మానసిక వ్యక్తిత్వవికాసానికి అవసరమయ్యే ఇలాంటి పాటలు నేటి యువతరానికి చాలా అవసరం. గతంలో కృష్ణారెడ్డి - చంద్రబోస్ కాంబినేషన్‌లో 'బడ్జెట్ పద్మనాభం' సినిమాలో 'ఎవరేమి అనుకున్నా నువ్వుండే రాజ్యాన రాజు నువ్వే మంత్రి నువ్వే' అనే పాటొకటి వచ్చింది. లక్ష్యం వైపు దీక్షగా సాగిపోవాలంటే మనసుకి ఎలాటి ట్రైనింగ్ ఇవ్వాలి అనే విషయంపై ఆ పాట సీరియస్ యాంగిల్‌లో సాగిపోతే ఇప్పుడు అదే చంద్రబోస్ - కృష్ణారెడ్డి కాంబినేషన్‌లో వచ్చిన ఈ పాట సరదాగా హుషారుగా సాగిపోతుంది. ఎస్వీకృష్ణారెడ్డి గారు బైట పాడితే ఎలా వుంటుందో కార్తీక్ అలా పాడేడని ఈ పాటలో చాలా చోట్ల అనిపిస్తుంది - ముఖ్యంగా 'చెబుతానోయ్ కొన్ని లెక్కలూ' దగ్గర! అలాగే 'అంకెలూ' అంటూ కార్తిక్ యాడ్లింగ్ స్టయిల్‌లో చాలాబాగా అన్నాడు. సునీత సరే... బాగా పాడకపోతే చెప్పుకోవాలి.

ఉదిత్ నారాయణ్, శ్రేయ పాడిన 'నీ బుల్లి నిక్కరు చూసి బుల్లె మ్మోయ్' పాట యొక్క ట్యూన్‌ని కాకుండా కేవలం లిరిక్‌ని మాత్రమే చూపిస్తే చాలు - ఆంధ్రదేశంలో ఎవరైనా చెప్పేస్తారు - ఈ పాట 'నీ జీను ఫాంటు చూసి బుల్లెమ్మో' పాటలాగ ఉందని! నిజమే... ఆ పాట ట్యూన్‌ని యథాతథంగా ఈ పాటకి వాడుకుని ఆ ట్రాక్స్‌ని ఉపయోగించకుండా మళ్ళీ సెపరేట్‌గా రికార్డ్ చేశారు.

ఎవరైనా సరే తమ పాటనే తాము తిరిగి వాడుకోవటం జరిగితే అందుకు కారణం ఆ పాట మీద మక్కువే తప్ప ఇంకోటి చెయ్యలేమన్న అపనమ్మకం మాత్రం కాదు. జనరేషన్ గ్యాప్, సాంకేతిక పరమైన ఎదుగుదల ఎప్పుడూ ఉంటూనే ఉంటాయి కనుక రీమిక్స్‌ల కన్నా ఇది బెటరు. ఇక్కడ చెప్పుకోవలసిన విషయం ఇంకోటుంది. ఎలాగూ ఇది హిట్ అయిన ట్యూనే కనుక అచ్చిరెడ్డి, కృష్ణారెడ్డి గార్లకు హ్యాపీగానే వుంటుంది. ఉదిత్ నారాయణ్, శ్రేయగోషల్ లకు మన శ్రోతలతో నేరుగా పనుండదు కనుక వాళ్ల పని కూడా బానే ఉంటుంది. ఎటొచ్చీ చిక్కల్లా చంద్రబోస్‌కే.... ఆల్రెడీ హిట్ అయిన పాటని తిరిగి రాయటంలో కొన్ని ఇబ్బందులున్నాయి. హుషారైన పాటకి విషాదప్పాట రాయటం వేరు విషాదప్పాటకి హుషారు పాటని రాయటం వేరు. హుషారైన ఒరిజినల్ పాటతో సమానంగా మరో హుషారు పాట రాయాలి. కాపీ అనిపించకూడదు. పేరడీగా మారకూడదు. పేర్లల్‌గా ఉండాలి. నమ్మి అవకాశమిచ్చిన ఒరిజినల్ క్రియేటర్స్‌కి వచ్చిన మంచిపేరుని పోగొట్టకూడదు. తను చెడ్డపేరు తెచ్చుకోకూడదు. ఈ కోణాల్లో ఆలోచిస్తే పాటకి చంద్రబోస్ పడిన కష్టం పట్ల గౌరవం పెరుగుతుంది.

ఈ పాట రెండో చరణంలోని ఇంటర్లూడ్‌కు ముందు మాల్గాడి శుభ కంఠంలాంటి మరొక స్త్రీ కంఠం వినిపిస్తుంది. ప్రయోగం చేయదలిచి వసుంధరాదాస్ షకలకబేబి పాటలాగ, అనురాధా శ్రీరామ్ ఒక్క మగాడు పాట లాగ ఒక ఫుల్ లెంగ్త్ సాంగ్ కనుక ఆ అమ్మాయికిస్తే సెపరేట్ క్యారెక్టర్ ఉన్న ఎట్రాక్టివ్ సాంగ్స్‌కి ఆ కంఠం ఓ ఎస్సెట్ అవుతుంది. ఆ అమ్మాయి పేరు కల్పన.

గాయనీగాయకుల వరంగా రెండు పాటల్లోని ఫెర్ఫార్మెన్స్‌ను పోల్చి చూస్తే బాలు స్థాయిలో తెలుగువారి ఆమోదాన్ని పొందేలా ఉదిత్ నారాయణ్ పాడటం నిజంగా గొప్పే. ఇక మన చిత్ర కన్నా శ్రేయాగోషల్ పాడిన పద్ధతికే ఎక్కువ మంది ఆకర్షితులయ్యే అవకాశం ఉంది.

టోటల్‌గా ఉన్న అన్ని పాటలూ జనాల చెవుల్ని, మనసుల్ని చెడగొట్టకుండా ఉన్నందుకు హాయిగా రూపొందినందుకు ఆనందించాలి. ■

రచన: చంద్రబోస్ (1) గానం: సునీత

ప: నా పాట తేట తెలుగు పాట... నా పాట తేనెలొలుకు పాట
నా పాట తేట తెలుగు పాట.. నా పాట తేనెలొలుకు పాట
పూల తోటలకు పరిమళమిచ్చే ఘుమ ఘుమ పాట
నీలి మబ్బులకు స్నానం పోసే చిటపట పాట
రామచిలుకలకు వన్నెలు అద్దే రంగుల పాట
కన్నతల్లులను నిద్దురపుచ్చే ఊయలపాట
దైవాన్ని మేలుకొలిపే దీపధూపాల పాట
నా పాట తేటతెలుగు పాట.. నా పాట తేనెలొలుకు పాట
చ: లేత మనసు కాగితాలలో రాసుకున్న పాట
పూత వయసు పుస్తకాలలో దాచుకున్న పాట
చిలిపి కలల చెట్టుకొమ్మలో ఊగుతున్న పాట
పడుచు గుండె ప్రాంగణాలలో మోగుతున్న పాట
అందరు మెచ్చే పాట.. ఒకరికి అంకితమిచ్చే పాట
అందరు మెచ్చే పాట.. ఒకరికి అంకితమిచ్చే పాట
పదాలు అన్నీ బోయీలై ప్రేమ పల్లకిని మోసే...
నా పాట తేట తెలుగు పాట..
నా పాట తేనెలొలుకు పాట
పపప పపప
పపప పపప
సరిగరిసా నీపా నీనీసా
పపప పపప
సరిగరిసా నీపా నీనీసా
నీసగాసనిసాదా
దమదా
మగమా
సగాస గమాగ
మదామ దనీద
నిసనిస మగసా దనీసా
చ: పైరగాలి పాఠశాలలో నేర్చుకున్న పాట
కోకిలమ్మ కళాశాలలో చదువుకున్న పాట
నదులలోని జీవరాగమే నింపుకున్న పాట
వెదురులోని మధురనాదమే ఒదిగివున్న పాట
ప్రకృతి నేర్పిన పాట.. చక్కని ఆకృతి దాల్చిన పాట
ప్రకృతి నేర్పిన పాట.. చక్కని ఆకృతి దాల్చిన పాట
మనస్సు గెలిచిన పురుషునికి స్వరాల అర్చన చేసే ॥నా పాట॥
సరిగరిసా నీపా నీనీసా
సరిగరిసా నీపా నీనీసా

అభినయం
జగపతిబాబు
నేహ
బృందం

రచన: చంద్రబోస్ (2) గానం: సునీత, హరిహరన్

ఆ: మా యింటికి నిన్ను పిలిచి... మీ యింటికి నేను వచ్చి
టీలు కాఫీలు తాగి మాటాడిస్తే..
మా ఇంట్లో ఈనాడు నువ్వు చదువుతుంటే...,
మీ ఇంట్లో 'ఈ టీవీ' నేను చూస్తూ వుంటే...,
మా ఇంటి వంటకాలు నీకే వడ్డిస్తే...,
మీ ఇంటి తోటపూలు నా చేతికి యిస్తే...,
అ:యిస్తే...
ఆ: అయితే నిన్నింతలోనే ప్రేమిస్తున్నట్టా... ప్రేమిస్తున్నట్టా..
నిన్ను నేను ప్రేమిస్తున్నట్టా...నిన్ను నేను ప్రేమిస్తున్నట్టా... ॥మా యింటికి॥
ఆ: బైకు వెనక సీటులోన నేనే కూర్చుంటే
బ్రతుకంతా నీ వెనకే ఉంటానన్నట్టా..
జూకు, ఫ్లవరు పార్కు వరకు నీతో వస్తుంటే
జన్మంతా నీ జతగా వస్తానన్నట్టా..
అ:నీలోన లోలోన కలవరపడితే.... తికమక పడితే...
నాపైన పైపైన పంతం పడితే..... గొడవలు పడితే....
ఆ: పడితే..
అ:అయితే నువ్వు పడక పడక పడుతూ ఉన్నట్టే... పడుతూ ఉన్నట్టే..
ప్రేమలోన పడుతూ ఉన్నట్టే...ప్రేమలోన పడుతూ ఉన్నట్టే. ॥మా యింటికి॥
ఆ: బర్త్‌డేకు నేను నీకు బహుమతి ఇస్తుంటే...,
దానర్థం ఏకంగా మనసిస్తున్నట్టా..
చాటు చూసి నువ్వు నాకు గ్రీటింగిస్తుంటే..,
దానర్థం మౌనంగా మాటిస్తున్నట్టా...
అ:నువ్వొకటి నేనొకటి ఇస్తూ ఉంటే.. నవ్విస్తూ ఉంటే...,
యింకొకటి వేరొకటి చేస్తూ వుంటే..., నచ్చేస్తూ వుంటే...
ఆ: ఉంటే...
అ:అయితే అది ఖచ్చితంగా ప్రేమేనన్నట్టే.. ప్రేమేనన్నట్టే
నీకు నాకు ప్రేమేనన్నట్టే...నీకు నాకు ప్రేమేనన్నట్టే
మీ ఇంటికి నన్ను పిలిచి.. మా ఇంటికి నువ్వు వచ్చి
టీలు కాఫీలు తాగి మాటాడిస్తే..
మీ ఇంట్లో ఈనాడు నేను చదువుతుంటే...
మా ఇంట్లో 'ఈ టీవీ' నువ్వు చూస్తూ వుంటే....
మీ ఇంటి వంటకాలు నాకే వడ్డిస్తే...,
మా ఇంటి తోటపూలు నీ చేతికి ఇస్తే...,
ఆ:యిస్తే...
అ: అయితే నన్నెంతగానో ప్రేమిస్తున్నట్టే...
ప్రేమిస్తున్నట్టే..
నువ్వు నన్ను ప్రేమిస్తున్నట్టే..
నువ్వు నన్ను ప్రేమిస్తున్నట్టే..

అభినయం
జగపతిబాబు
నేహ

రచన: చంద్రబోస్ (3) గానం: ఎస్.పి.చరణ్, సునీత

అ: ఆగష్టు పదిహేడూ
ఊరంత కనువిందూ ॥ఆగష్టు॥
ఆ: ఆగష్టు పదిహేడూ ఊరంత కనువిందూ
అ: ఆరోజు సాయంత్రం
ఆరింటికి శుభలగ్నం
ఆ: మా ఇంట్లో కళ్యాణం
అ: ప్రతి ఒకరికి ఆహ్వానం
ఆ: ప్రతి ఒకరికి ఆహ్వానం
అ: I like డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం డుం
ఆ: I like డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం డుం ॥ఆగష్టు॥
అ: I like very - very - very much - అన్న నోటి తియ్యని తిట్లు
ఆ: I like so - so - so much - వదిన చేతి కమ్మని అట్లు
అ: I like ఒక్కరి చుట్టూ అందరు చుట్టే ఆత్మీయ బంధాలు
ఆ: I like అందరి కోసం ఒక్కరు మోసే అందమైన బాధ్యతలు
అ: మనమంతా... కలిసుంటే ఇల్లంతా ఇరుకు -
ఇరుకింట్లో కష్టాలకి చోటేది
ఆ: I like all of you you you you you
you you you you you you you you
I like all of you you you you you
you you you you you you you you ॥ఆగష్టు॥
అ: I like too... too... too much మా అంకుల్ యక్ష ప్రశ్నలు
ఆ: I like three - four - five much మా ఆంటీ మూగనోములు
అ: I like డబ్బుల మూటలు సంపాదించే విదేశాల్లో ఉద్యోగం
ఆ: I like ముద్దుల మూటల ముడి విప్పేసే అబ్బాయితో ముద్యోగం
అ: మనసంతా.... ముద్దుగుమ్మనీ మనువాడమని
ముద్యోగం చెయ్యమని ముందుకు నెడుతుందీ
ఆ: I like డుం డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం
అ: I like డుం డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం
ఆ: ఆగష్టు పదిహేడూ ఊరంత కనువిందూ
ఆ: ఆ రోజు సాయంత్రం
ఆరింటికి శుభలగ్నం
అ: మా ఇంట్లో కళ్యాణం
ఆ: ప్రతి ఒకరికి ఆహ్వానం
అ: ప్రతి ఒకరికి ఆహ్వానం
ఆ: I like డుం డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం
అ: I like డుం డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం
ఇద్దరు: I like డుం డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం
I like డుం డుం డుం డుం డుం డుం డుం
డుం డుం డుం డుం డుం డుం

అభినయం
జగపతిబాబు, నేహ, సుమన్, సీత
రాజాశ్రీధర్, శిరీష, ఎం.ఎస్.నారాయణ,
శోభారాణి, మాస్టర్ కౌశిక్,
మాస్టర్ సాయిశుభాకర్

రచన: చంద్రబోస్ **4** గానం: కార్తీక్, సునీత

అ: హేయ్ - అప్పారావ్
ఏంటోయ్ ఆలోచిస్తున్నావ్
హేయ్ - వెంకట్రావ్
ఏంటోయ్ అట్టా చూస్తున్నావ్
ఒకటీ రెండు మూడు నాలుగూ
ఎన్నో వున్నాయీ అంకెలూ
ఒకటో స్థానంలోనే ఎప్పుడూ...
నువ్వుండాలంటే చెబుతానోయ్ కొన్ని లెక్కలూ
రెండు చేతుల మూడు పూటల కష్టపడితె ఐదౌనురా
నలుగురాడిన నాల్గు మాటలు ఐదులోంచి తీసెయ్యరా
చివరి ఫలితం.... ప్రథమ స్థానం నీదే కదరా
ఆ: ఒకటీ రెండు మూడు నాలుగూ ఎన్నో వున్నాయీ
అ: అంకెలూ
అ: చాయ్ చెయ్యాలంటే
ఆ: చాయ్ చెయ్యాలంటే
అ: పాలు నీళ్ళూ రెండూ కావాలీ
పంచదార బాగా కలపాలీ
టీ పొడి వేసీ ఉడికించాలీ
మరిగిన వెంటనే వడబోయాలీ
రెడీ... ఫుల్ టీ...
ఆ: రెడీ... ఫుల్ టీ
అ: సక్సెస్ కావాలంటే
ఆ: సక్సెస్ రావాలంటే
అ: దీక్షా లక్ష్యం రెండూ కావాలీ
క్రమశిక్షణనే బాగా కలపాలీ
ఆవేశంతో ఉడికించాలీ
ఆటంకాన్నే వడబోయాలీ
రెడీ... సక్సెస్ టీ
ఆ: రెడీ... సక్సెస్ టీ
ఒకటీ రెండు మూడు నాలుగూ ఎన్నో వున్నాయీ
అ: అంకెలూ
ఆ: ఒకటో స్థానంలోనే ఎప్పుడూ
నువ్వుండాలంటే చెప్పవోయ్ ఇంకా లెక్కలూ
అ: వర్షం వచ్చిందంటే...
ఆ: వర్షం వచ్చిందంటే...
అ: నెత్తి మీదా గొడుగే వుండాలీ
ఒంటిపైనా కోటే వుండాలీ
కాళ్ళకి రెండూ షూసుండాలీ
జలుబే చేస్తే విక్సుండాలీ
అప్పుడే - సేఫ్టీ...
ఆ: అపుడే - సేఫ్టీ...
అ: కష్టం వచ్చిందంటే
ఆ: కష్టం వచ్చిందంటే
అ: గుండె ధైర్యం గొడుగై వుండాలీ
కోటి కలలే కోటై వుండాలీ
చురుకుతమనమనే షూసుండాలీ
ఓర్పు గుణమనే విక్సుండాలీ
గెలుపే... గ్యారంటీ
ఆ: గెలుపే... గ్యారంటీ
అ: ఒకటీ రెండు మూడు నాలుగూ
ఎన్నో వున్నాయీ అంకెలూ
ఒకటో స్థానంలోనే ఎప్పుడూ.... నువ్వుండాలంటే
చెబుతానోయ్ కొన్ని లెక్కలూ
రెండు చేతుల మూడు పూటల కష్టపడితె ఐదౌనురా
నలుగురాడిన నాల్గు మాటలు ఐదులోంచి తీసెయ్యరా
చివరి ఫలితం... ప్రథమ స్థానం నీదే కదరా నీదే కదరా
ఆ: ఒకటీ రెండూ మూడు నాలుగు ఎన్నో వున్నాయీ
అ: అంకెలూ
ఆ: ఒకటో స్థానంలోనే ఎప్పుడూ నువ్వుండాలంటే
చెప్పాడు గదరా ఎన్నో చిట్కాలూ

**అభినయం**
జగపతిబాబు, నేహ, ఆలీ, శివారెడ్డి, శ్రీనివాసరెడ్డి బృందం

రచన: చంద్రబోస్ **5** గానం: ఉదిత్ నారాయణ్, శ్రేయ, కల్పన

అ: హో.... నీ బుల్లి నిక్కరు చూసీ బుల్లెమ్మోయ్
హో...నీ బుడతా జాకెట్ చూసీ పిల్లమ్మోయ్ ॥హో...నీ బుల్లీ॥
మనసు లాగేత్తంది లాగేత్తంది లాగేత్తంది హోయ్
వయసు వూగేత్తందీ వూగేత్తంది వూగేత్తంది హోయ్
ఆ: హో... నీ పూలా షర్టును చూసీ పిల్లోడోయ్
హో...నీ తోలూ బెల్టును చూసీ బుల్లోడోయ్ ॥హో...నీ పూలా॥
వలపు ఒలికేత్తంది ఒలికేత్తంది ఒలికేత్తంది హోయ్
వయసు ఒణికేత్తంది ఒణికేత్తంది ఒణికేత్తంది హోయ్
అ: హో హో హో గుండుసూది లేకుండా అమ్మడూ
నా గుండెలోన గుచ్చినావు అమ్మడూ
బండి ఏది లేకుండా అమ్మడూ
పూబంతులెన్నో తెచ్చినావు అమ్మడూ
ఆ: పంపు ఏది లేకుండా పిల్లడూ
నా ప్రాణమంతా తోడినావు పిల్లడూ
స్ట్రాను ఏది లేకుండా పిల్లడూ
నా తేనెనంతా తాగినావు పిల్లడూ
బ్యాగులేక బ్రీఫ్‌కేసు లేక పిల్లసోకులన్ని మోసుకెళ్ళనా
అ: ఎయ్ ఎయ్‌రో సూత్తవేరో
ఎయ్ ఎయ్‌రో సూత్తవేరో ॥హో... నీ బుల్లి॥
అ: ముందుకొచ్చి ముద్దులిస్తె అమ్మడూ
నీకు ముప్పై ఐదు మార్కులిస్త అమ్మడూ
నడిచి వచ్చి నడుం యిస్తె అమ్మడూ
నీకు నలభై ఐదు మార్కులిస్త అమ్మడూ
ఆ: ఆడయీడ తాకనిస్త పిల్లడూ
నాకు అరవై ఆరు మార్కులివ్వు పిల్లడూ
జబ్బతోటి జర్కులిస్త పిల్లడూ
నాకు డెబ్బై ఏడు మార్కులివ్వు పిల్లడూ
అ: అందమంతా నాకు విందులిస్తె నీకు వందమార్కులిస్తానమ్మడో
ఇ: ఎయ్ ఎయ్‌రో చూస్తవేరో
ఎయ్ ఎయ్‌రో చూస్తవేరో ॥హో... నీ బుల్లి॥

**అభినయం**
ఆలీ, శ్రద్ధానిగమ్ బృందం



పాటల పుస్తక ప్రియులకోసం సినీ సంగీత విశ్లేషకుడు 'రాజా' పర్యవేక్షణలో 'హాసం' అందిస్తున్న ప్రత్యేక కానుక ఇది.







THE GAME OF ENTERTAINMENT

# అతడే ఒక సైన్యం

S.V. కృష్ణారెడ్డి M.Com    K. అచ్చిరెడ్డి

దివాకర్‌బాబు • రవీంద్రబాబు • మార్తాండ్. కె వెంకటేష్ • రాజు • చంద్రబోస్ • సుచిత్ర చంద్రబోస్ • కుర్రా రంగారావు • రమేష్ యాదవ్




## తారాగణం

జగపతిబాబు, నేహ, సుమన్, ప్రకాష్‌రాజ్, సీత, బ్రహ్మానందం, ఎమ్.ఎస్.నారాయణ, సునీల్, అలీ, గణేష్, కృష్ణ భగవాన్, జీవా, రాజా శ్రీధర్, గౌతమ్‌రాజు, శ్రీనివాసరెడ్డి, శిరీష, శోభారాణి, రామకృష్ణ, భరత్ (తొలిపరిచయం)

## సాంకేతిక నిపుణులు

| | |
|---|---|
| మాటలు | : దివాకర్‌బాబు |
| పాటలు | : చంద్రబోస్ |
| కెమెరా | : కె.రవీంద్రబాబు |
| కళ | : రాజు |
| డాన్స్ | : సుచిత్రా చంద్రబోస్ |
| మేకప్ | : కిషోర్ |
| కాస్ట్యూమ్స్ | : ప్రసాద్ |
| అసోసియేట్ డైరెక్టర్స్ | : చిరంజీవి మహానందరెడ్డి, బాలాజీ చంద్ర |
| కో-డైరెక్టర్స్ | : కుర్రా రంగారావు, రమేష్ యాదవ్ |
| ప్రొడక్షన్ కంట్రోలర్ | : కామాక్షి వెంకటేశ్వరరావు |
| ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్ | : బి.రామ్‌ప్రసాద్ |
| స్టిల్స్ | : సెబాస్టియన్ బ్రదర్స్ |
| పి.ఆర్.ఓ. | : భగీరథ |
| పబ్లిసిటీ | : ధని ఏలె |
| నిర్మాత | : కె. అచ్చిరెడ్డి |
| కథ-స్క్రీన్‌ప్లే-సంగీతం-దర్శకత్వం | : ఎస్.వి.కృష్ణారెడ్డి |





# ఎక్కడో పుట్టి...

## పాట కథా, కమామిషూ





**ఈ పాట గురించి మొట్ట మొదట**
**కీరవాణి ఏమన్నారంటే...**





'ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి' పాట గురించి చెప్పాలంటే ఈ పాట కంపోజింగ్ కాకినాడలో ముత్తా గోపాలకృష్ణగారి గెస్ట్‌హౌస్‌లో జరిగింది. రాఘవేంద్రరావు గారు ట్రైయిన్‌లో వెళ్తూ నాకు కూడ టిక్కెట్లు తీస్తానంటే నేను కార్లో వస్తానని చెప్పి నేను కొత్తగా కొనుక్కున్న కారులో డ్రైవర్ తో బయల్దేరి మ్యూజిక్ వరల్డ్‌కు వెళ్ళి ఓ 30 లేటేస్ట్ క్యాసెట్లు కొనుక్కున్నాను. నాకు హెడ్‌ఫోన్లు పడవండి. చెవి పోట్లు వస్తాయి. టేపురికార్డులో క్యాసెట్ పెట్టుకుని కారు జర్నీలో వింటాను. అందుకోసమే కారులో లాంగ్ జర్నీలు ప్రిఫర్ చేస్తూంటాను. ఒక్కొక్క క్యాసెట్ వినడం. అర్థం దింపటం. వినటం పూర్తయిన క్యాసెట్‌ని విసిరేయటం.

క్యాసెట్ అవతలికి విసిరేసే ప్రక్రియ ఎందుకంటే క్యాసెట్‌లో ఉన్న కంటెంట్ నచ్చనప్పుడు దాన్ని ఎరేజ్ చేసి దాన్ని ఎమ్టీ క్యాసెట్‌గా యూజ్ చేసుకోవచ్చు. నచ్చనిది నా దగ్గర ఉండడం అన్నది నాకు చిరాకు. ఒక చెత్త వదిలిపోయింది నా దగ్గర్నుంచి అనే ఆనందం అన్నమాట. కొంతమంది ఇమాజ్ చేయలేరు. అది అనుభవవైద్యం. ఎప్పుడైనా చేసి చూస్తే అర్థమవుతుంది.

అలా వినడం విసిరేయడం అదొక రాక్షస ఆనందం అనండి లేదా ఇంకేదైనా అనండి. అది నా పద్ధతి. అలా గంటకో క్యాసెట్. నేను విసురుతున్నప్పుడల్లా కారుడ్రైవరు ఓరచూపుతో నాకేసి ఓ లుక్కిచ్చేవాడు - ఏంటి ఇలా విసురుతున్నాడు నేనన్నా దాచుకుంటాను గదా అన్నట్టు! అతని పేరు మధు. అతని భావనను నేను అర్థం చేసుకుని 'కావాలంటే నీకు తర్వాత కొనిస్తానులే' అన్నాను. ఒక్కోసారి నా వైఫ్ తిడుతుండండి 'రోడ్లు పాడుచేయద్దు ఎక్కడపడితే అక్కడ వేయద్దు' అని... డస్ట్‌బిన్‌లో వేసిన సందర్భాలు కూడా ఉన్నాయి. అలా క్యాసెట్స్ విసరడం వల్ల వచ్చిన ఆత్మానందం వల్ల కలిగే ఎనర్జీయే వేరు.

ఈ విసరడం అన్నది నా లైఫ్‌లాంగ్ జరిగే ప్రాసెస్. క్యాసెట్స్ రిలీజ్ అవుతూనే వుంటాయి. కొంటూనే వుంటాను . పాట బాగుంటే దాన్ని 'ఐపాడ్' లోకి ఎక్కించుకుంటాను. ఆ సెక్షన్ వేరే ఉంది. బాగా లేకపోతే అవతల పారేస్తూంటాను.

ఓ చెత్త క్యాసెట్ మన దగ్గర ఉండటానికి వీల్లేదు. మన కార్లోను, మన దగ్గర స్మృతిపథంలో ఉండటానికి వీల్లేదు అని చెప్పి కసక్కుమని కిటికీలోంచి విసిరేసి "ఛీ... వదిలిపోయింది దరిద్రం" అని అనుకోవడం.




అలా ఒక రాజస రాక్షసానందం అనుభవిస్తూ కాకినాడ చేరుకున్నాను. అది పైశాచిక ఆనందం కాదండి రాజస రాక్షసానందమే. రాక్షసుడికి నాకు తెలిసిన నిర్వచనం. కనపడిన ప్రతిదీ అది బాగుంది కాబట్టి నాది. అది ఉత్తమమైంది కనుక నాకు చెందాలి. అలా ప్రపంచంలో ప్రతిది నాది అని కోరుకునేది రాక్షసుడండి. పిశాచి అలాకాదు. ఏదైనా పాడుచేసేయడమే దాని లక్ష్యం. అది ఏంటో వాటికే తెలియదు. సో... రాక్షసి వేరు పిశాచి వేరు. అలాగ ఓ రాజస రాక్షసానందం పొందుతూ కాకినాడ చేరి ముత్తా గోపాలకృష్ణగారి గెస్ట్ హౌవుస్‌లో పెసరట్లు తింటూ... రాఘవేంద్రరావుగారి పర్సనల్ అసిస్టెంట్ మూర్తిగారితో జోకులేస్తూ... కాన్సన్‌ట్రేట్ చేస్తే... ఓ కమ్మనైన పాట వచ్చింది. అలా విసరడం వల్ల వచ్చిన ఎనర్జీతో చేసిన పాటల్లో ఈ 'ఎక్కడో పుట్టి' పాట ఒకటి.

కాలేజీ స్టూడెంట్స్ అంటే... పోకిరి వెధవలు అని... వాళ్ళ శరీరంలో రక్తం బదులు విస్కీయో లేకపోతే మరొటో మరొటో ప్రవహిస్తుందని, ధమనులు, నరాలు బదులు ఎలక్ట్రానిక్ వైర్లు ఉంటాయని, విపరీతమైన హెయిర్‌స్టయిల్స్‌తోనూ, చినిగిపోయిన జీన్స్ ప్యాంట్స్‌తోనూ ఉంటారని చాలామందికి ఒపీనియనండి. కాని వాళ్లు కూడా మనుషులేనండి. ఆ సంగతి విస్మరించి కొన్ని క్యాసెట్లు పుంకాను పుంకాలుగా పుట్టు కొచ్చాయండి.

ప్రతి దాంట్లోనూ నలుగురు బ్యాచ్‌లర్లు ఉంటారు... వాళ్ళు ఏవేవో వాగుతుంటారు... ఒక రూమ్‌లో ఉంటుంటారు... కామెడీ జోక్స్... అలా కొంత చెత్త పుట్టుకొచ్చిన సీజన్‌లో ఆ క్యాసెట్లు అన్నీ వినివిని బుఱ్ఱ హీటెక్కి... కాలేజీ స్టూడెంట్స్ అంటే ఇది కాదురా వాళ్ళు మనుషులే ... అనే ఆలోచన నాలో పుట్టి నాలో నేను మధన పడుతున్న సమయానికి సరిగ్గా అలాంటి పాటే రాఘవేంద్రరావుగారికి కావాల్సి రావడం... చంద్రబోస్‌లాంటి సమర్థుడు అక్కడ పక్కన రెడీగా పెన్ పట్టుకుని కూర్చోని ఉండడంతో ఈ పాటకి పుట్టుక జరిగిందండి.

నిజానికి 'ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడే కలిశాము' అనేది 'పరదేశి' సినిమా అప్పుడు అనుకున్న లైనండి. కాని ఆ పాట అందులో పెట్టలేదండి. ఆ లైన్ మళ్ళీ గుర్తు చేసుకుంటూ దానికి కావాల్సిన కమనీయమైన ఒక రాగం ఆలాపన చేసుకుంటుంటే మొత్తం ట్యూన్ అంతా వచ్చింది. ఆ తర్వాత చంద్రబోస్‌గారు విజృంభించి దానికి చక్కటి లైన్లు రాయడం.

ఆ పాట విని కళ్ళ నీళ్ళు పెట్టుకున్నాం అని అన్నవాళ్ళు ఓ వెయ్యిమంది తేలారండి. ఇది 'పుణ్యభూమి నాదేశం' లాంటి దేశభక్తి గీతం కాదు... 'కలగంటి కలగంటి' లాంటి అన్నమయ్య కీర్తన కాదు... 'మాతృదేవోభవ'లో 'రాలిపోయే పువ్వా' కాదు... ఏదీ కాదు. సరదాగా కాలేజీలో మనం టీజ్ ఎలా చేశాం... ఎలా ర్యాగింగ్ చేశాం... అవి మధురస్మృతులుగా ఎలా మిగిలిపోయి ఉన్నాయో అనే పాటను వింటూ కళ్ళకు నీళ్ళు పెట్టుకున్నారంటే - అది రియల్ రియాక్షనండి.

సాధారణంగా మనం సభలకు వెళ్ళినప్పుడు సిరివెన్నెల సీతారామశాస్త్రిగారిలోని కవితా పటిమని పొగడాలి అనేసరికి - ఎక్కడలేని సాత్వికత పెల్లుబుకుతుందో ఏమోగాని ప్రతివాడు మైకు దగ్గరకు వెళ్ళిపోయి 'ఆదిభిక్షువు వాడిని ఏది కోరేది... ఏం రాశారు శాస్త్రిగారు' అనే మాట్లాడుతాడు.

శాస్త్రిగారిని గురించి నాలుగు మంచి మాటలు చెప్పమని వక్తగా మీమీద కండువా వేస్తే... ఆ కండువా భారం మిమ్మల్ని ఆయన రాసిన భక్తి గీతాల గురించి ఆలోచింప చేస్తుందంటే ఆయన్ని మీరు కవిగా ఏం గుర్తించినట్టు... నాకదిష్టం లేదండి. నేనైతే శాస్త్రిగారు రాసిన దేవుడి పాటలు పక్కనపెట్టి 'బలపం పట్టి భామ బళ్ళో' పాట గురించి మాట్లాడుతాను. ఆయనలో ఉన్న కవితాశక్తి గురించి మాట్లాడేటప్పుడు వస్తువు యొక్క లక్షణాన్ని పక్కన పడేసి కవిత్వాన్ని ఫోకస్ చేసి చెప్పగలగాలి. అలా కాకుండా మనలో నూటికి తొంభైమంది భయపడిపోయి దేవుడిగురించి మాట్లాడుతాం. అలా ఎందుకు చెపుతున్నానంటే భక్తి పాటలు, దేశభక్తి పాటలు వింటే కళ్ళ నీళ్ళు రావడం అనేది మామూలు. ఈ'ఎక్కడో పుట్టి' పాట విని కళ్ళ నీళ్ళు వచ్చాయని జనాలు సిన్సియర్‌గా చెప్పుకుంటుంటే - రచయితగా ఆయన జన్మ స్వరకర్తగా నా జన్మ ధన్యమైందని' అనిపిస్తుంటూంది. అది కరెక్టు అవార్డండి.







## ఇక ఈ పాట గురించి చంద్రబోస్ ఏమన్నారంటే...

'ఎక్కడో పుట్టి' పాట కాకినాడలో పుట్టిందండి. అలా కాకినాడలో పుట్టి ఆంధ్రదేశమంతా ఎదిగి వ్యాపించి అందరి హృదయాలలో చోటు చేసుకుంది . అసలు ఈ పాట పల్లవి 'పరదేశి' సినిమాకి కీరవాణిగారు, రాఘవేంద్రరావుగారు మేం కూర్చున్నప్పుడు ఒక సిట్యుయేషన్‌కి అనుకున్నదండి.

ఆ సినిమాలో సెట్ అవకుండా అలా వదిలేశాం. కాకినాడకి వెళ్తున్నప్పుడు నేను, రాఘవేంద్రరావుగారు, ఆయన అసిస్టెంట్ మూర్తి ముగ్గురం ట్రెయిన్‌లో బయలుదేరాం. కీరవాణిగారు కారులో ముందుగానే వెళ్ళిపోయారు.



ట్రెయిన్‌లో నైట్ భోంచేశాం. డైరెక్టరుగారు కరెక్టుగా 8:30 కల్లా కూపేలోకి పిలిచారు. ప్రతి పాటకుముందు నన్ను కొంచెం ఇన్‌స్పయిర్ చేయడం డైరెక్టర్‌గారికి అలవాటు. 'గంగోత్రి'లో 'ఒకతోటలో' పాటకి కాని... 'బొంబాయిప్రియుడు'లో పాటలకి కాని... 'పెళ్లిసందడి' పాటలకి సిట్యుయేషన్ చెప్పి దాని గురించి తీవ్రంగా ఆలోచించాలి అని సూచనప్రాయంగా నాకు తెలియజేస్తూ వుంటారన్నమాట. మనసులో బాగా రాయాలి అని మనలో కలిగే విధంగా ఆయన కొన్ని కొన్ని సజెషన్స్ ఇస్తూంటారు.

అలా ఈ పాటప్పుడు కూపేలోకెళ్ళి కూచున్న తర్వాత డైరెక్టర్‌గారు 'అఁ ...ఏంటి శిష్యా' అంటూ కాస్సేపు కబుర్లు చెప్పి "మనం కాలేజీ సాంగ్ చేస్తున్నాం. మరి ఇప్పటివరకూ ఎన్నో సినిమాల్లో కాలేజీ పాటలు కోకొల్లలుగా వచ్చాయి. అలాంటి పాటలలో ప్రతి పాటకీ 'కీ పాయింట్' ఏంటంటే... కాలేజీ ఎగ్గొట్టటం... మ్యాట్నీకెళ్ళడం... టీచర్లను ఏడిపించడం... అమ్మాయిలను అల్లరిపెట్టడం... ఇలాంటి చిలిపి పనులు ప్రతి పాటలోనూ టచ్ చేశారు. మరి మనం కూడా ఒక సాంగ్ చేయబోతున్నాం అంటే దానికో ప్రత్యేకత, విశిష్టత ఉండాలి కదా.... మనం మన స్టయిల్లో చేయాలి కదా... దానికి ఏదైనా డిఫరెంట్‌గా ఆలోచించాలి. అది మనసులో పెట్టుకో" అని చెప్పారు. "అలా అని పూర్తిగా సందేశాత్మకంగా ఉండకూడదు. వాళ్ళ మనస్తత్వాన్ని ప్రతిబింబిస్తూనే, వాస్తవానికి దగ్గరగా ఉంటూనే ఒక కొత్త కోణాన్ని ఆవిష్కరింప చేయాలి" అని అన్నారు. ఆయన చెప్పిన దాంట్లో ఒక నిగూడార్థం ఉంది. అది మనసులో పెట్టుకుని రాయలి అంటే... ఈ ఇన్‌గ్రీడియంట్స్ అన్నీ రావాలి. కలర్ వేరేగా ఉండాలి... ఫ్లేవర్ కొత్తగా ఉండాలి... పాట హిట్ అవ్వాలి. సేమ్ టైమ్ అది అందరి మనసుల్లో చోటు చేసుకుని, గత స్మృతులను, జ్ఞాపకాలను మరొక్కసారి ముందుకు తెచ్చేలా ఉండాలి. ఇవన్నీ మనసులో పెట్టుకుని కాకినాడకు వెళ్ళామండి.

కీరవాణిగారు రకరకాల పల్లవులు అంటున్నప్పుడు డైరెక్టరుగారు గుర్తుచేశారు 'మనం పరదేశిలో అనుకున్నాం కదా ఆ పల్లవి చెప్పు' అని. పల్లవి కీరవాణి చెప్పారు. దాన్ని సెటప్ చేద్దాం అనుకున్నారు. అప్పటికి నాలుగు పాటలు చేశామండి. లిరిక్ వైజ్ కాని మ్యూజిక్ వైజ్ కాని ఆ నాలుగు పాటలు బ్రహ్మాండంగా వచ్చాయి. రికార్డింగ్ కూడా అయిపోయింది.

పల్లవి సెటప్ అయిన తర్వాత నేను నైటంతా రాసుకుంటానని చెప్పి హోటల్‌కి వెళ్ళాను. రాత్రిపూట వర్షం వచ్చింది. అక్కడ కొంచెం ప్రశాంతంగా రాసుకోవాలి అనుకున్నాను. మొత్తం రివర్స్ అయిపోయింది. సాయంత్రం నుండి రాత్రి పది వరకు ఓ పెళ్లి రిసెప్షన్ జరిగింది. పది పదిన్నర నుంచి ఆర్కెస్ట్రా రన్ అయింది. కరెక్టుగా నా రూమ్‌కిందనే. 12:30 నుంచి 1:00 వరకు భోజనాల గోల.

ఆర్కెస్ట్రా, డ్యాన్సులు... 1:00 నుంచి విపరీతమైన వర్షం. నాకు భయం భయంగా ఉంది - ఇంత దూరం వచ్చాం ఇదో ఛాలెంజింగ్ పాట అని డైరెక్టర్‌గారు చెప్పారు. చూడబోతే ఇక్కడ వాతావరణమంతా మనకు ప్రతికూలంగా ఉంది... ఏం రాస్తాం... అని అనుకున్నాను. భోజనం కూడా ఎక్కువ తిన్లేదండి. ఆకలేయలేదు. నేను ఎప్పుడూ వర్క్ చేసేది రాత్రిపూటే... రాత్రి పూట రాయబోయేముందు... అన్నం తినబుద్ధవదు. కొంచెమే తింటాను. లోపల గుబులు గుబులుగా ఉంటూ భయమేస్తుంటూంది. పెరుగు తింటే నిద్దరొస్తుందేమో, సోమరిగా అయితానేమో అని చెప్పేసి నాలుగు ముద్దలు తినేసి వర్క్‌మీద కూర్చుంటాను. ఈ గోలను పట్టించుకోకుండా... తెల్లవారేసరికి ఏదైనా చెయ్యాలి అనే ఓ ధ్యేయంతో.. తీవ్రమైన ఏకాగ్రతతో కూర్చుని రాయడం మొదలెట్టానండి. ఆ సినిమా నిర్మాణ వ్యవహారాలు చూసే నిర్మాణత శ్రీ సాయిబాబా గారు వాళ్ళ రూమ్‌లో వాటర్ హీటర్ చెడిపోతే మా రూమ్‌లో స్నానం చేయడానికి కరెక్టుగా 5 గంటలకి వచ్చారు. ఆయన వచ్చేసరికి నేను ఇంకా కూర్చుని రాస్తూనే ఉన్నాను. "ఏంటి ఇంకా పడుకోలేదా బోస్" అని అడిగారు - 'లేదండి ఇప్పుడే ఒక రూపానికి వచ్చింది. ఇంకా అరగంట లేదా గంట పడుతుంది. మీరు వెళ్ళండి. డైరెక్టరు గారు, కీరవాణిగారు అందరూ

సెటప్ అయి సెటిల్ అవ్వండి. నేనో మూడు గంటలు పడుకుని పదిగంటలకు లేచి స్నానం చేసి ఫ్రెష్‌గా వస్తాను' అని చెప్పాను.

అలాగే పదకొండు గంటలకు వెళ్లాను. వెళ్ళిన తర్వాత కీరవాణిగారు, డైరెక్టరుగారు లిరిక్ అంతా చూశారు. అప్పటి వరకూ అన్ని పాటలు బాగా వచ్చాయి కదా ఇదో చిన్న రిలాక్సింగ్ పాట అవుతుందేమో అన్నట్టుగా ఎలా వచ్చినా ఫర్వాలేదు అన్నట్టుగా వాళ్ళ భావన ఉంది. లిరిక్ చూడగానే కీరవాణిగారు ఒక్కసారిగా ఆనందపడిపోయి రాజమౌళి గారికి ఫోన్ చేసి ఇదే సూపర్ హిట్ సాంగ్ అయ్యేలా ఉందయ్యా... అసలు దీనికి ఒక 60 మార్కులు పడ్డా చాలు అనుకున్నాం. ఇప్పటివరకూ చేసిన పాటలకు వందకు వంద మార్కులు వస్తే ఇది నూటికి పైగా మార్కులు సంపాదించేలా ఉంది" అని అన్నారు.

'ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడే కలిశాము
చదువులమ్మ చెట్టు నీడలో
వీడలేమంటూ వీడుకోలంటూ వెళ్ళిపోతున్నాము
బ్రతుకులోన తలో బాటలో'

అని ఫస్టు రాశాను. కీరవాణి గారు 'చదువులమ్మ చెట్టు నీడలో ఎంత బావుందండి బ్రతుకులోన తలో బాటలో అన్నది మామూలుగా, రెగ్యులర్‌గా ఉంది. కొత్తగా అనిపించటంలేదు. దీన్ని సరిచేస్తే ఇంకేదన్నా బాగా రావచ్చు. చూడండి చంద్రబోస్‌గారు వస్తుందేమో'అని సూచించారు. పాట అంతా అయిపోయింది. ఈ ఒక్క లైను దగ్గరే ఆగింది.

ఈ 'బ్రతుకులోన తలో బాటలో' తీసేయాలి. తీసేసి దాని ప్లేసులో ఇంకోటి వెయ్యాలంటే ఏం చెయ్యాలి? ఒక రోజంతా ఆలోచించి ఆత్రేయగారిని స్మరించుకున్నాను. ఆ మహానుభావుడు ఒక వర్డ్ కోసం... ఒక్క భావం కోసం... కొన్ని రోజులు ఆలోచించేవారట. అలా ఒక్కసారిగా ఆయన్ని స్మరించుకుని ఆయన స్ఫూర్తి తీసుకుని ఒక రోజంతా బ్రెయిన్ అంతా కదిలిపోయేలా ఆలోచించేసరికి 'చిలిపి తనపు చివరి మలుపులో' అనే ఒక వర్డ్ వచ్చింది. దాన్ని సెటప్ చేస్తే కీరవాణిగారికి బాగా నచ్చింది.

ఫైనల్ హియరింగ్ రోజు రికార్డింగ్‌కి వెళ్ళబోతూ రాఘవేంద్రరావుగారి దగ్గరకు వెళ్ళి ఆయనకు వినిపించాం. 'ఏంటి... బ్రతుకులోన తలో బాటలో మార్చి ఇది పెట్టారా' అన్నారు. ఆయనకు ఒక్క అక్షరం మార్చినా తెలుస్తుంది. అలా అని నావైపు డౌట్‌ఫుల్‌గా చూశారు. నాకు బాగా నచ్చింది అన్నట్టు చిన్న సైగ చేశాను. టఫ్‌గా ఉందేమో అన్నట్టుగా ఆయన ఎక్స్‌ప్రెషన్ ఇచ్చారు. కష్టంగా క్లిష్టంగా ఉన్నవి ఆయనకు ఏమాత్రం నచ్చవు. ఎంత గొప్ప ఎక్స్‌ప్రెషన్ అయినా సరే ఈజీగా ఉండాలి. 'చిలిపితనపు చివరి మలుపులో' అనేది కొంచెం టఫ్‌గా ఉంది... 'బ్రతుకులోన తలో బాటలో' అంటే హాయిగా ఉంది అన్నట్టుగా ఫీలయ్యారు. 'సార్ ఇది మాకు నచ్చి కష్టపడి చేశామండి' అన్నట్టుగా...మేం ఎక్స్‌ప్రెషన్ ఇచ్చాం. ఆయన ఓకే చేసిన తర్వాత కూడా దాన్ని మించి ఆలోచించామంటే అది మేం బెటర్‌మెంట్ గురించే ఆలోచించామని అర్థమై ఇంకా ఎక్కువ ఆసక్తి కనబరుస్తున్నామని గమనించి వదిలేశారాయన. అలా వదిలేయడంతో అది గట్టెక్కింది.

సినిమాలో ఫస్టు చూడటానికి నేను, సుచి, మా మదర్, ఫాదర్ వెళ్తున్నాం (ఈ ఇంటర్వ్యూ తీసుకుంటున్న 'హాసం' ఎడిటర్ రాజాతో మాట్లాడుతూ) మీరు అక్కడ ఓడియన్ 70ఎం.ఎం. నుంచి వస్తున్నారు. అప్పుడు మీరు "మీ లైఫ్‌లాంగ్ చెప్పుకునే పాట ఇది. భవిష్యత్తులో ఏ కాలేజీ ఫేర్‌వెల్ ఫంక్షన్స్‌లోనైనా తప్పని సరిగా ఈ పాటను పాడుకుంటారు. ఈ పాటకు మీకు అవార్డులు వస్తాయి"అని మంచి మాట ఒకటి అన్నారు.

అమ్మో ఏదో సమ్‌థింగ్ ఉందన్నమాట అనుకుని ఉత్సాహంగా వెళ్ళాం. సినిమాలో ఈ పాట వచ్చినప్పుడు నాకు, నా మిసెస్ సుచికి అప్రయత్నంగా అలా కళ్ళనీళ్ళు వచ్చేశాయి. చూసిన ప్రతి ఒక్కరికి కళ్ళనీళ్ళు వచ్చాయని , గుండె చెమర్చడం ద్వారా ద్రవీభవించడం జరుగుతోందని ఎంతోమంది చెప్పారు.

ఎక్కడో పుట్టి ఎక్కడో పెరిగి ఇక్కడే కలిశాం - అల్లరి చేశాం క్షమించండి - అంటే అమ్మాయిలు - ఫర్లేదు క్షమించేంత పెద్ద మాటలెందుకు అవన్నీ సరదాగా ఆడిన ఆటల్లాంటివి - అనగానే మళ్ళీ బాధపడటం. తర్వాత మాస్టర్లను క్షమించండని వేడుకోవడం. మాస్టర్లు కూడా - మీ తప్పేం కాదు - మీ వయసులో మేం కూడా అలాగే చేశాం - అనడం. ఇవన్నీ వింటుంటే ఆ భావాలకి ఫీలవ్వడం అన్నది కామన్‌గా అందరి జీవితంలో అనుభవమయ్యేదే.

కాకపోతే అవన్నీ ఊహించి క్రియేట్ చేసిన నాకే పాట చూసిన ప్రతి సారి కళ్ళు చెమర్చడం అనేది మాత్రం అద్భుతం. ఇంతవరకూ నా లైఫ్‌లో ఇంత కంటే మంచి పాటలు.... మంచి భావకవిత్వం ఉన్న పాటలు... సిట్యుయేషన్‌ని బాగా డీల్ చేసిన పాటలు... చాలా ఉండొచ్చు... కాని

పల్లవి : ఓ.... మై.... డియర్ గర్ల్స్,
డియర్ బోయ్స్, డియర్ మేడమ్స్,
గురుబ్రహ్మలారా
ఎక్కడోపుట్టి ఎక్కడో పెరిగి యిక్కడే కలిశాము
చదువులమ్మ చెట్టు నీడలో
వీడలేమంటు వీడుకోలంటు వెళ్లిపోతున్నాము
చిలిపితనపు చివరిమలుపులో
వియ్ మిస్ ఆల్ ద ఫన్, వియ్ మిస్ ఆల్ ద జాయ్
వియ్ మిస్ యు

చరణం : నోటుబుక్కులోన రాణికి పంపిన ప్రేమలేఖలు
సైన్సు లాబ్‌లోన షీలాపై చల్లిన యింకు చుక్కలు
ఫస్ట్‌బెంచ్‌లోన మున్నీపై వేసిన పేపర్ ఫ్లైట్‌లు
రాధ జళ్లోనుంచి రాబర్ట్ లాగిన రబ్బరు బాండ్‌లు
రాజేషు యిచ్చిన రోజా పువ్వులు
శ్రీవాణి పెట్టిన చెవిలో పువ్వులు
కైలాషు కూసిన కాకికూతలు
కళ్యాణి పేల్చిన లెంపకాయలు
మరపురాని తిరిగిరాని గురుతులండి
మీ మనసు నొచ్చుకునివుంటే మన్నించండి

గర్ల్స్ : అంత పెద్ద మాటలొద్దు వూరుకోండి
ఆ అల్లరంటె మాక్కూడా సరదాలెండి
వియ్ మిస్ ఆల్ ద ఫన్ - వియ్ మిస్ ఆల్ ద జాయ్
వియ్ మిస్ యు ॥ఎక్కడోపుట్టి॥

చరణం : బోటనీ మాస్టారి బోడిగుండుపైన బోలెడు జోకులు
రాగిణి మేడమ్ రూపురేఖపైన గ్రూపు సాంగులు
సుబ్బయ్య మాస్టారి స్కూటికి గుచ్చిన గుండు పిన్నులు
టైపిస్టు కస్తూరి ఖాతాలో తాగిన కోకు టిన్నులు
బ్లాక్ బోర్డుపైన గ్రీకు బొమ్మలు
సెల్లుఫోనుల్లోన సిల్లీన్యూసులు
బాత్‌రూమ్‌ల్లోన భావ కవితలు
క్లాసు రూమ్‌ల్లోన కుప్పిగంతులు
మరపురాని తిరిగిరాని గురుతులండి
మీ మనసు నొచ్చుకుని వుంటే మన్నించండి.

లెక్చరర్స్ : మనకు మనకు క్షమాపణలు ఎందుకండి
మీ వయసులోన మేం కూడా యింతేనండి

అందరు : వియ్ మిస్ ఆల్ ద ఫన్
వియ్ మిస్ ఆల్ ద జాయ్
వియ్ మిస్ యు

ఈ పాట పట్ల ఎందుకో తెలియని మక్కువ... ఆ పాట వచ్చినప్పుడు ప్రతిసారీ అదే తాజాదనం .....

సినిమా ప్రముఖులు కూడా బోలెడంత మంది స్పందించారు. ఎవరి దగ్గరకు వెళ్ళినా ఎక్కడో పుట్టి ... పాట గురించి చర్చించేవాళ్లే. ఆ పాటను చూసి ఇన్‌స్పైయిర్ అయ్యి సబ్జెక్ట్‌లు తయారు చేసుకున్న కోడైరెక్టర్లు కూడా ఉన్నారు. ఆ పాటతో ఒక సబ్జెక్టు అయ్యేంత మెటీరియల్ పోగు చేసుకున్నాం అని చెప్పిన వాళ్ళున్నారు. దానికంటే ముఖ్యంగా శ్రోతల స్పందన... ఎక్కడికెళ్ళినా కూడా ఆ పాట గురించే చెప్పుకోవడం, ఆ పాటను కోట్ చేయటం అనేది లైఫ్‌లో నాకు ఎంతో సంతృప్తినిచ్చింది.

ఆ పాట బైటికొచ్చాక ఓ రోజు ఇక్కడ త్రినేత్ర సూపర్ మార్కెట్‌కు వెళ్ళి సరుకులు కొని బయటకు వచ్చాను. ఎవరో తెలియదు స్కూటర్ పై వచ్చి... 'చంద్రబోస్ గారేనా మీరు' అని అడిగారు. 'అవునుసార్' అన్నాను. షేక్‌హాండ్ ఇచ్చాడు... 'ఎక్కడో పుట్టి' పాటలో మ్యాటరంతా బాగుంది. చిలిపితనపు చివరి మలుపులో అనే ఎక్స్‌ప్రెషన్ నాకు ఇంకా బాగా నచ్చింది'. అని చెప్పేసి ఆయన పేరు ఊరు ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయాడండి. అప్పుడు అనిపించింది - మనం బాగా రాస్తే అభినందించేవాళ్లు ఉంటారు, వాళ్ళు మన గొడవ ఏమీ పట్టించుకోకుండా, వాళ్ళ గొడవ ఏమీ తెలపకుండా కేవలం ఎక్స్‌ప్రెషన్ బాగుంది అని చెప్పి వెళ్తున్నారు, ఎంత సిన్సియారిటీ ఉంది, ఎంత సీరియస్ నెస్ ఉంది ఆ అభినందనలో - అని మురిసిపోయానండి.

ఈ పాట పాడినందుకు కీరవాణి గారికి సింగర్‌గా నంది అవార్డు వచ్చింది. నా పాటకు ఆయనకు ఆ అవార్డు రావడం నాకు చాలా ఆనందాన్నిచ్చింది. ఆయనకు కంగ్రాట్స్ చెప్పాను. మీకు రాలేదా? అని అడిగి నాకు రాలేదని తెలిసి ఆయన కొంచెం ఫీలయ్యారు. అయితే మనస్విని అవార్డు నాకు వచ్చిందని ఆయనకు చెప్పినపుడు -మీకు రావల్సిన అవార్డు నాకు వచ్చిందని అప్పుడు గిల్టీ ఫీలయ్యాను. ఇది సాహిత్య పరమైన పాట కదా. అంచేత నామనసు విని మీకు మనస్విని అవార్డు ఆ భగవంతుడు ఇచ్చాడు అని చాలా సంతోషపడ్డారు.

ఇక ఈ పాటని కీరవాణిగారు పాడటం పట్ల నా ఫీలింగ్ ఏంటంటే - ఆర్ద్రత ఎక్కువుగా ఉన్న పాటల్ని కీరవాణి గారు పాడితే బావుంటుంది. 'మరపురాని తిరిగిరాని గుర్తులండి మీ మనసు నొచ్చుకుని ఉంటే మన్నించండి' అనే లైనులో. 'మన్నించండి' అనే మాట కోసమే కీరవాణి గారు పాడి వుంటారండి. ఎందుకంటే పాటంతా ఒక ఎత్తు. మన్నించండి అనే మాట ఒక్కటే ఒక ఎత్తు. ఆ మాట వినగానే హత్య చేసినా సరే మన్నించాలి అని అనిపిస్తుంది. కీరవాణి గారు అంత అద్భుతంగా ఆ మాటను పలికించారు. ఆ మాటను ఆయన పలికించినపుడు - అల్లరి, చిల్లర పనులు ఎన్ని చేసినప్పటికీ మన్నించండి అని అడుగుతూ వుంటే అదో తప్పా - అని ఎవరైనా సరే రివర్సులో ఫీలవుతారు. మన్నించండి అనే మాటకు మన సంప్రదాయంలో అంత విలువ ఉంది. ఆ మాటలో ఎంత గాఢత ఉందో ఆ గొంతులో కూడా అంత గాఢత వుంటేనే ఆ మాటకు అర్థం సరిగ్గా అందుతుంది. అది కీరవాణిగారు మాత్రమే అనగలిగే మాట. ఆయనంటేనే ఆ మాటకు విలువ. ఆయనంటేనే అంత పవరుంటుంది. అది సూటిగా గుండెల్లోకి వెళ్తుంది. చెవులకు కాదు. చెవులకి వెళ్లి అక్కడ నుండి మెదడుకు వెళ్లి 'ఓహో ఈ మాట అన్నాడు' అని రిజిస్టర్ అయి అక్కడి నుండి గుండెకి చేరి థర్డ్ రియాక్షన్‌లాగ కాకుండా నేరుగా గుండెలోతులను తాకి ఆకట్టుకుంటుంది. ట్రాన్స్‌మిషన్ లాస్ ఏమీ ఉండదు.

తర్వాత కాలేజీ క్యాంపస్ పాటలు రాయాలంటూ చాలా మంది వచ్చారు. నాలుగైదు పాటలు రిజెక్ట్ చేశానండి. కాలేజీ క్యాంపస్ బ్యాగ్రౌండ్‌లో ఏదైనా కొత్త తరహా ఉంటే తప్ప మళ్లీ రాయకూడదు అని నిర్ణయించుకున్నాను. తర్వాత రెండు మూడు పాటలు కాలేజీ బ్యాక్‌గ్రౌండ్‌లో కొత్త తరహాలో రాసాను కూడా. కానీ కాలేజ్ పాటల పట్ల ఇంతకంటే కొత్తగా ఉండేలా జాగ్రత్తపడేలా చేసింది ఈ పాట.

# ఆకాశవాణి సంగీత సమ్మేళన్ - 2003 బ్రాడ్‌కాస్ట్ షెడ్యూల్

## 10.00 P.M. To 11.00 P.M



22.11.03
టి.వి.శంకరనారాయణ
గాత్రం



23.11.03
విధూషి వీణ సహర్షబుద్యే
గాత్రం



24.11.03
ప్రొ॥ఆర్.విశ్వేశ్వరన్
వీణ



25.11.03
పి.బి.రాజేంద్రప్రసన్న
ఫ్లూట్



26.11.03
ఆర్.వేదవల్లి
గాత్రం



27.11.03
విధూషి శాంతి హిరనంద్
గాత్రం



28.11.03
డా॥ ఎన్. రమణి
ఫ్లూట్



29.11.03
ఉస్తాద్ రహీమ్ పహీముద్దీన్
దాగర్
ధ్రుపద్ - ధమర్





30.11.03.
1. గురు కారక్కుడి మణి
మృదంగము (సోలో)
2. వాలయపట్టి ఎ.ఆర్.
సుబ్రహ్మణ్యం
తవిల్ (సోలో)

'రాజుపాలెం' చాలా చిన్న పల్లెటూరు!

ఆ ఊళ్లో ప్రాథమిక సౌకర్యాలు పెద్దగా లేవు....'ప్రధానమంత్రి గ్రామ సడక్‌యోజన' పుణ్యమా అని ఈ మధ్యనే ఆ ఊరి నుంచి పక్కనున్న పట్నానికి పక్కారోడ్డుపడింది.. అందువల్ల ఊళ్లోకి బస్సులు వస్తున్నాయి.

ఆ ఊరు పేరుకే 'రాజుపాలెం' తప్ప- ఊళ్లో రాచరికం వెలగబెట్టే మహరాజు లెవరూ లేరు.

కానీ 'రావ్ బహుద్దూర్' వంశానికి చెందిన వీరభద్రం మాత్రం ఆ ఊరికి మకుటం లేని మహరాజుగా చెలామణీ అయిపోతున్నాడు. వీరభద్రం - మనిషి మంచివాడే... కానీ అదోటైపు!... ఆయనగారి వేషభాషలు - చూసేవాళ్లకీ, వినేవాళ్లకీ చిత్రవిచిత్రంగా అనిపిస్తాయి.

'రాజుపాలెం'లో వున్న ఎలిమెంటరీ స్కూలుకి వీరభద్రం హెడ్‌మాస్టరుగానూ - మేనేజరు గానూ కూడా వుంటున్నాడు. ఎందుకంటే, అది ఆయన తాతగారు కట్టించిన స్కూలు కనుక!... ఆ తాతగారి పేరు రావుబహద్దూర్ రామభద్రంగారు... వీరభద్రం తండ్రి - బలభద్రం కూడా రావుబహద్దూర్ బిరుదు పొందినవాడే!.. అందుకే ఆ పూర్వీకుల హోదా వైభవాలూ, ఠీవీదర్పాలూ ఇప్పటి వీరభద్రం మేస్టారిలో - 'చచ్చిన చింతలో మిగిలిపోయిన పులుపు'లా - ఇంకా నిలిచిపోయాయి. వీరభద్రం మేస్టారు ఉభయ భాషాప్రవీణులు..! అంటే - సంస్కృతాంధ్ర భాషల్లో కాదు - ఆంగ్ల ఆంధ్ర భాషల్లో!... స్వచ్ఛమైన గ్రాంథిక భాషతోపాటు - అడపాదడపా, ఆగ్రహావేశాలు వచ్చినపుడు - అలవోకగా ఆంగ్లాన్ని కూడా జోడించి మాట్లాడటం ఆయనకు అలవాటు. వీరభద్రం మేస్టారి భార్యపేరు పార్వతమ్మ. అలాంటి మొగుడితో వేగుతున్న ఆమెగారి సహనాన్ని చూసి జాలి పడవలసిందే!

ఈ దంపతులకు ఒక ఆడపిల్ల, ఇద్దరు మగపిల్లలూ - వెరసి ముగ్గురు సంతానం. ఆడపిల్ల 'గీత'కి రెండేళ్ల క్రితం రాజేంద్రతో పెళ్లయింది... వాళ్లిప్పుడు హైద్రాబాద్‌లో వుంటున్నారు.

ఇక మగపిల్లల్లో పెద్దవాడు శ్రీరామ్... పేరుకి తగినట్టే ఆజానుబాహుడు! నీలమేఘశ్యాముడు మాత్రం కాదు.. ఎర్రని ఎండలో ఏడడుగులు నడిస్తే కందిపోయేటంత తెల్లగా వుంటాడు. టౌనులో వున్న కాలేజీలో డిగ్రీ ఫైనలియర్ చదువుకుంటూ హాస్టల్లో వుంటున్నాడు!... రెండోవాడు లక్ష్మణమూర్తి.. తల్లితండ్రుల దగ్గరే వుంటూ పక్కవూళ్లో పదోక్లాసు చదువుతున్నాడు..!

ఊర్లో జనాలకీ, స్కూల్లో వున్న మేస్టర్లకీ - ఇంట్లో కుటుంబ సభ్యులకీ - 'వీరభద్రం' పేరు చెప్తే - వీర భయం!... అందుకు కారణం ఏమిటని అడిగితే - ఎవరూ చెప్పలేరు... ఆయన ముఖంలోకి ఎవ్వరూ, ఎప్పుడూ డైరక్టుగా చూసి మాట్లాడలేరు... చూస్తేనే చాలు - మాట పడిపోతుంది! ఒకవేళ ధైర్యం చేసి ఎవరైనా మాట్లాడే ప్రయత్నం చేస్తే 'రాముడి భార్య పేరు హిడింబి' అనీ 'తాజ్‌మహల్ కట్టించింది 'ఇందిరాగాంధీ' అనీ - తప్పడు కూతలు కూస్తారు! అయితే తాళి కట్టించుకుని కాపురం చేస్తున్న కారణాన పార్వతమ్మ మాత్రం - అప్పుడప్పుడు - ఇక తప్పదనుకున్నప్పుడు - ధైర్యంచేసి మొగుడికి సలహాలు ఇస్తూంటుంది!

ఇంతటి ఘనకీర్తి కలిగిన వీరభద్రం మేస్టారికి జాతకాలపట్ల నమ్మకం జాస్తి! ఆఖరికి చిలకజోస్యం మనిషి - ఆయన కంటపడినా అతని పంట పండిందన్న మాటే!.. ఈ రకం జాతకాల పిచ్చికి సాయం చాదస్తాలూ, మూఢ నమ్మకాలూ కూడా ఆయనకు ఎక్కువేనని చెప్పాలి!... తిథి వార నక్షత్రాలు చూడందే పనులు ప్రారంభించడు... శకునం చూసుకోందే వీధిలోకి అడుగుపెట్టడు.

అదీ వీరభద్రం మేస్టారి కేరక్టరు!

ప్రక్కన సజెషన్‌లో ఉదహరించిన నటీనటులను మనసులలో వుంచుకుని - జరిగే కథను మీ మనో నేత్రాలతో తిలకించండి...!



'హాసం' సంపాదకుడు 'రాజా' నాకు ఆత్మీయ మిత్రులు!

నేను కథలు రాస్తానని ఆయనకు తెలుసు...

ఆయన కవితలు బాగా రాస్తారని నాకు తెలుసు.

కవితలు రాసేవాళ్లకి సంగీతం పట్ల అభిరుచీ ఆసక్తీ ఎక్కువగా వుంటాయి!...

శ్రీ 'రాజా'లో కూడా ఆ గుణగణాలు బాగా కనిపిస్తాయి... ఓ ప్రముఖ దినపత్రికలో ఆయన ఒకప్పుడు నిర్వహించిన 'ఆపాత మధురం' శీర్షిక అందుకు నిదర్శనమని చెప్పాలి!

శ్రీ రాజా చాలా పత్రికల్లో పనిచేశారు. కానీ ఎందులోనూ ఆయనకు తగినంతగా తృప్తీ రావల్సినంతగా గుర్తింపూ రాలేదని నేననుకుంటూ వుండేవాణ్ణి...

సరిగ్గా అలాంటి సమయంలోనే - ఓసారి మా ఫ్రెండింట్లో 'హాసం' పత్రిక చూశాను... దాన్ని నిర్వహిస్తున్నది శ్రీ 'రాజా'యే అని తెలుసుకున్నాక చాలా సంతోషం కలిగింది. గబగబా పేజీలన్నీ తిరగేశాను. సంగీత సాహిత్యాలు రెండింటికీ సమానమైన హోదా కల్పిస్తూ - మరోవైపు హాస్యానికి హారతినందిస్తూ ఎంతో అందంగా - 'హుందా'గా - ఓ ప్రత్యేక తరహాలో కనిపించింది...

ఒకప్పుడు నేను చాలా కథలూ - కొన్ని నవలలూ రాశాను.

అలా రాసే రోజుల్లో - పాఠకులు వాటిని చదివి బాగుందని మెచ్చుకున్నప్పుడు - పత్రికనించి వచ్చిన పారితోషికం కంటే - ఆ మెప్పుదలే - గొప్ప కిక్కిచ్చేది!... తర్వాతర్వాత - పత్రికలు చదివేవాళ్లు తగ్గిపోయారు. పత్రికలూ తగ్గేయి... ఆ పరిస్థితుల్లో పత్రికలకు రాయటం ఏ రకంగానూ గిట్టుబాటు కాదనిపించి - టీవీకి రాయటం మొదలెట్టాను.

మళ్లీ ఇప్పుడు 'హాసం' చూశాక - ఇలాంటి మంచి పత్రికలో రాయలన్న కోరిక మళ్లీ కలిగింది... శ్రీ రాజా గార్కి ఫోన్ చేసి చెప్పాను. అర్జంటుగా రాయండన్నారు... లోగడ ఎప్పుడో సినిమా కోసం నేను రాసిపెట్టుకున్న ఓ కథాంశాన్ని ఆయనకు చెప్పాను.... బాగుందన్నారు..... అందుకే ప్రారంభించాను... ఇందులోని పాత్రలన్నీ మీ అభిమాన పాత్రమవుతాయని ఆశిస్తున్నాను.

**- జొడిగుంట రామచంద్రమూర్తి**

| పాత్రలు | నటీనటుల సజెషన్ |
|---|---|
| వీరభద్రం | కోట శ్రీనివాసరావు |
| విష్ణుమూర్తి | నూతన్‌ప్రసాద్ |
| శ్రీరామ్ | తరుణ్ |
| అశ్విని | శ్రియ |
| పార్వతమ్మ | అన్నపూర్ణ |
| హనుమంతు | గుండు హనుమంతరావు |
| అనంత్ | గోపీచంద్ |

అవి సంక్రాంతి రోజులు....

అప్పుడే తెల్లవారింది...!

'రాజుపాలెం'లో వున్న రామాలయం ప్రహరీగోడ మీది స్పీకరులోంచి - శ్రీ వేంకటేశ్వర సుప్రభాతం వినిపిస్తోంది...

వయసులో వున్న ఆడపిల్లలు కొంతమంది బిందెలు భుజాన వేసుకుని ఊరి చివరి చెరువుకి వెడుతున్నారు. రైతులు - అరకలు పట్టుకుని - ఎద్దుల్ని తోలుకుంటూ పొలాలవైపు నడుస్తున్నారు.

పొడవుగా వున్న ఆ సన్నని రోడ్డు మీద - కొన్ని ఇళ్ళముందు కన్నె పిల్లలు కలాపి జల్లి - ముగ్గుల్ని తీర్చిదిద్దుతున్నారు.

ఓ చేత్తో తంబుర మీటుతూ - మరో చేత్తో చిడతలు వాయిస్తూ హరిదాసు కీర్తన పాడుతున్నాడు. అలా పాడుతూనే ఓ ఎత్తరుగుల ఇంటిముందుకొచ్చాడు. ఆ ఇల్లు వీరభద్రం మేస్టారిది!

"మము బ్రోవమనీ చెప్పవే రాధమ్మ తల్లీ" - అని పాడుతూ - ఆ ఇంట్లోకి భయం భయంగా చూస్తున్నాడు హరిదాసు. అంతలో 'బియ్యం చేట' చేత పట్టుకుని పార్వతమ్మ ఆ ఇంట్లోంచి బయటకు రానేవచ్చింది.

"అదేమిటయ్యా దాసూ! కీర్తన తప్పు పాడుతున్నావేమిటీ?'' - చేటలోని బియ్యాన్ని హరిదాను తలమీద - మెరుస్తున్న రాగి పాత్రలో పోస్తూ అడిగింది.

"తప్పు పాడుతున్నానా తల్లీ?.. ఏమో?.. 'అయ్యగారి కంటపడి చస్తానేమో' నన్న భయంతో బహుశా తడబడి - తప్పుగా పాడేవుంటాను... తమరే వచ్చారు.. అదృష్టవంతుణ్ణి!'' - అన్నాడు హరిదాసు తలమీది పాత్రను సవరించుకుంటూ.

అతని మాటలు విన్న పార్వతమ్మ నవ్వుకుంది.

"అయ్యగారంటే అంత భయం దేనికయ్యా దాసూ?" - అడిగింది.

"ఏమో తల్లీ!... మహానుభావులు!.. ఎందుకో వారి ముఖారవిందాన్ని తిలకించాలంటే చచ్చేటంత భయంగా వుంటుంది" - అదే భయంతో మరోసారి లోపలకు చూస్తూ చెప్పాడు దాసు.

సరిగ్గా అదే క్షణంలో లోపల్నించి ఓ 'గాండ్రింపు' వినిపించనే వినిపించింది -

''ఏవోయ్!... ఎక్కడ అఘోరిస్తున్నారు?"

అది వీరభద్రం మేస్టారి గొంతు! ఆ గొంతు విన్న హరిదాసు హడలిపోయాడు.




"అమ్మో! అయ్యగారు!" అంటూనే పరుగులాంటి నడకతో పక్కింటికి పారిపోయారు.

లోపల అద్దం ముందు నిలబడి - మీసాన్ని చిన్న దువ్వెనతో ట్రిప్ చేసుకుంటున్న వీరభద్రం - హరిదాసుకి బియ్యం వేసి లోపలకు వస్తున్న పార్వతమ్మను అద్దంలోంచే చూసి కోపంగా అన్నాడు-

"హుం! ఆ దాసుకంటెనూ మేము తీసిపోయితిమి!... వారికి బిచ్చం వేయుటలో వున్న శ్రద్ధ - కట్టుకున్న భర్తగారికింత కాఫీ ఇచ్చుటలో లేకపోయినది!"

"ఇప్పటిదాకా మీరు పూజలో వున్నారు కదా అని ఇవ్వలేదు... క్షణంలో తెస్తానుండండీ" - అంటూ పార్వతమ్మ వంటింట్లోకి నడిచింది.

ఈలోగా పక్కనేవున్న అద్దాల బీరువాలోంచి బట్టలు తీసుకున్నాడు వీరభద్రం...



పొందూరు ఖద్దరు పంచె కట్టుకుని - దానిమీద తెల్లని చొక్కా వేసుకున్నాడు... ఆ చొక్కా మీద చేతులులేని కోటు తొడుక్కున్నాడు. గొలుసు గడియారానికి 'కీ' ఇచ్చుకుని - కోటు జేబులో వేసుకున్నాడు. బంగారు ఫ్రేం కళ్ళద్దాలు పెట్టుకున్నాడు.

అంతలో పార్వతమ్మ వెండిలోటా గ్లాసుతో కాఫీ తెచ్చి భర్తకు అందించింది.

"ఏడీ? సుగ్రీవుడు కనిపించడేం?... 'నిద్ర బెడ్డు' మీదనించి ఇంకా లేవలేదా?" కాఫీ తాగుతూ ప్రశ్నించాడు వీరభద్రం.

నుదుటిమీద చేత్తో కొట్టుకుని అడిగింది పార్వతమ్మ-

"మీరెంత ఉభయభాషా ప్రవీణులైనా అలా తెలుగూ ఇంగ్లీషూ కలిపి మాట్లాడక్కర్లేదు. అర్థం చేసుకోలేక ఛస్తున్నాను. కాస్త మామూలు భాషలో అడక్కూడదూ?"

"ఊఁ... సుగ్రీవుడింకా 'నిద్రమంచం' దిగలేదా అని ప్రశ్నించితిమి... ఇందులో అర్థంకానిదేమున్నదీ?'' - చిరుకోపం ప్రదర్శించాడు వీరభద్రం.

"లేచాడు!"

"మరి కనిపించడేల?"

''వంటింట్లో కూర్చుని కాఫీ తాగుతున్నాడు!"

"ఆ అఘోరించేదో ఇక్కడ హాలునందు కూర్చుని అఘోరించ వచ్చునుగా?" విసుక్కుంటూ అడిగాడు వీరభద్రం.

వంటింట్లో తలుపు పక్కనే కూర్చుని కాఫీ తాగుతున్న లక్ష్మణమూర్తికి తండ్రి మాటలు వినిపించాయి. తాగుతున్న కాఫీ గుటక పడక పొలమారింది. తలుపు చాటునించే నెమ్మదిగా హాల్లోకి చూశాడు.

పార్వతమ్మ చేటలో బియ్యం పోసుకుంటూ చెప్తోంది-

"మీరు ఇంట్లోవుంటే పిల్లలు ఎప్పుడైనా ధైర్యంగా తిరగ్గలరా? దాక్కోవల్సిందే!"

"ఏం? ఎందువలన?" - ఖాళీ గ్లాసు భార్యకు ఇచ్చేస్తు అడిగాడు.

"ఏమో?... అందరికీ మీరంటే భయమేగా?"

"నిజముగా భయమున్నవారైనా ఇట్లు విచ్చలవిడిగా ఎందుకు అఘోరించెదరు? వాడు మేధమేటిక్సునందు మహాదరిద్రముగా వున్నాడట.. వల్లభరావు మేస్టారు చెప్పినారు!"- పట్టుకండువా తీసి మెడచుట్టూ వేసుకుంటూ చెప్పాడు వీరభద్రం.

వంటింట్లో కాఫీ తాగుతున్న లక్ష్మణమూర్తికి మళ్లీ పొలమారింది... తండ్రి మాటలు అతనికింకా వినిపిస్తూనే వున్నాయి.

"వీడి సంగతి అటుంచుము... అసలు ఆ వాలిగాడికి బుద్ధి జ్ఞానములున్నవా?.. నేను ఉత్తరము రాసి ఇరువది రోజులైనది... రిప్లయ్ రాసినాడా?"- తీవ్ర స్వరంతో అడిగాడు వీరభద్రం.

"ఏమో ప్రీ ఫైనలున్నాయట కదా!... తీరికలేదేమో బిడ్డకి!.. అయినా నిక్షేపంలా శ్రీరామచంద్రమూర్తీ, లక్ష్మణమూర్తీ అని బారసాలనాడు నామకరణాలు చేసుకుని - వాళ్ళనలా 'వాలీ - సుగ్రీవుడూ' అని పిలుస్తారెందుకూ?"

"నా బిడ్డలను... నా ఇష్టము! వాలీ సుగ్రీవుడు అని కాకున్న - 'జాంబవంతుడూ - హనుమంతుడూ' అని 'కాల్' చుకుంటాను...

లేదా జార్జి వాహింగ్‌టన్నూ - అబ్రహాం లింకన్నూ' - అని 'కాల్' చుకుంటాను... ఇంకెప్పుడూ నా 'కాల్'పులకు అడ్డం పడకు" - అంటూ విసురుగా పక్క గదిలోకి నడిచాడు.

అంతవరకూ పాలచెంబూ, పలుపుతాడూ పట్టుకుని - దూరంగా నిలబడి చూస్తున్న పాలేరు నారాయణ నెమ్మదిగా పార్వతమ్మను సమీపించాడు. "అమ్మగోరూ! అదేంటండీ?.. అయ్యగారు అలా 'కాల్పులూ - కాల్చుకుంటానూ' అంటారేంటీ?" - అడిగాడు.

"అంతేలే నాయనా!... 'పిలుపులూ, పిల్చుకుంటానూ' అనటానికి - ఇంగ్లీషులో వచ్చిన తిప్పలవి!... మధ్యన నన్ను కాల్చుకు తింటున్నారు!.. భర్తన్నా ఇంగ్లీషు నేర్చుకోలేక!" - నిట్టూరుస్తూ - లోపలకు వెళ్ళిపోయిందామె.

"బలేబావుందే?... కాల్చుకోవటం అంటే పిల్చుకోటం అన్నమాట! అయితే ఇప్పుడు నేను నా సీతాల్ని కాల్చుకోవాలిగా" - అనుకుంటూ ఆ ఇంటిని ఆనుకునివున్న గొడ్లపాకవైపు నడిచాడు నారాయణ.

ఆ పాకలో గేదె గడ్డి మేస్తోంది... ఆ గేదెని నారాయణ 'సీతాలూ' అని ముద్దుగా పిలుచుకుంటూంటాడు.




'సీతాలు-సింగారం, మాలచ్చి బంగారం' - అని పాడుతూ, పాలచెంబుతో దాని దగ్గరకు వచ్చాడు. చెంబులో వున్న నీళ్ళతో పొదుగు శుభ్రం చేసి పాలు పితికటం ప్రారంభించాడు.

'చుయ్... చుయ్'మని శబ్దం చేస్తూ చెంబులోకి పాలు వస్తున్నాయి. అలా అయిదారు సార్లు శబ్దం వినిపించింది.. ఆ తర్వాత ఆగిపోయింది. నారాయణ పాట ఆపేసి విస్తుపోయాడు... మరోసారి పితికాడు... ఇంకోసారి పితికాడు... అయినా పాలు రావటం లేదు... ఖంగారు పడిపోయాడు...

"రోజూ మూడు లీటర్ల పాలిచ్చే దానివి... ఇయ్యాల గలాసుడు కూడా ఇవ్వలేదేంటే సీతాలూ?...ఏమైందే నీకియాల?" - అంటూ దీనంగా గేదెవైపు చూశాడు...

గేదె రోడ్డు మీదకు చూస్తోంది... నారాయణ కూడా అటువైపు తన దృష్టి సారించాడు.

ఇంటి మెట్లు దిగి రోడ్డు మీదకు నడుస్తున్న వీరభద్రం కనిపించాడు... విషయం బోధపడింది.

"వార్నీ ! ఈరబద్రం మేస్టార్ని సూత్తే నీకూ బయమేనేంటే సీతాలూ?" - అన్నాడు నారాయణ నవ్వుకుంటూ... సీతాలు గడ్డి నెమరువేయటం మాని ఇంకా అటే చూస్తోంది.

"అవున్లే!... మడుసులం మేమే ఆర్ని చూసి జడుసుకుంటాం... అట్టాంటిది - మూగ జీవానివి... నువ్ బిగుసుకుపోవటంలో ఇడ్డూరం ఏవుంటదీ?" - అని మళ్ళీ తనకు తనే సమాధానం చెప్పుకున్నాడు.

వీరభద్రం కనుచూపుకి అందనంత దూరం వెళ్ళిపోయాక - నారాయణ మళ్ళీ పాలు పితకటం ప్రారంభించాడు... 'చుయ్ చుయ్' మని శబ్దం చేస్తూ చెంబునిండా పాలొచ్చాయి...

వీరభద్రం ఆ వీధి మలుపు తిరిగి మరో సందులోంచి నడుస్తున్నాడు.

ఆ సందులో ఎక్కువగా పేద కుటుంబాలే నివసిస్తున్నాయి.

ఓ తాటాకు పాకలాంటి ఇంట్లో - పొయ్యిమీద పాలు పొంగుతున్నాయి. అదే సమయంలో - పక్కనే వున్న 'చీర ఉయ్యాల'లో చంటిబిడ్డ గుక్కపట్టి ఏడుస్తున్నాడు.

అపుడే నీళ్ళ కడవతో బయట్నించి లోపలకొచ్చిన ఆ ఇంటి ఇల్లాలు - కడవ గోడవారనపెట్టి - గబగబా పొయ్యి దగ్గరకు వెళ్లింది.

"ఏడవకు నాన్నా!... వచ్చేస్తున్నా...!" అంటూ ఓ వైపు బిడ్డను ఓదారుస్తూనే మరోవైపు పొయ్యి మీద నించి పాలగిన్నె దింపి - ఇంకో గిన్నెలో నీళ్లు పోసి పెట్టింది.

పిల్లవాడు ఏడుపు ఆపలేదు సరికదా - మరింత శృతి పెంచాడు.

"నోరు మూసుకుపడుకుంటావా?... ఈరబద్రం మేస్టార్ని పిలవమంటావా?" - నీళ్ళగిన్నెలో నూకలుపోస్తూ - పొయ్యి దగ్గరే వుండి విసురుకుంది ఆ ఇల్లాలు. అంతే !

పిల్లవాడు ఠక్కున ఏడుపు ఆపేశాడు. అయితే ఆ మరుక్షణంలోనే ఆమెకు ఓ గొంతు వినిపించింది -

"ఎవరదీ? - మమ్మల్ని తలుచుకుంటున్న వారెవరు?"

ఆమె ఉలికిపాటుతో వెనక్కి తిరిగి చూసింది. వీధి గుమ్మం దగ్గర గొడుగు వేసుకుని నిలబడి వున్న వీరభద్రం కనిపించాడు. ఖంగారుగా లేచి పైటను భుజం మీదుగా లాక్కుని - నేలచూపులు చూస్తూ భయం భయంగా చెప్పింది -

"మి... మీరా మాస్టారూ?... మా చంటి వెధవ గుక్కపట్టి ఏడుస్తూంటే - భయపెడదామనీ - ఉరికే అలా అన్నాను... అంతే!"

"ఉఁ... మంచిది... ఇంకా అట్లే ఏడిస్తే - డొక్క చీల్చేదనని చెప్పండి మీ కుంకకి! పెద్దయిన పిదప నా పాఠశాలలో 'సీటు' కూడా ఇవ్వబడదని చెప్పండి!" - అంటూ హెచ్చరించి మళ్లీ రోడ్డు మీదకు వచ్చి - స్కూలు వైపు నడక సాగించాడు.

ఆ ఇల్లాలు - అటువైపే చూస్తూ నిలబడిపోయింది.

**(ఇంకావుంది)**



# అర్థం చేసుకుందాం ఆస్వాదిద్దాం

| | తమిళం | తెలుగు |
|---|---|---|
| చిత్రం | నానుమ్ ఒరు పెణ్ | నాదీ ఆడజన్మే |
| రచన | కణ్ణదాసన్ | దాశరథి |
| సంగీతం | ఆర్.సుదర్శనం | ఆర్.సుదర్శనం |
| గానం | టి.ఎం. సౌందరరాజన్, పి.సుశీల | పిఠాపురం నాగేశ్వరరావు పి.సుశీల |

ఏ.వి.ఎం. సంస్థ నిర్మించిన 'నానుమ్ ఒరు పెణ్' తమిళ చిత్రంలో కథానాయకుడి తమ్ముడి పాత్రను రాజన్, కథానాయిక చెల్లెలి పాత్రను పుష్పలత పోషించారు. రాజన్ ఈ తర్వాత ఏ.వి.ఎం. రాజన్‌గా ప్రసిద్ధులయ్యారు. చిత్రకథ ప్రకారం కథానాయకుడి తమ్ముడూ కథానాయిక చెల్లెలూ ఒకే కళాశాలలో చదువుతూ ఉంటారు. కయ్యాలతో మొదలైన వాళ్ల పరిచయం నెయ్యానికి దారి తీస్తుంది. చిత్రం చివర ఆ ఇద్దరికీ పెళ్లి జరుగుతుంది. 'నానుమ్ ఒరు పెణ్' చిత్రం రూపొందుతూ ఉన్న రోజుల్లోనే రాజన్, పుష్పలత ప్రేమలో పడ్డారు. ఈ తర్వాత పెళ్లి చేసుకున్నారు. తమిళ చిత్రంలో రాజన్, పుష్పలత ధరించిన పాత్రలను 'నాదీ ఆడజన్మే' చిత్రంలో హరనాథ్, జమున పోషించారు. జమున, హరనాథ్ నాయికా నాయకులుగా ఆ తర్వాత ఎన్నో చిత్రాలు రావడానికి - 'నాదీ ఆడజన్మే' ఒరవడి అయింది.

నాయకుడి తమ్ముడు, నాయక చెల్లెలు ఒకరినొకరు బోల్తాకొట్టించే ప్రయత్నాలు చేస్తారు. ఆ సన్నివేశాలను బట్టి నాయకుడి తమ్ముడు పాట ఒకటీ నాయక చెల్లెలు పాట ఒకటీ తమిళ చిత్రం కోసం ఒకే పల్లవిలో రాశారు కణ్ణదాసన్. ఆ పాటలను నాయకుడి తమ్ముడు కోసం టి.ఎం.సౌందరరాజన్, నాయక చెల్లెలు కోసం పి.సుశీల పాడారు.

తెలుగు చిత్రంలోని నాయకుడి తమ్ముడు పాటను పిఠాపురం నాగేశ్వరరావు పాడగా నాయక చెల్లెలు పాటను పి.సుశీల పాడారు.

'నానుమ్ ఒరు పెణ్', 'నాదీ ఆడజన్మే' చిత్రాలలో పి.సుశీల గానం గురించి ప్రత్యేకంగా చెప్పుకోవాలి. 'నల్లని కన్నయ్య' పాటలో ఆవేదన, 'చిన్నారి పొన్నారి' పాటలో స్వాప్నికత పలికించిన సుశీల - 'లెఫ్టరైట్' పాటలో వినిపించిన చిలిపితనం ఆమెకు మాత్రమే సాధ్యం. గాయనిగా ఆమె బహుముఖప్రజ్ఞకు చక్కని ఉదాహరణలు ఈ పాటలు.

'ఏమాఅచ్ చొన్ నదుమ్‌నానో' అనే తమిళగీతంలో వేర్వేరు పంక్తుల చివర వచ్చే 'నో' అనే అక్షరం ఒక్కొక్కసారీ ఒక్కొక్క రకంగా పలకడం ద్వారా సాధించిన ప్రత్యేకత- తెలుగు పాటలో ఏల, జాల అంటూ ముగిసే పంక్తుల చివరి లాలను పలకడంలోనూ సాధించారు సుశీల. 1970లలో సుశీల పాడిన కొన్ని అరుపుల కేకల పాటలతో ఈ పాటను పోల్చి చూస్తే చిత్రంగా ఉంటుంది!

పిఠాపురం నాగేశ్వరరావు 'నాదీ ఆడజన్మే' చిత్రంలో బాగానే పాడినా ఆ తర్వాత ఆయన ప్రధాన పాత్రలకు నేపథ్యగానం చేసిన సందర్భాలు బాగా తక్కువ.

**ముందుగా 'నానుమ్ ఒరుపెణ్' చిత్రంలోని పాటలు చూద్దాం:**

అతను:
ఓహో హోయ్
ఏ మాఅచ్ చొన్‌నదుమ్ నానో
ఎన్ మీదు కోబమదేనో
మనమ్ మాఱీ పోవదుమ్ ఏనో
ఎంగే నీ శెన్‌ఱాలుమ్ విడువేనో
లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్
లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్ అబౌట్ టర్న్ ॥ఏమాఅ॥

కణ్‌గళే మౌనమామ్ కాదలైప్‌శుదే
అయ్‌యయ్‌యో ఉన్ ముగమ్ కోబక్కణల్ వీశుదే
ఇన్‌ద బావనై తోట్‌అముమ్ ఏనో
ఇదు పావైయర్ సాగసమ్‌దానో
మనమ్ మాఱీపోవదుమ్ ఏనో
ఎంగేనీ శెన్‌ఱాలుమ్ విడువేనో
లెఫ్ట్‌రైట్......... ॥ఏమాఅ॥

పున్‌నగై కాట్‌టియే పోధైయై ఏట్‌ఱినాయ్
కన్‌నియే పాదియిల్ కధైయై ఏన్ మాట్‌ఱినాయ్
తుణైత్‌తేడిత్ తవిక్‌కుదే పరువమ్
అన్‌బై మూడి మఱైక్‌కుదు ఉన్ గరువమ్
మనమ్ మాఱీ పోవదుమ్ ఏనో
ఎంగే నీ శెన్‌ఱాలుమ్ విడువేనో
లెఫ్ట్‌రైట్..... ॥ఏమాఅ॥










ఆమె:
లెఫ్ట్ రైట్ లెఫ్ట్ రైట్ అబౌట్ టర్న్
హోయ్ హోయ్ హోయ్ హోయ్
ఏమాఅచ్ చొన్‌నదుమ్ నానో
ఎన్‌మీదు కోబమ్ తానో
మనమ్ మాఱీ పోవదుమ్ ఏనో
ఎంగే నీ శెన్‌ఱాలుమ్ విడువేనో
లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్
లెఫ్టురైట్ లెఫ్టురైల్ అబౌట్‌టర్న్ ॥ఏమాఅ॥

కైగళే పోయినుమ్ కాదల్ తుణ్‌డాగుమా
అన్‌బైయే నాడిడుమ్ పెణ్‌మనమ్ మాఱుమా
ఇన్‌ద నాడగమ్ ఎన్‌నిడమ్ ఏనో
ఇదు ఆడవర్ సాగసమ్‌తానో
మనమ్ మాఱీ పోవదుమ్ ఏనో
ఎంగే నీ శెన్‌ఱాలుమ్ విడువేనో ॥ఏమాఅ॥

కన్‌నిఎన్ నెన్‌జిలే కాట్‌చి నీ ఇల్‌లైయా
కణ్‌గళే కలన్‌దపిన్ సాట్‌చియుమ్ తేవైయా
ఇన్‌నుమ్ పుఱిన్‌దు కొళ్ళాదదు పుదుమై
ఇని పిఱిన్‌దిడ నినైప్‌పదు కొడుమై
మనమ్ మాఱీ పోవదుమ్ ఏనో
ఎంగేనీ శెన్‌ఱాలుమ్ విడువేనో ॥ఏమాఅ॥

## తమిళ గీతాల భావానువాదం:






అతను:

ఏమార మన్నది నేనా
నా మీద కోపమేనా
మనసు మారి వెళ్లడమెందుకో
ఎక్కడికి నీవు వెళ్లినా వదిలిపెడతానా
లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్ అబౌట్‌టర్న్ ॥ఏమార॥

కన్నులే మౌనంగా ప్రేమనే చెప్పెలే
అయ్యయ్యో నీ ముఖం కోపాగ్ని కురిపించెనే
ఈ పైపై వేషాలేలో
ఇది మగువల పద్ధతి యేనా
మనసుమారి వెళ్లడమెందుకో
ఎక్కడికి నీవు వెళ్లినా వదిలిపెడతానా ॥ఏమార॥

చిరునవ్వులు చిందించి మత్తెక్కించావు
కన్నియా! మధ్యలో కథనెందుకు మార్చావు
తోడు వెదకుతూ తపిస్తున్నది పరువం
ప్రేమను దాచి పెడుతున్నది నీ గర్వం
మనసు మారి వెళ్లడమెందుకో
ఎక్కడికి నీవు వెళ్లినా వదిలిపెడతానా.... ॥ఏమార॥






ఆమె:

ఏమార మన్నది నేనా
నామీద కోపమేనా
మనసు మారి వెళ్లడమెందుకో
ఎక్కడికి నీవు వెళ్లినా వదిలిపెడతానా ॥ఏమార॥

చేతులే పోయినా ప్రేమ ముక్కలైపోతుందా
ప్రేమనే కోరే మగువ మనసు మారుతుందా
ఈ నాటకం (వేషం) నా దగ్గరెందుకో
ఇది పురుషుల పద్ధతియేనా
మనసు మారి వెళ్లడమెందుకు
ఎక్కడికి నీవు వెళ్లినా వదిలిపెడతానా ॥ఏమార॥

కన్నె నా మనసులో కనిపించేది నీవే కదా
కన్నులు కలిశాక సాక్ష్యం అవసరమా
ఇంకా తెలుసుకోకపోవడం విచిత్రం
ఇక విడిపోదామనుకోవడం ఘోరం
మనసు మారి వెళ్లడమెందుకో
ఎక్కడికి నీవు వెళ్లినా వదిలిపెడతానా ॥ఏమార॥

'నాదీ ఆడజన్మే' చిత్రంలో 'నా మాట నమ్మితివేలా' అనే పల్లవితో మొదలయ్యే రెండు పాటలూ దాశరథి రాశారు. తమిళ గీతాల బాణీలలోనే తెలుగు పాటలూ సాగాయి. సంగీత దర్శకుడు సుదర్శనం ఈ పాటలలో వినిపించిన తాళ వాద్య సంయోజనం అప్పటికి కొత్త. ఇప్పుడు వింటున్నా ఆ కొత్తదనం తరగిపోలేదనిపిస్తుంది.

దాశరథి తమిళగీతాలలోని భావాలనే దాదాపుగా తెలుగు పాటలలోనూ వినిపించినా - కొంత వైవిధ్యాన్ని సాధించారు. 'ఈ తైతై నాట్యాలేల ఈ పైపై కోపాలేల', 'ఈ దాగుడుమూతలు వలదోయ్ నీ నాటకమంతా తెలుసోయ్' వంటి పంక్తులలో తమిళ గీతాలలో లేని సొగసులు చూపించారు దాశరథి.

అయితే నాయిక చెల్లెలి పాటలో 'మదిలోని దేవుడు మారనే మారడు' అనే అభిప్రాయం తమిళ గీతంలో లేదు. ఈ పంక్తి తెలుగు చలన చిత్ర గీతాలు ఎన్నిటి పద్ధతినే పాటించి పతిదైవత్వాన్ని ప్రకటిస్తున్నట్టుంది.

**- పి.ఎస్.గోపాలకృష్ణ**

## దాశరథి 'నాదీ ఆడజన్మే' కోసం ఒకే పల్లవితో రాసిన పాటలు ఇవి:






అతను:

లెఫ్ట్ రైట్ లెఫ్ట్‌రైట్
హాయ్ హాయ్ హాయ్
నా మాట నమ్మితివేలా
నా మీద కోపమదేల
నను వీడి పోవుటమేలా
ఏనాటికీ నిన్ను విడజాల
లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్
లెఫ్టురైట్ లెఫ్టురైట్ అబౌట్ టర్న్ ॥నా మాట॥

కన్నులే సైగతో నన్ను రమ్మన్నవి
అయ్యయ్యో అంతలో వద్దు పొమ్మన్నవే
ఈ తైతై నాట్యాలేల
ఇక పైపై కోపాలేల
నను వీడి పోవుటమేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥

నవ్వులే పువ్వులై నన్ను కవ్వించెనే
ముక్కుపై కోపమే నన్ను మురిపించెనే
నీ మదిలో రగిలే ప్రేమ
ఇక దాచేవెందుకె భామా
నను వీడిపోవుట మేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥






ఆమె:

లెఫ్ట్‌రైట్ లెఫ్ట్‌రైట్ అబౌట్ టర్న్
హాయ్ హై హై హాయ్
నా మాట నమ్మితివేలా
నా మీద కోపమదేల
నన్ను వీడి పోవుటమేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥

చక్కని చుక్కకు ఒక్కడే చంద్రుడు
మదిలోని దేవుడు మారనే మారడు
నా ప్రేమకు సాక్ష్యాలేల
నీ మనసును అడుగవదేల
నను వీడి పోవుట మేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥

చంద్రుడా తారపై అలుకనీకేలరా
తోడువై నీడ వలపు లందించరా
ఈ దాగుడు మూతలు వలదోయ్
నీ నాటకమంతా తెలుసోయ్
నను వీడి పోవుట మేలా
ఏనాటికీ నిన్ను విడజాల ॥నా మాట॥

## కొంటెకొశ్శెన్లు - తుంటరి జవాబులు

**వి.మంజురాణి - హైదరాబాద్.**

ప్ర: లక్ష్మణుడు మూర్ఛపోతే రాముడు సంజీవి పర్వతాన్నే ఎందుకు తెమ్మని హనుమంతుణ్ణి అడిగాడు?

జ: రాముడు, లక్ష్మణుడు సూర్యవంశానికి చెందిన వారు కదా అంచేత 'Son జీవి' పర్వతం అయితే బావుంటుందని.

ప్ర: స్విస్ బ్యాంక్‌లో డబ్బుల్ని దాచుకునే వాళ్లని ఏమనాలి?

జ: బహుమనీ సుల్తానులు

ప్ర: 'హరవిలాసం'లో ఏముంటుంది?

జ: బూడిద (హరవిలాసం అంటే శ్మశానమేగా)




## చిలిపి లిపి




Go వింద Raw Zoo = గోవిందరాజు
Son న్యా Sum = సన్యాసం
Way మన = వేమన
Saw month raw zoo = సామంతరాజు

- మహేంద్రాడ చలం, టెక్కలి.

వీడే - విలన్ - ఐతే - సంతోషం
అబ్బాయిలు అమ్మాయిలు - ఫూల్స్

- పి.యస్.యస్.పవన్‌గణేశ్, సోమేశ్వరం.

ఆమె - దేవత - అతను - రాక్షసుడు

- సోమయాజుల సాయిప్రసాద్, ఒనకడిల్లీ.

## ఈ రూటేవేరు




షెడ్యూళ్ళు = షెడ్‌లు వున్న ఊళ్ళు

- వి.ఆర్.బి, రుద్రారం.

పారవశ్యం = తప్పుకోడానికి పెట్టుకున్న మన పార పరుల వశమై పోవటం.

- చక్రపాణి, చందానగర్.

ఫ్లోరిన్ = నేల లోపల

- వై.ధీరజ్‌కుమార్, నందిగామ.



## పేరు - రిపేరు



## పేరడీ పేరేడ్



ఇదిగో నరలోకం వెలిసే మనకోసం
ఇదిగో నరలోకం వెలిసే మనకోసం
తేలి తేలి భోగాల లీనమై
సఖా నీవు నేను తొలి ప్రణవపు రాగమై
గ్రూపు గ్రూపు రక్తాలను తాగుదాం
తాగి ఘోరకంపు డ్రయినులో దాగుదాం ॥గ్రూపు॥
ఎచట మురికుందో... ఎచట కాల్వుందో
అచట మనముందామా..... ॥ఇదిగో॥
జాలి చూపి పలురకాల తనువులు
మనకు వుంచినాడు ప్రతి ఇంట వేలుపు
ఫలించె కోటి మురిపాలు ముద్దులు
మన పయనానికి లేవు సుమా హద్దులు ॥ఫలి॥
ఎట పరదాలు... ఎపుడు విడివడునో
అచట మనముందామా.... ॥ఇదిగో॥

"వీరాభిమన్యు" చిత్రంలో "అదిగో నవలోకం" పాటకు పేరడీగా...

- తెలికిచెర్ల రామకృష్ణ, విజయనగరం.

## డబుల్ రోల్



ఆ **ముస్లిమ్** అమ్మాయి చూడు ఎంత **స్లిమ్‌**గా ఉందో!
**గున్న** ఏనుగులా**గున్న**వాడికి నీ చొక్కా ఎలా సరిపోతుంది?

- కె.యస్.వి.ఆంజనేయులు, ఉక్కునగరం.

**బడి**కెళ్ళకుంటె **బడి**తె పూజ తప్పదు
**పంది**రి కింద దూరిన ఆ **పంది**ని అవతలికి తోలండి.
**ఒడ**ల పోటీలో **ఒడ**టమా?

- టి.చంద్రశేఖరయ్య, రామసముద్రం.

## చిలిపి కవిత

పెళ్ళాం ఊరికెళితే చాలు
మగాడికి నిలువదు చేయి, కాలు
పేకాడ్డానికి ఎంతో వీలు
మందు పార్టీలకు మరింత వీలు
ప్లే అవుతాయి రకరకాల చిలిపి సీడీలు
దాంతో ఇల్లవుతుందొక సినిమా హాలు
భార్యగారొచ్చాక పక్కింటివాళ్ళు ప్రసారం చేస్తారు ఈ న్యూస్ రీలు
ఇంకేముంది... డెయిలీ సీరియల్లా సంసారంలో డైలీ పోరాటాలు

- తాళాభక్తుల లక్ష్మీప్రసాద్, విశాఖపట్నం.




## షార్ట్‌కట్స్

పాకాల మురళి = పాము
ముంజేటి గిరిజాసరోజ = ముంగిస
తోలేటి డేనియలు = తోడేలు
నత్తుల స్వర్ణక్క = నక్క

- పద్యజా ప్రభాకర్, నందిగామ.

దోరేపల్లి సరోజ = దోస
బీరాల రజని = బీర
వందనాల గణేష్ = వంగ
చేకూరి మణి = చేమ
అన్నవరపు నాగసత్య = అనాస
పల్నాటి నళినీసరోజ = పనాస

- బి. మోక్షానందం, కామవరపు కోట (ప॥గో॥జి॥)





# లతా మంగేష్కర్



ప్రఖ్యాత నేపథ్య గాయకుడు,
బహుభాషా కోవిదుడు, కవి, రచయిత
'కళైమామణి', 'గానకళా సార్వభౌమ' బిరుదాంకితులు
**డా॥ పి.బి.శ్రీనివాస్**
'కోసం' పాఠకుల కోసం
తన అభిమాన గాయని జీవిత చరిత్రను
అక్షరబద్ధం చేస్తున్న సీరియల్ ఇది

ఆరంభ దశలో లత ఎదుర్కొన్న గడ్డు సమస్యలన్నీ సమసిపోయినా, అపార్థాలకీ అప ప్రచారాలకీ గురికాక తప్పలేదు అంతటి మహాగాయకికైనా. కొత్త గాయనీ పరంపరని పైకి రానీయకుండా మహారాష్ట్ర మహారాణులైన సోదరీమణులిద్దరూ చిత్రక్షేత్రాన్ని పంచుకుని ఇతరుల ప్రగతిని అరికట్టే వారనే దుష్ప్రచారం అసూయాపరుల వలన గాలిదుమారంలా చెలరేగేది. నిజానికి ఎట్టి స్పర్ధకైనా భయపడనక్కర్లేని ప్రతిభాపాటవాలు లతకి సహజ ప్రసాదాలుగా లభ్యమయ్యాయి.

మధ్యమధ్య తలలెత్తి త్వరలోనే కనుమరుగైన గాయికలెందరెందరో! దానికి ముఖ్యకారణం లతా, ఆశాల రాజకీయ దుస్తంత్రమేనని పలువురు దూషించేవారు. అంతా కాల ప్రభావ పరిణామమే తప్ప ఎట్టి వ్యక్తుల ఏలాటి దుశ్చర్యలూ కారణాలు కాజాలవనే నా ఉద్దేశ్యం.

లతా ఆశాల మధ్యకూడా చాలాగొప్ప పోటీ చేసుకునేదనీ, ఒకరంటే ఒకరికి పడదనీ, వాళ్లిద్దరి ఫ్లాట్‌లూ కూడా ఎదురెదురుగానే వున్నాయనీ, చాలామంది టీకించేవారు. వృత్తి విషయంలో ఎవరికి ఎవరితోనైనా స్పర్థవుండడం పరిపాటి. కాని వ్యక్తిగతాభిప్రాయాలలో భేదాలెన్నివున్నా, అక్కాచెల్లెళ్లిద్దరూ సహజ ప్రేమగల అక్కాచెల్లెళ్లే. ఒకరిపట్ల ఒకరికి సదభిప్రాయమే!

ముఖ్యంగా కళాసామర్థ్యం విషయంలో ఇద్దరి పాడే పద్ధతులూ వేఱు వేఱు. తమ తమ పద్ధతుల్లో ఇద్దరికిద్దరూ ఉద్ధతులే - గాయకురాళ్ళలో చాలామంది వీరిద్దరిలోనూ, ఎవరినో ఒకరిని అనుకరించి ముందుకొచ్చినవాళ్లే కాని ఎక్కువకాలం నిలువగలిగినవాళ్లు తక్కువ మందే.

ఒకప్పుడు సుధామల్హోత్రా అనే గాయకి బాగానే పాడేది. కాని ఆమె అతి త్వరలో గృహిణీత్వాన్నే వరించింది. అదే విధాన సుమన్ కల్యాణ్‌పుర్‌గా మాఱిన సుమన్ హేమాడీ కూడా కొద్దికాలమే నిలవగలిగింది చిత్రసీమలో. లతా లాగే 90% పాడగలిగే స్తోమత అప్పట్లో ఆమెదే. రఫీతో ఆమె పాడిని 'అజ్ హుస ఆయే బాల్‌మా సావన్ బీతా జాఏ' అనే అద్భుత యుగళ గీతం ఆమెకి గొప్ప పేరే తెచ్చిపెట్టింది.

'కల్యాణవసంతం' రాగచ్ఛాయలలో శంకర్ జైకిషన్‌ల కంపోజిషన్ అయిన ఆ చక్కని మెలొడీ చాలామందినే మెప్పించింది. అలా కొన్నేళ్ళు సాగిన సుమన్ కల్యాణ్‌పుర్ గానం కారణాంతరాల వల్ల క్రమంగా మఱుగున పడింది. ఐదారు దశాబ్దాల నాటిది వారిద్దరి ప్రాభవమూ, వైభవమూ ప్రాబల్యమూ! నాటికీ నేటికీ ఇద్దరి కోటలూ చెక్కు చెదరనివే.

లతా, ఆశల పిదప వచ్చినవారిలో మొదట వాణీజైరాం, 'గుడ్డీ' చిత్రంలో 'బోలేరే పపీహారా' జయాభాదురీకై పాడిన వసంత్ దేశాయ్ ట్యూన్ ఘనవిజయాన్ని సాధించింది. తర్వాత చాలా పాటలే పాడినా హిందీలో అంతటి విజయాన్ని సాధించగలిగే పాటలు రాలేదు ఆమెకి. కాని దక్షిణ చిత్రరంగంలో 'మల్లిగై' అనే పాట చాలా పాప్యులర్ అయ్యేసరికి ఆమె ఎక్కువగా ఇక్కడి గాయనిగా ప్రాబల్యం పొందగలిగింది.

'నాసిక్' అనే స్థలానికి సమీపాన, 'సప్తశృంగిదేవి ఆలయం ఒక కొండపైన వుండడం వల్ల, లతా తన పరివార సభ్యులతో సహా మెట్లెక్కి, అలసటపడినా భక్తి మీఱ, పూజ జరిపి దేవీదర్శనానందం అనుభవించి మఱీ తిరిగి రావడం ఆమె భక్తి శ్రద్ధలకి తార్కాణం. అలా ఒకసారి కొండయెక్కుతూ దారిలో దృశ్యాలకి ఫోటోలు తీసుకుంటూ మిగతా వారికన్నా వెనకపడి అక్కడి కాలువలో కాళ్లు తడుపుకుంటూ, నిలుచున్న సమయాన, తన వెనక వున్న ''ఆడుసింహాన్ని'' గమనించలేనేదట. ఆ సింహాన్ని గమనించిన తమ్ముడు హృదయనాథ్ అక్కా నీ పక్కనే సింహం వుంది. పరిగెత్తి ప్రాణం కాపాడుకో అని అఱచినా, ముందు అదొక పెద్ద కుక్క అనుకున్నా, రెండోసారి అఱుపు విని తిరిగి చూసినపుడు అది నిజంగా సింహనియే అని తెలిసి వచ్చిందిట ఆమెకి. అయినా ఆ వంతయినా భయం కలుగలేదట. మెల్లగా లేచి, నడక సాగించే సరికి, కొన్ని అడుగుల దాకా ఆమె వెంటనే నడిచిన ఆ ఆడు సింహం, సప్తశృంగిదేవి వాహనం అని అనిపించిందట. అందుకే భయపడి పరిగెత్తి పారిపోకుండా, తను మెల్లమెల్లగా నడిచిందట. - దైవం పట్ల చెదరని నమ్మకం గల వారిని, ఎట్టి క్లిష్ట పరిస్థితుల్లోనూ, భయపిశాచం తాకజాలదు అని అనిపిస్తుంది ఈ ఉదంతం వినేవారికి.

**- పి.బి.యస్.**

## 'సున్ సాహెబా సున్, జైన్ నహీ, జైకిషన్'

# లతా - రవీంద్రజైన్



'సంగీతదర్శకుడిగా ఎవరిపేరు కనబడినా సరే, రాజ్‌కపూర్ సినిమాకు సంగీతం సమకూర్చేది రాజ్‌కపూరే!' అంది ఆయన కూతురు ఈ మధ్య. సంగీతదర్శకుడు కావాలనే కోరికతో సినీరంగప్రవేశం చేసానని టీవీలో చెప్పుకున్న రాజ్‌కపూర్ స్వయంగా అనేక వాయిద్యాలు వాయించగలిగేవాడు. శంకర్ జైకిషన్‌లతో కలిసి పనిచేసినప్పుడు ఎన్నో ట్యూన్‌లు కట్టించి, టేప్ చేయించి వుంచుకున్నాడన్నది బహిరంగ రహస్యమయిపోయింది. తను తీద్దామనుకున్న ఎన్నో సినిమాలకు కథ, ట్రీట్‌మెంట్‌లతో సహా రెడీగా పెట్టుకున్న రాజ్‌కపూర్ ఆయా సినిమాలలో ఎక్కడెక్కడ ఏయే పాటలుండాలో ముందుగానే నిర్ణయించుకుని దానికి తగ్గ ట్యూన్‌లు రెడీగా పెట్టుకుని ఉండేవాడు.

లతా ప్రోద్బలంతో శంకర్‌ను నెట్టేసి ఆర్.కే.క్యాంప్‌లోకి వచ్చిన లక్ష్మీకాంత్-ప్యారేలాల్‌లకు ఈ విషయం క్రమంగా బోధపడింది. అప్పటికే రాజ్‌కపూర్ వద్దనున్న శంకర్-జైకిషన్‌ల ట్యూన్‌లను రికార్డు చేయడం తప్ప తాము కొత్తగా చేయవలసినదేమీ లేదని, గొప్పగా చెప్పుకోవడానికి ఏమీ మిగలదనీ అర్థమయ్యాక వారికి ఆసక్తి పోయింది. 'ప్రేమ్‌రోగ్' కి పనిచేశాక లతా నచ్చచెపుతున్నా 'రాజ్‌కపూర్‌కి చేయడం మా వల్లకాదు' అని దణ్ణం పెట్టేశారు వారు.

అప్పుడు ఆర్.కే.క్యాంప్‌లోకి రవీంద్రజైన్ అడుగుపెట్టాడు. రవీంద్రజైన్‌కు కూడా త్వరలోనే అర్థమయింది - రాజ్‌కపూర్ సినిమాలో అతని సంగీతమే తప్ప వేరే సంగీతం వినబడదని! 'హెన్నా' సినిమా పాటలు రికార్డింగు చేసేటప్పటి ముచ్చట. 'చిథియే దర్ద్ ఫిరాఖ్‌వాలియే' పాటకు ట్యూన్‌కట్టి లతాకోసం రవీంద్రజైన్ వెయిట్ చేస్తుండగా మధ్యాహ్నం 12 గంటలకు రాజ్‌కపూర్ రికార్డింగు స్టూడియోలో అడుగుపెట్టాడు. ట్యూన్ విన్నాడు. 'అబ్బే, ఈ ఫారిన్ వాయిద్యాలేమిటి, ఇవన్నీ వద్దు. హీరోయిన్ జిప్సీ అమ్మాయి, పైగా విషాదగీతం. ఫ్లూటూ, చింకారా చాలు.' అంటూ ట్యూన్, ఆర్కెస్ట్రా మొత్తం మార్చిపారేశాడు. 'కంపోజర్' రాజ్‌కపూర్ అప్పటికప్పుడు కట్టిన ట్యూన్‌తో ఆ పాట ఓ ఫోక్‌లోర్ పాటగా రూపు దిద్దుకుంది. తక్కిన పాటలు మాత్రం రవీంద్రజైన్ తనకిష్టమైనట్లే చేయగలిగాడు - ఎందుకంటే రాజ్‌కపూర్ అప్పటికి చనిపోయి రణధీర్ కపూర్ దర్శకత్వ బాధ్యతలు చేపట్టాడు కాబట్టి!

కానీ 'రామ్ తేరీ గంగా మైలీ' సినిమా టైముకి మాత్రం రవీంద్రజైన్‌కి ఈ అదృష్టం పట్టలేదు. అతను పనిచేయడానికి వచ్చేసరికే 'సున్ సాహిబా సున్' పాట రెడీగా ఉంది. రాజ్‌కపూర్ 'అజంతా' అనే సినిమా ప్లాను చేసి నర్గీస్‌పై చిత్రీకరించడానికి హస్రత్ సాహిత్యం, జైకిషన్ ట్యూన్‌తో ఆ పాటను సిద్ధంగా ఉంచుకున్నాడు. రవీంద్రజైన్ చేసిందల్లా రికార్డు చేయడం మాత్రమే! స్వయంగా గీతకారుడు, సంగీతకారుడు అయిన రవీంద్రజైన్ దీనికి నొచ్చుకుని ఉంటే ఆయనకు గుచ్చుకునే సందర్భం ఇంకోటి తయారుగా ఉంది.

'రామ్ తేరీ గంగా మైలీ' సినిమా హిట్ అయింది. ముఖ్యంగా 'సున్ సాహిబా సున్' పాట మరీనూ. తమ 75 సంవత్సరాల చరిత్రలో ఈ పాటే టాప్‌మోస్ట్ సెల్లర్ అని హెచ్.ఎమ్.వి.ప్రకటించింది. మ్యూజిక్ ఇండియా గజల్ ధాటికి ఆగలేక కంపనీ ఆర్థికంగా దెబ్బతిన్న సమయంలో ఈ పాట వారిని రక్షించింది. ఇంత ఖ్యాతి గడించిన పాట తనదేనని చెప్పుకోవాలని ఎవరికైనా ఉంటుంది.

సినిమా విజయోత్సవ సభ హెచ్.ఎమ్.వి.వారు బొంబాయిలోని తాజ్ హోటల్లో నిర్వహించారు. అప్పుడు మాట్లాడుతూ లతా మంగేష్కర్ 'సున్ సాహిబా' పాట జైకిషన్ ట్యూన్ కట్టిందే తప్ప రవీంద్రజైన్ పొడిచేసిందేమీ లేదు, రాజ్‌కపూర్ సినిమాలలో సంగీతం రాజ్‌కపూర్‌దే అనేసింది.

'ఎంత నిజమైతే మాత్రం అది మరీ అంత బహిరంగంగా చెప్పాలా? అంతా రాజ్‌కపూర్‌దే అయితే, మరి ఆ భాగ్యానికి శంకర్‌ని తప్పించి లక్ష్మీ-ప్యాతేలను తెప్పించేవేం? వాళ్లపేర ఉన్న ట్యూన్‌లన్నీ వాళ్లవేనా? లేక శంకర్‌వా, జైకిషన్‌వా, అదీ కాక రాజ్‌కపూర్‌వా?' అని అడగలేని పరిస్థితి రవీంద్రజైన్‌ది. హేమలతా అనే గాయనిని ప్రోత్సహిస్తున్నందుకు లతా తనపై ఇలా కక్ష తీర్చుకుందని ఆత్మీయులతో చెప్పుకుని బాధపడడం తప్ప మరేం చేయలేక పోయాడు పాపం రవీంద్రజైన్!

**- ఎమ్మెస్ స్వాతి**

## లతా గానలహరి

**చిత్రం: రామ్ తేరీ గంగా మైలీ**
**గీతం : హస్రత్ జైపురి**
**సంగీతం : రవీంద్రజైన్**
**గానం: లతా, కోరస్**
**అభినయం : మందాకిని, రాజీవ్‌కపూర్ ఇతరులు**



ఆ: సున్ సాహెబా సున్ ప్యార్ కీ ధున్ (2)
ఓ, మైనే తుఝే చున్ లియా
తూభీ ముఝే చున్ ॥సున్॥
కో: సున్ సాహెబా సున్ ప్యార్ కీ ధున్
ఆ: కోయీ హసీనా కదమ్ పెహలే బఢాతీ నహీఁ
మజ్‌బూరీ దిల్ సే న హోతో పాస్ ఆతీ నహీఁ
ఖుశీ మేరే దిల్‌కో హద్‌సే జ్యాదాహై
తేరే సంగ్ జిందగీ బితానే కా ఇరాదా హై
ఓ, ప్రీత్‌కే యే ధాగే తూభీ సంగ్ మేరే గున్॥సున్॥
కో: సున్ సాహెబా సున్ ప్యార్ కీ ధున్
అ: తు జో హాఁ కహే తో బన్ జాయే బాత్ యే
హోతే న ఇశారా తో చల్ దూఁ మై సాథ్ భీ (2)
తేరేలియే సాహిబా నాచూంగీ మై గావూంగీ
దిల్ మేఁ బసాలే తేరా ఘర్ భీ బసావూంగీ
ఓ, డాల్ దే నిగాహేఁ కర్ దే ప్యార్ కా షగున్ ॥సున్॥
కో: సున్ సాహెబా సున్ ప్యార్ కీ ధున్
అ: మేరా హీ ఖూన్-ఎ-జిగర్‌దేగా గవాహీ మేరీ
తేరే హీ హాథోం లిఖీ షాయద్ తబాహీ మేరీ (2)
దిల్ తుఝ్‌పే వారాహై, జాన్ తుఝ్‌పే వారూంగీ
ఆయీ కే న ఆయీ, తేరా రస్తా నిహారూంగీ
ఓ, కర్ లే కుబూల్ ముఝే హోగా బడా కౌన్॥సున్॥

ఆ పాట ఎంత పాప్యులర్ అయిందంటే ఒకసారి నేను లతాని కలిసినప్పుడు "జాస్‌మిన్ వాలీ గాయికా కైసీహై" (మల్లిగై గాయిక ఎలా వున్నారు?) అని నవ్వుతూ ప్రశ్నించారు. కాని వాణి తమిళ చిత్ర రంగానికి రావడానికి కారణం, బోంబే సిస్టర్లే అనే ప్రచారం చాలాకాలం దాకా సాగింది.

కృష్ణా కల్లే, మినాపురుషోత్తం, సులక్షణా పండిట్ (నాయకీ, గాయకీ) హేమలతా వంటి కొందఱు కొన్ని హిట్ సాంగ్స్ పాడగలిగినా అంతగా విజయం సాధించలేక పోయారు. అంతా దైవిక విధినిర్ణయమే తప్ప మానవ యత్నఫలితం కాదు. లతా ఆశాల సంగీత సామ్రాజ్య సుదీర్ఘ పరిపాలన కూడా దైవసంకల్పమే.

సుషమాశ్రేష్ఠ, మధుబాల ఝవేరీ, జగ్ జీత్‌కౌర్, ముబారకక్ బేగం మున్నగువారి ప్రగతి కూడా అంతంత మాత్రమే. శంకర్, శారదకి మంచి అవకాశాలు కలిగించినా కొన్నాళ్లే వెలిగింది అదీ

# లతా - ఫిలింఫేర్ అవార్డులు



లతామంగేష్కర్ చక్కటి గాయనే కాదు, తన కృషికి తగిన ఫలం ఆశించే శ్రామికురాలు, గుర్తింపు ఎలా తెచ్చుకోవాలో తెలిసిన గడసరి. బొంబాయి ఫిలింరంగంలో 'ఫిలింఫేర్' అవార్డుల కొక విశిష్టస్థానం ఉంది. ప్రజల ఆదరణకు కొలబద్దగా వాటిని పరిగణించేవారు. ఆ అవార్డు లభించాలని మహామహావారే తపించేవారు. 1953లో తొలిసారి ఫిలింఫేరు అవార్డులు నెలకొల్పినపుడు అయిదే అయిదు అవార్డులు - ఉత్తమ చిత్రం, ఉత్తమ దర్శకుడు, ఉత్తమ నటుడు, ఉత్తమ నటి, ఉత్తమ సంగీతదర్శకుడు! 1954 పాటికి సహాయనటుడు, సహాయనటి, కథారచయిత, ఫొటోగ్రాఫర్‌లతో బాటు బెస్ట్ సౌండ్ రికార్డిస్టుకు కూడా బహుమతులు ప్రకటించారు కానీ గాయనీగాయకులు వారికి ఆనలేదు.

లతాకు ఈ పద్ధతి నచ్చలేదు. 1954లో ఫిలింఫేరువారు మొట్టమొదటిసారి బహిరంగంగా పెద్ద సభ ఏర్పాటు చేసి అవార్డుల ఫంక్షన్ నిర్వహించారు. హాలీవుడ్ నుండి గ్రెగరీపెక్‌ను పిలిచారు. నళినీజయవంత్ చేత 'వందేమాతరం' పాడించి, తలత్, గీతారాయ్, రఫీ వంటి వారిచే పాటలు పాడించారు, వైజయంతిమాల నాట్యప్రదర్శన



ఫిలింఫేర్ అవార్డుల ఫంక్షన్‌లో కిశోర్‌కుమార్‌తో కలిసి "అచ్ఛా తో హమ్ చల్‌తే హై..'(ఆన్ మిలో సజ్‌నా) పాట పాడుతున్న లతా

ఏర్పాటు చేశారు. లతాను కూడా వచ్చి పాడమని నిర్వాహకులు అడిగితే గాయకులను నిర్లక్ష్యం చేస్తున్నందుకు నిరసనగా పాడడానికి నిరాకరిస్తున్నానని ఆమె చెప్పింది. అలా చెప్పడానికెంతో సాహసం కావాలి. ఎందుకంటే 'ఫిలింఫేర్' బహుళప్రాచుర్యం గల సినిమా పత్రిక. పైగా 'టైమ్స్ ఆఫ్ ఇండియా' గ్రూప్‌కి చెందిన పత్రిక. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ పత్రికారంగాలలో టైమ్స్ గ్రూప్ రాజ్యం ఏలుతున్న రోజులవి. వారు పగబడితే కళాకారుల భవిష్యత్తు అంధకారమే! అయినా లతా బెదరలేదు.

ఫిలింఫేర్ వారు తమ పద్ధతి మార్చుకోవడానికి ఇంకో నాలుగేళ్లు పట్టింది. 1958లో బెస్ట్ ప్లేబ్యాక్ సింగర్ అవార్డు పెట్టారు. గాయకుడికో, గాయనికో ఎవరికో ఒకరికే ఇస్తామన్నారు. ఇంకో తొమ్మిదేళ్లు పోయాక అంటే 1967కి ఇద్దరికీ విడివిడి అవార్డులు ప్రకటించారు. అప్పటినుండీ అదే పద్ధతి కొనసాగుతోంది. 1958లో అవార్డు పెట్టగానే తొలి బహుమతి లతాకే - 'మధుమతి' సినిమాలో 'ఆజారే పర్‌దేశి' పాటకై! 1959లో ముకేశ్ (అనాడీ), 1960లో రఫీ (చౌదవీ కా చాంద్), లతా (బీస్ సాల్‌బాద్- 'కహీ దీప్ జలే కహీ దిల్') పంచుకున్నారు. 1961లో రఫీ (ససురాల్), 1963లో మహేంద్రకపూర్ (గుమ్రా), 1964లో రఫీ (దోస్తీ), 1965లో లతా (ఖాన్‌దాన్- 'తుమ్హీ మేరే మందిర్'), 1966లో రఫీ (సూరజ్) 1967 లో గాయకుడి అవార్డు మహేంద్రకపూర్ (హమ్‌రాజ్), గాయనిగా ఆశాభోంస్లే(దస్ లాఖ్), 1968లో రఫీ (బ్రహ్మచారి), ఆశా (షికార్), 1969లో కిశోర్ (ఆరాధనా), లతా (జీనే కి రాహ్- 'ఆప్ ముఝే అచ్ఛే లగ్‌నే లగే') - ఇలా అవార్డులు గెలుచుకున్నారు. 1970నుండి తాను పోటీలోనుండి తప్పుకుంటున్నట్టు ఓ ప్రకటన ఇచ్చి లతా తప్పుకుంది. దీని వెనుక ఓ ఆసక్తిదాయకమైన కథ వుంది -

సంగీతదర్శకుడు శంకర్‌కి ఫిలింఫేర్ అవార్డులను ప్రభావితం చేయగలిగే శక్తి ఉందన్న నమ్మకం బాలీవుడ్‌లో బాగా వ్యాపించివుంది.1966లో 'గైడ్' (బర్మన్ సంగీతం) సినిమాను కాదని 'సూరజ్' (శంకర్-జైకిషన్) కి అవార్డు ఇచ్చినప్పుడే ఫిలింఫేర్ విమర్శలకు గురయింది. శారదా అనే గాయనిని పరిచయం చేసిన శంకర్ ఆమెను లతాకు ప్రతిగా నిలబెట్టడానికి ప్రయత్నం చేస్తున్న రోజులవి. ఆర్.కె.ఫిలింస్‌నుండి తనను తొలగించినందుకు లతాపై కోపం కొద్దీ శంకర్ ఆ కోపాన్ని ఫిలింఫేర్ అవార్డు ద్వారా తీర్చుకోదలచాడు. 1970లో విడుదలయిన 'జహా ప్యార్ మిలే' సినిమాలో 'బాత్ జరా హై ఆపస్ కీ సారీ దునియా హో గయీ మేరీ' అనే పాట పాడినందుకు శారదాకు అవార్డు ఇవ్వాలని శంకర్ పట్టుదల. నిజానికి ఆ పాట ఇప్పుడు ఎవరికీ గుర్తులేదు కూడా. అదే సినిమాలో లతా పాడిన 'నస్ నస్ మే అగన్ టూటే హై బదన్' ఇప్పటికీ పాప్యులరే! కానీ శంకర్ తన ఇన్‌ఫ్లుయెన్స్ ఉపయోగించి లతాను తప్పించి, శారదాకు ఇవ్వడానికి రంగం సిద్ధం చేసుకున్నాడు.

ఈ విషయాన్ని పసిగట్టిన లతా బ్రహ్మాండమైన యుక్తి పన్నింది. శారదావంటి అర్భకురాలి చేతిలో ఓటమి కన్నా అసలు పోటీలోనే లేకుండా ఉంటే మంచిది కదా అనుకుని హుందాగా 'కొత్తగాయనీమణులకు అవకాశం ఇవ్వడానికి రంగంలోనుండి తప్పుకుంటున్నాను' అని చెప్పి మర్యాద కాపాడుకుంది.

అయితే శంకర్ ఆటలు ఎక్కువకాలం సాగలేదు. 1972లో ఫిలింఫేర్ 'పాకీజా' వంటి ఉత్తమసంగీతాన్ని కాదని 'బే ఇమాన్' సాధారణ సంగీతానికి బెస్ట్ మ్యూజిక్ అవార్డు ఇవ్వడంతో పెద్ద వివాదం చెలరేగింది. 'బే ఇమాన్'కు శంకర్-జైకిషన్ పేరు సంగీతం సమకూర్చిన శంకర్ పన్నాగమే ఇది అని ఆరోపిస్తూ ప్రాణ్ సంతకాల సేకరణకు దిగడమే కాక 'బేఇమాన్'లో ఉత్తమ సహాయ నటుడుగా తనకు వచ్చిన అవార్డు తీసుకోవడానికి నిరాకరించాడు. దాంతో శంకర్-జైకిషన్ మళ్లీ ఎన్నడూ ఫిలింఫేర్ అవార్డుకి నోచుకోలేదు. కాగా 1994లో ఫిలింఫేర్ పత్రిక లైఫ్‌టైమ్ అచీవ్‌మెంటు అవార్డుతో లతాను సత్కరించింది.

**- ఎమ్బీయస్ ప్రసాద్**

### 'ఐ మేరే వతన్ కే లోగో' నుండి

# ఆశా నెట్టివేయబడిందా?



గత సంచికలో 'లతా కాంప్లెక్స్‌తో బాధపడిన ఆశా' వ్యాసంలో 'ఐ మేరే వతన్ కే లోగో' లతా, ఆశా ఇద్దరూ పాడాలని ముందు వేసిన ప్లాను లతా కారణంగా సోలోగా మారిందట!' అని రాశారు. నాకు తెలిసినంతవరకు ఆ పాట విషయంలో ఆశాకే కాదు, సి.రామచంద్రకు కూడా అన్యాయం జరిగింది!

1976లో ఎమర్జన్సీ కాలంలో బొంబాయిలోని బ్రేబర్న్ స్టేడియంలో మ్యూజికల్ నైట్ జరిగింది. దానికి కాంగ్రెసు అభిమాని, లతా వీరాభిమాని అయిన దిలీప్‌కుమార్ కంపియర్‌గా ఉన్నాడు. 'ఐ మేరే వతన్‌కి లోగో' పాట పాడి నెహ్రూకు కన్నీళ్లు తెప్పించిన లతా గురించి, పాట రాసిన ప్రదీప్ గురించి తెగ మాట్లాడాడు కానీ సంగీతాన్ని అందించిన రామచంద్ర గురించి ఒక్క పలుకైనా పలుకలేదు. దానితో సభలో కూచున్న రామచంద్రకు ఒళ్లు మండింది.

పాట గురించి ఎనౌన్స్ చేసి వేదిక దిగి వస్తున్న దిలీప్‌కు అడ్డంగా వెళ్లి "యూసుఫ్!(దిలీప్ అసలు పేరు) ఆ పాట కంపోజ్ చేసినది నేనని నీకు తెలియదా?" అని అరిచాడు.

"అలాగా, నాకు తెలియదే!" అన్నాడు దిలీప్ ఆశ్చర్యం అభినయిస్తూ.

"నువ్వు గొప్పనటుడివే కానీ దాన్ని తెరమీదకే పరిమితం చేసుకో, ఆ పాటకు నేను సంగీతం సమకూర్చానన్న సంగతి చెప్పవద్దని నీకెవరు చెప్పారో నాకూ తెలుసు, నీకూ తెలుసు" అన్నాడు రామచంద్ర కోపంగా.

"దిలీప్‌కుమార్‌కు ఆదేశాలిచ్చేవాళ్లు ఇప్పటిదాకా పుట్టలేదు" అన్నాడు దిలీప్ గంభీరంగా!

"ఆ లేడీకి ఒకప్పుడు సి రామచంద్ర ఆదేశాలు ఇచ్చేవాడు. ఇప్పుడామె దిలీప్‌కుమార్‌కు కూడా ఆదేశాలిచ్చేటంతగా ఎదిగిపోయింది." అన్నాడు రామచంద్ర వెక్కిరింతగా.

రామచంద్ర,లతల వైమనస్యం అప్పటికే అందరికే తెలుసు. కానీ అంత గొప్పపాట విషయంలో తన పాత్ర ప్రస్తావనకు కూడా రానంత నేరం ఏంచేశాడు రామచంద్ర?

అనలు తను ఒరిజినల్‌గా ఆ పాటను డ్యూయెట్‌గానే రూపొందించానని, రసజ్ఞులు ఈ విషయాన్ని సులభంగా గుర్తించగలరని రామచంద్ర ఓ ఇంటర్వ్యూలో చెప్పాడు. "ఆశాభోంస్లే 'ఐ మేరే వతన్ కే లోగో' అని పాడాలి. అప్పుడు 'జరా ఆంఖోం మే భర్‌లో పానీ' అని లతా అందుకోవాలి. కానీ పాట ఫైనల్ అయి వచ్చేసరికి తనకే సోలోగా కావాలని లతా పట్టుబట్టింది. పాపం ఆశా దిగులుపడింది. నేను ఆశాకు చెప్తూ వచ్చాను. 'నీకు ఢిల్లీ టిక్కెట్టు నా దగ్గర రెడీగా ఉంది. మనం వెళ్లి నెహ్రూ గారి వద్ద పాట వినిపిద్దాం. తర్వాత ఢిల్లీ బహిరంగసభలో నువ్వూ,లతా పాడుదురు గాని.' అని. 'అంతా వట్టిదే, లతాదీదీ నన్ను పాడనివ్వదు చూడు' అనేది ఆశా. చివరికి ఆశా మాటే నిజమైంది. విమానం ఎక్కబోతూ నేను ఫోన్ చేసి ఆశాకు చెప్పాను - 'నీ టిక్కెట్టు కాన్సిల్ చేయించింది మీ అక్కే, నేను కాదు' అని. తను అర్థం చేసుకుంది."

మరి పత్రికాముఖంగా ఇటువంటి స్టేటుమెంట్స్ ఇచ్చినవాడిని లతా ఎలా క్షమించగలదు?

**- సి.ఎస్.ఎన్.మూర్తి**

"తిత్‌లీ ఉడీ" అనే పాట వలన!

ఉదాత్తమైన గీతాలకీ లతా, ఉత్తేజకరమైన గీతాలకి "ఆశా" ఇద్దరూ స్థిరపడిపోయిన గాయికలు. వారితో పోటీ పడగల వాళ్లు తక్కువ. పోటీ పడినా నిలవగలిగినవాళ్లు మఱీ తక్కువ. కొంతమంది సంగీత దర్శకులు ఇతరుల చేత కొన్ని పాటలు పాడించడానికి సాహసించినా లతా ఆశాల 'కినుక'కి గుఱి అవవలసివస్తుందేమో అని భయపడుతూనే వుండేవారట.

తూర్పు పాకిస్తాన్ నుండి సడెన్‌గా వచ్చి సడెన్‌గా పాప్యులరై సడెన్‌గా వెళ్లిపోయిన రూనాలైలా అనే గాయని 'టి.వి. ఆర్టిస్టు' అవడం వల్ల చిత్రాల ద్వారానూ సంగీత సభల ద్వారాను కొన్నాళ్లు గొప్ప సెన్సేషన్ క్రియేట్ చెయ్యగలిగిన సింగరే. కాని ఆమె ప్రభావం కూడా త్వరలోనే సన్నగిల్లిపోయింది.

ఆనాటి మర్ఫీ కాంటెస్ట్ జరిగినప్పుడు, ఇద్దరు గాయనీమణులు ఎన్నికైనారు. ఒకామె ఆరతీ ముఖర్జీ, ఇంకొకామె ఈనాటి టాప్ లేడీ సింగర్ ఎస్.జానకి. ఆరతికి అప్పుడు చాలా తక్కువగానే అవకాశాలు వచ్చాయి. జానకికి అప్పట్లో మంచి అవకాశాలు రాకపోయినా తదుపరి 'నండు' అనే తమిళ చిత్రానికి ఆమె పాడిన డాన్సు సాంగూ, భూపేంద్రతో పాడిన యుగళ గీతం 'కైసే కహూఁ కుఛ్ కహ న సకూఁ' (ఇళైయరాజా ట్యూనుకి నేను రాసిన లిరిక్సు) విని అత్యంత ప్రభావితులై ప్రశంసించిన 'బప్పీలహరి' చాలా చిత్రాలలో అవకాశం కలిగించారు. చిన్నప్పటి నుండీ లత గొంతే తనకు గురువు అని జానకి ఉవాచం.

జానికి ఉచ్చారణనీ బాణీనీ ఉత్తరాది గీత రచయితలూ, సంగీత దర్శకులు కూడా చాలా మెచ్చుకున్నారు. కాని ఆమె దక్షిణాది చిత్రాలకి అధికంగా అంకితం అవడంతో ఇక్కడ చాలా బిజీగా వుండడంవల్ల తఱుచూ బొంబాయి వెళ్లడం వీలుపడలేదు.

అంతలో అల్‌కా యాగ్నిక్, కవితా కృష్ణమూర్తి, పాడిన కొన్ని పాటలు విశిష్ట ప్రజాదరణ పొందడం వల్ల బొంబాయిలోనే వుండడం వల్ల అధికావశాలు పొందగలిగారు. చాలా అవార్డులు కూడా గడించారు. కవితా కృష్ణమూర్తి అకస్మాత్తుగా అంతర్జాతీయ ఖ్యాతినార్జించిన వాయిలీన విద్వాంసుడు 'ఎల్. సుబ్రహ్మణ్యం' గారికి పత్ని అవడాన్ని అభిలషించి, ఆయనతోబాటే మ్యూజికల్ కాన్‌సర్‌టేట్‌లో బిజీ అయిపోయారు. ఎవరుగానీ ముందుకి వచ్చి వెనక్కి వెళ్లడమో లేదా నిలదొక్కుకుని పరిపాలన సాగించడమో దైవలీల అనేది అక్షరసత్యం.

అంతర్జాతీయ ఖ్యాతి నార్జించిన సితార్ మేధావి పండిట్ రవిశంకర్ సంగీతంతో విలసిల్లి హేమామాలిని వంటి టాప్ హీరోయిన్స్ నటించిన 'మీరా' లో వాణీజయరాంకి వచ్చిన సదవకాశం కూడా అంతగా లాభించలేదు. ఆ చిత్రం ఎక్కువ విజయాన్ని సాధించలేకపోవడం కూడా ఒక కారణం. ఈ సంఘటనలన్నీ పరిశీలిస్తే కాలం అనుకూలిస్తే గాని ఎవరూ ఏమీ సాధించలేరనే నిజం ఋజువౌతూనే వుంది. అనాది కాలం నుండీ ఈ కాలం ఎప్పుడెవరికి ఎలా ఎంతకాలం అనుకూలించి, సహకరిస్తోందో వూహించడం కూడా అసాధ్యం. ఏది ఏమైనా

లతా, ఆశాల రాణీత్వం కొనసాగుతూనే వుంది. నిరాఘాటంగా కొన్ని దశాబ్దాలుగా అందుకు వారిద్దరూ అభినందనీయులే.

నిజానికి, ఎన్నడూ ఎవ్వరూ ఎవ్వరికీ పోటీకారు. ఎవరి ప్రజాపాటవాలూ అదృష్టాలు వారివే. ఒకరితో మరొకరిని పోల్చి రిమార్కులు పాస్ చెయ్యడం సాధారణ మానవుల దౌర్బల్యం. ఎవరి అభిరుచులు వారివే.

అన్ని విషయాలలోనూ, కాలానిదే పైచెయ్యి. ఎవర్ని ఎత్తినా ఎవర్ని దించినా ఎవరూ ఏమీ చెయ్యలేని శక్తి కాలానిదే. కాలానికి ఎదురీత మహామహులకైనా అసంభవం. లతకి సాటి లతయే. ఆశాకి సాటి ఆశాయే. ఇద్దరిలోనూ ప్రత్యేకాధిక్యాలు వున్నాయి. అయినా అక్క చెల్లెలికి సదా మాన్యురాలే. "కళాసరస్వతి" వదనంలో లతా ఆశాలిద్దరూ, నయనకమల ద్వయం అనడం అతిశయోక్తి కాదు. అభిమానుల దృష్టిలో ఇద్దరి సృష్టి సమానపరిపుష్టి గలదే. ఇద్దరూ కురిపిస్తూనే వుంటారు, సుమధుర విశిష్ట గాన సుధావృష్టి - మొత్తానికి సంగీత కళారసజ్ఞ లోకానికి మహాగాయక నటుడు దీనానాథ్ మంగేష్కర్ అందించిన మహోత్తమ వరాలు ఈ అక్కచెల్లెళ్ల సమానాసమాన కంఠస్వరాలు. ఇద్దరూ సెప్టెంబర్ శుభమాస సంజాతలే. ఇద్దరూ వాడిపోని పారిజాతాలే.

ఈనాడు లత గొప్ప ఐశ్వర్యవంతురాలు. నిరంతర కృషిఫలితంగా ఆమె సంపాదించిన ధననిధులన్నీ స్వశక్తివలననే. ఆమెలోగల ఔదార్యం చాలామంది ఎఱుగరు. ఆమె చేసినవి ఎన్నో గుప్తదానాలు. కుడిచెయ్యి ఇచ్చిన దానం ఎడమ చేతికి కూడా తెలియనీయదామె. ఆమె మహితౌదార్యానికి ఇటీవల ఆమె కోట్ల ఖర్చుతో కట్టించిన హాస్పిటల్ ఒక సజీవ ఉదాహరణ. భగవంతుడి సృష్టిలో బాధపడే దీనుల పట్ల ఆమెకు గల దయ అనిర్వచనీయం. కెనడాలోని టొరాంటోలో ఆమె యిచ్చిన ఒక సంగీత కచ్చేరిలో అతిత్వరలోనే తను మరణించబోతున్నట్లుగా తెలిసీకూడా ఆరేళ్ళ చిన్నారి 'సరావ్హైటింగ్' తన పెదవుల నుండి చిఱునవ్వునేమాత్రం దూరం చేసుకోకుండా ధైర్యంగా జీవిస్తున్న వైనం లతని దిగ్భ్రాంతురాలినిగా చేసింది. తనకి 'పూలగుచ్ఛం' ఇవ్వడానికి స్టేజిమీదకి వచ్చిన ఆ అమ్మాయిని తన బాహువులలో ఇముడ్చుకుని "ఈ ధైర్యవంతురాలైన పిల్ల, పెద్దలకి కూడా పాఠం నేర్పగల సాహస సహృదయ, మరణం సమీపించినా నవ్వుతూ ఎలా బ్రతకాలో చేసి చూపిస్తున్న వింత బాలిక" అంటూ కంటతడిపెట్టి వాపోవడం లత దయార్ద్రతని వేనోళ్ళ చాటగలిగిన కరుణా సన్నివేశం.

**(ఇంకావుంది)**

---

# హిందీ సినీ సంగీతంలో మలుపులూ-మజిలీలు

## 1960



**దిల్ అపనా ఔర్ ప్రీత్ పరాయీ లో ఓ సన్నివేశం**

శంకర్-జైకిషన్ తమ హవాను 'దిల్ అప్‌నా ఔర్ ప్రీత్ పరాయీ, జిస్ దేశ్ మేఁ గంగా బహతీ హై' తో కొనసాగించారు. దిల్ అప్‌నా ఔర్ ప్రీత్ పరాయీ చిత్రంలోని అజీబ్ దాస్తాన్ హై యే, షీషాయే దిల్ ఇత్‌నా న, అందాజ్ మేరా మస్తానా, మేరా దిల్ అబ్ తేరా ఓ సాజనా, దిల్ అప్‌నా ఔర్ ప్రీత్ పరాయీ' ఎవర్ గ్రీన్ లతా హిట్స్ గా నిలిచాయి.

రాజ్ కపూర్ చే నిర్మితమైన 'జిస్ దేశ్ మేఁ గంగా బహతీ హై' మ్యూజికల్‌గా సూపర్ హిట్ అయింది. బందిపోట్ల కు సంబంధించిన కథాంశంతో నిర్మితమైన ఈ చిత్రాన్ని మొదట్లో పాటలు లేకుండా నిర్మించాలని రాజ్ కపూర్ అనుకున్న ప్పటికీ డిస్ట్రిబ్యూటర్ల ఒత్తిడి మేరకు పాటలు పెట్టడం, శంకర్-జైకిషన్‌లు రంగంలోకి వచ్చి అజరామరమైన గీతాల్లను అందించడం జరిగింది.



**'జిస్ దేశ్ మేఁ గంగా బహతీ హై'లో పద్మిని**

మేరా నామ్ రాజు, హోఠం పే సచ్చాయి రెహతీ హై, ఓ బసంతీ, హై ఆగ్ హమారే సీనే మేఁ, ఆ అబ్ లౌట్ చలేఁ పాటలు ఎవరు మరిచిపోగలరు? 1999లో ఆర్.కె.ఫిలిమ్స్ గోల్డెన్ జూబ్లీ సందర్భంగా రిషీకపూర్ హీరోగా నిర్మించిన చిత్రానికి 'ఆ అబ్ లౌట్ చలేఁ' టైటిల్ కావటం విశేషం.

'ఏక్ ఫూల్ చార్ కాంటే' చిత్రంలోని 'మత్ వాలీ నార్ ఠుముక్-ఠుముక్ చలీ జాయే' పాట ముఖేష్ కు మంచిపేరు తీసుకువచ్చింది. ముఖేష్-లతా హిట్ 'ఆంఖో మేఁ రంగ్ క్యూఁ' ఈ చిత్రంలోనిదే.

శంకర్-జై కిషన్‌లు తొలిసారిగా శైలేంద్ర, హస్రత్ జైపురి కాక వేరే రచయితతో పనిచేయడం తెలుగు దర్శకుడు తాతినేని ప్రకాశరావు తీసిన 'కాలేజ్ గర్ల్' చిత్రంతో జరిగింది. దక్షిణాది నిర్మాతలకు అభిమాన రచయితయిన రాజేంద్ర కృష్ణ అన్ని పాటలూ రాసిన ఈ చిత్రంలో రఫీ-లతా గానం చేసిన 'హమ్ ఔర్ తుమ్', 'పహలా పహలా ప్యార్ కా ఇషారా' గీతాలు హిట్ గా నిలిచాయి. అయితే శంకర్-జైకిషన్‌లు తమ రెగ్యులర్ రచయితలు కాకుండా ఇతరులతో చేయడం కూడా ఇదే చివరిసారి అయింది.

'సింగపూర్' చిత్రంలో ముఖేష్ 'యహ్ శహర్ బడా అల్బేలా' పాడితే రఫీ-లతా 'తుమ్ లాఖ్ ఛుపానా చాహోగే' గీతాన్ని పాడారు. శం-జై లు షమ్మీకపూర్‌కు రఫీ వాయిస్ వాడటానికి అంగీకరించింది మొదటిగా 'కాలేజ్ గర్ల్, సింగపూర్' చిత్రాలకే!

ఇప్పుడు నటీనటులెవరైనా పాటలను పాడితే అది పబ్లిసిటీ జిమ్మిక్కుగా కొట్టి పారేస్తాం. అయితే 'ఛబిలి'చిత్రంలోని ఏడు పాటలకు గానూ ఆరు పాటలకు నూతన్ తన గళాన్ని వ్వటం విశేషంగా చెప్పుకోవాలి. పాటలతో పెద్దగా పరిచయం లేని నూతన్ గాత్రాన్ని దృష్టిలో పెట్టుకుని స్నేహల్ భాట్‌కర్ చక్కటి సంగీతాన్నందించారు. 'యేమేరే హమ్ సఫర్ లే రోక్ అపనీ నజర్' నూతన్ కు మంచిపేరు తీసుకువచ్చింది.



**నూతన్**

సలీల్ చౌధురి ఈ సంవత్సరం ఉస్నేకహాథా, పరఖ్ అనే రెండు బిమల్ రాయ్ చిత్రాలకు సంగీతాన్నందించారు.'ఉస్నే కహా థా'లో 'ఆహా రిమ్ జిమ్ కే యే ప్యారే ప్యారే గీత్ లియే' లతా-తలత్ ల హిట్ గా నిలువగా, 'పరఖ్' చిత్రంలోని 'ఓ సజనా బర్‌ఖా బహార్ ఆయీ', 'మిలా హై కిసీకో ఝుమ్‌కా' పాటలు సూపర్ హిట్ అయ్యాయి.



**సలీల్ చౌధురి**

-వచ్చే సంచికలో మరికొంత

# సరిగపదమని

**కూర్పు : టి.నవీన్**

**7**

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | 2 | | ● | ● | 3 | | 4 |
| | ● | | ● | 5 | ● | | ● | |
| | ● | ● | 6 | | | | ● | |
| 7 | 8 | | ● | | ● | 9 | | ● |
| ● | | ● | 10 | | ● | | ● | 11 |
| 12 | ● | 13 | ● | 14 | | ● | 15 | |
| | ● | 16 | | ● | ● | 17 | ● | |
| 18 | | ● | ● | 19 | ● | 20 | 21 | ● |
| | ● | 22 | | | ● | 23 | | |

పంపినవారి పేరు : ______________________

వయసు : ______ వృత్తి : ______________

చిరునామా : ______________________

______________________

______________________

______________ ఫోన్ : ______________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పైన ప్రచురించిన కూపన్‌తో పజిల్‌ను నింపి కవరులో పంపాలి. మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'సరిగపదమని' అంటూ నంబర్‌తోసహా పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే డ్రా తీయటం జరుగుతుంది.

విజేతల ఎంపిక ప్రతిసారి ఓ సినీ ప్రముఖునిచే...



**ఆధారాలు:**

**అడ్డం:**

1. .................... చినుకులు పడుతూ వుంటే (4)
3. 'అలనాటి రామచంద్రునికన్నింటా సాటి' అంటూ మణిశర్మ స్వరపరిచిన గీతం ఈ చిత్రంలోనిదే (3)
6. 'నీ జీనూ పాంటూ చూసి బుల్లెమ్మో....' అంటూ యస్వీ కృష్ణారెడ్డి స్వరపరిచిన గీతం గల చిత్రం (4)
7. నా మనసు కేమయింది నీ ............. పడింది - సిరివెన్నెల గీతం (2)
9. 'చిలక పచ్చకోక పెట్టినాది .........' బాలకృష్ణ అభినయించిన పాట (2)
10. సాహసం.......గా సాగిపో సోదరా అనగలిగే దమ్మున్నవాడు 'ఒక్కడు' మాత్రమే కదా....!?(2)
14. ఓ......కొమ్మల్నడిగానే ప్రతి రెమ్మని వెతికానే కనిపించవే కాస్తైనా.... (2)
15. ఘల్లుఘల్లుమని సిరిమువ్వల్లే చినుకే చేరగా.... అంటూ బాలు, మల్లికార్జున్ పాడిన చిత్రం (2)
16. రావయ్య ముద్దుల ........ నీకు రాసిస్తా రాయలసీమ (2)
18. '.......... ......... దామ్మా కులికే కుందనాల బొమ్మ' చిరంజీవి అభినయించిన పాట (2)
20. ......లో అవి విరులో అక్కినేనికి జేసుదాసు పాడిన పాట (2)
22. '........ చిరుగాలి చల్లగా ఎద గిల్లీ' (3)
23. 'డిరిడిరి.......వారెవా' నాగార్జున 'సంతోషం'గా అభినయించిన గీతం(3)

**నిలువు:**

1. చెప్పవే ప్రేమాచెలిమి ................ (4)
2. ఆడుతు పాడుతు ........ చేస్తూ వుంటే అలుపూ సొలుపేమున్నది (2)
3. 'మూసిన ............ మొరగులు' అన్నమయ్య గీతం (5)
4. .......... ఎగిరే గువ్వా నీపరుగులు ఎక్కడికమ్మా 'జానకి వెడ్స్ శ్రీరామ్'లో 'తూనీగా తూనీగా టైపుసాంగ్ (3)
5. ..................... వలలో పడెనే పాపం పసివాడు (5)
8. 'యమహో నీ ....... ............ అందం' అతిలోకసుందరితో జగదేకవీరుడు అన్నమాటిది (3)
11. చెన్నై ........ మనసే చేజారి (3)
12. ................ ఒసి............... ఆశ పెట్టేసి పోమాకే కుర్రదానా (4)
13. కాశీకి పోయాను .........హరీ (2)
17. 'కారులో షికారుకెళ్ళే పాలబుగ్గల .......... చానా (3)
19. వెల్లువలే ...... మరి నా సోకుగని, రానంటే ఎట్టామరి.. పరువాల పంచాక్షరి (2)
21. యమహో..... కలకత్తాపురి (2)

**పజిల్, కూపన్ 30-11-2003 లోగా చేరాలి**

**పంపవలసిన అడ్రసు**

'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

మొదటి బహుమతి(ఆల్ కరెక్ట్)



34 పాటలు గల
డబుల్ ప్యాక్ ఆడియో సి.డి.

రెండవ బహుమతి (ఒక తప్పుతో)




18 పాటలు గల
సింగిల్ ప్యాక్ ఆడియో సి.డి.

మూడవ బహుమతి



29 పాటలు గల
డబుల్‌ప్యాక్ ఆడియోక్యాసెట్

కన్సొలేషన్ బహుమతి



20 పాటలు గల
సింగిల్‌ప్యాక్ ఆడియో క్యాసెట్

# సరిగపదమని ఫలితాలు 4

## డ్రాలో గెలుపొందిన వారు

| | |
|---|---|
| ఆల్ కరెక్ట్ | : నందిరాజు శ్రీవాణి, హైదరాబాద్ |
| ఒక తప్పుతో | : ఎ.సరోజినీదేవి, రాజమండ్రి |
| రెండు తప్పులతో | : సౌమిత్రి రమణాచార్య, హైదరాబాద్ |
| మూడు తప్పులతో | : అవధానం లక్ష్మీమోహన్, తిరుపతి |









మీరు నిర్వహించిన 'సరిగపదమని-4' పోటీలో పాల్గొన్న నాకు ప్రథమ బహుమతి ప్రకటించినందుకు సంతోషం. బెంగుళూరులో ఉన్న నాకు మీరే స్వయంగా అభినందనలు తెలియజేయడం మరీ సంతోషం కలిగించినది. మీ అభిమానమునకు కృతజ్ఞతలు.

"హాసం - చదువరుల మదిని విరబూయు దరహాసం
ఇంటిల్లిపాదినే అలరించు శీర్షికల సమాహారం"

అని ఈ సందర్భంగా మీకు తెలియజేయుటకు మిక్కిలి ఆనందదాయకముగనున్నది. మీ పత్రిక కలకాలం ఇటులనే చదువరుల మది రంజింపజేయగలదని ఆకాంక్షిస్తూ...

**- నందిరాజు శ్రీవాణి, హైదరాబాద్**



'హాసం' పత్రిక నుంచి ఫోను రాగానే చాలా ఆనందమనిపించింది. డ్రాలో నా పేరు వచ్చినందుకు మరింత ఆశ్చర్యం కలిగింది. 'హాసం' పత్రిక అటు హాస్యానికి యిటు సంగీత సాహిత్యములకు నిలయమై నిలిచింది. పాత హిందీ తెలుగు సినిమా పాటల పరిచయము మా చిన్ననాటి రోజులు జ్ఞప్తికి తెచ్చి మనసును మరింత ఆనంద పరుస్తున్నాయి. మిక్కిలి అరుదైన విషయాలతో కూడిన 'హాసం' పత్రిక అందరి మనసులను అలరిస్తోంది.

**- ఎ. సరోజినీదేవి, రాజమండ్రి**



సమయము దొరికినప్పుడల్లా 'హాసం' పత్రిక చదివి ఆనందింటం నా అలవాటు. ఈ పజిల్‌లో నేను 'విన్నర్'నవుతానని కలలో కూడా అనుకోలేదు. ఫోను రాగానే చాలా సంతోషం పొందాను. మీరు పాఠకులకిస్తున్న ప్రోత్సాహం అనిర్వచనీయం. మీరిలాగే కలకాలం పాఠకుల హృదయాలలో "హాస్యం, హాసం" వెదజల్లాలని కోరుకుంటున్నాను.

**- శ్రీ సౌమిత్రి రమణాచార్య, అర్చకులు, శ్రీ వీరాంజనేయస్వామి దేవస్థానం, మౌలాలి, హైదరాబాద్.**



'హాసం' హాస్య, సంగీత పత్రికలో నిర్వహిస్తున్న 'సరిగపదమని-4' పజిల్ డ్రాలో గాయని ఉష నన్ను విజేతగా ఎంపిక చేసినారని ఎడిటర్ రాజాగారు స్వయంగా మా ఇంటికి ఫోన్‌చేసి చెప్పటం నా జీవితంలో మరపురాని అనుభూతి, చాలా సంతోషపడ్డాను. నా ఆనందం పంచుకునేందుకు మా అబ్బాయిలందరు దూరంగా ఉన్నారు. వాళ్ళందరికి ఫోన్‌లు చేసి చెప్పాను. ఈ రోజుల్లో మధుర సంగీతానికి పెద్దపీట వేస్తూ, మరచిపోతున్న పాతకాలపు పాటలను మళ్ళీ ప్రజల మధ్యకు తెస్తున్న శ్రీ రాజాగారు అభినందనీయులు. ఆయన రాసిన 'మల్లాది వెంకటకృష్ణమూర్తి' నవల కొని దాచుకున్నాను. 'హాసం' పత్రిక కాపీలు ప్రతినెలా కొని, అమెరికాలో ఉంటున్న మా కోడళ్ళకు పంపిస్తాను. అన్ని వయస్సుల వారిని ఎంతో ఉత్కంఠతతో చదివిస్తున్న 'హాసం' ఇలాగే చిరకాలం కొనసాగాలని ఆశిస్తున్నాను. పాటల పుస్తకం భద్రంగా దాచుకుంటున్నాను.

**- ఎ.లక్ష్మీమోహన్, తిరుపతి**

హాసం సంగీత ప్రియులకు అత్యంత ఇష్టం. పాటల గురించి పూర్తి జ్ఞానం లభిస్తుంది.

సరిగపదమని - 4 లో విజేతలైన
శ్రీవాణి, శ్రీమతి సరోజ దేవి
శ్రీ సౌమిత్రి రమణాచార్య
శ్రీమతి అవధానం లక్ష్మీమోహన్ కు
అభినందనలు

ఉష

'సరిగపదమని - 5' డ్రా ఫలితాలను విజేతల అభిప్రాయాలతో సహా ఈ సంచికలో ప్రచురించలేకపోయాం. వచ్చే సంచికలో ప్రచురించటం జరుగుతుంది.

- ఎడిటర్

# 'సరిగపదమని-5'

## జవాబులు

**అడ్డం:** 2. సిరివెన్నెల 5. పడతా 6. రహస్య 8.గోగు 10.కోవెల 11.హాయి 12. చంటి 14.బద్రి 15. ఇంద్ర 16.చూపులు 18.లేలేత 19.శ్రీలేఖ 20. మురారి 23. శ్రీ శ్రీ 24.లక్షా

**నిలువు:** 1.కోపమా 2.సితార 3.లక్స్ 4.నాలుగు 7.హలో 8.గోల 9.సింహాద్రి 10.కోటి 12.చంద్రలేఖ 13.వాలు 14.బతక 17. శ్రీశ్రీశ్రీ 21. రాల 22.రిక్షా

## కరెక్టు సమాధానాలు వ్రాసిన వారు:-

ఇ.మురళీకుమారి- చిత్తూరు, బి.రేణుకకుమారి- బోధన్, ఎస్.అరుణ-కాకినాడ, డి.శ్రీవల్లి- హైదరాబాద్, కె.వి.ఎన్.కుసుమలత-హైదరాబాద్, కె.ఎస్.లక్ష్మీ నారాయణ (రవి)- అనపర్తి, ఇప్పగంటవెంకటశ్రీనివాసరావు- హైదరాబాద్, ఎ.శాంతబాయి- నంద్యాల, డి.మురళీకృష్ణ- నడుపల్లి(ప॥గో॥జిల్లా), వై.రోశిరెడ్డి- సత్తెనపల్లి, హిరణ్మయి- హైదరాబాద్, ఇ.టి.రామారావు- శ్రీహరికోట (నెల్లూరు జిల్లా), పి.జితేంద్రదేవ్- హైదరాబాద్, ఎమ్.వంశీకృష్ణ- కాకినాడ, ఆర్.ప్రియదర్శిని- విజయనగరం, వైదర్భి.విరమ్మడు (మహాలక్ష్మి)- ద్రోణంరాజ్‌నగర్(విశాఖజిల్లా), పి.లక్ష్మిరామలమ్మ- కాగజ్‌నగర్ (అదిలాబాద్ జిల్లా), యన్.శ్రీనివాసులు-కర్నూలు, జి.ప్రసూనాంబ-కాకినాడ, పి.జితేంద్రదేవ్- సికింద్రాబాద్, క్రిరిఝాన్సీ- హైదరాబాద్, కె.సుబ్రమణ్యం- కడప, కె.సునీత- ఎలమంచిలి (విశాఖజిల్లా), చిట్టాకమల్- హైదరాబాద్, ఎస్.ప్రదీప్‌కుమార్- హైదరాబాద్, సి.దావిడ్‌రాజ్- ప్రొద్దుటూర్ (కడపజిల్లా), పి.శ్రీనివాసరెడ్డి- వి.కె.నగర్ (నెల్లూరుజిల్లా), సి.వి.రామయ్య- విశాఖపట్నం, పి.శైలజ- అద్దంకి (ప్రకాశంజిల్లా), తాతిరాజు జగన్- బిరహంపూర్(ఒరిస్సా), చిపుకులచిరంజీవి- ఒంగోలు, ఎన్.వి.నంవల్‌కుమార్- అనంతపురం, డా॥చల్లాభారతి-పాలకొల్లు, మరువాడ కామేశ్వరరావు- మంచిర్యాల(ఆదిలాబాద్‌జిల్లా), హిమబిందు టి.ఎస్ -కాకినాడ, జి.వి.రమణ- సంగారెడ్డి, కొణిదెన శార్వాణి- గుంటూరు, పి.హెచ్.శోభాకుమారి- చీపురుపల్లి(విజయనగరంజిల్లా), ఆర్.శారదఅనసూయ- హైదరాబాద్, సుధాకర్ పి.యు.- హైదరాబాద్, పాణ్యంరుక్మిణీదేవి- కర్నూలు, జి.ఎస్‌కె.శ్రీదేవి- బొబ్బిలి, పంగులూరి సత్యనారాయణ- నెల్లూరు, యమ్.కీర్తి- విశాఖపట్నం, సహారె ఈరణ్ణ- ఆదోని, కె.మురళీమోహన్- మార్కాపూర్ (ప్రకాశం జిల్లా), పన్నిధిరామ్‌కుమార్- ఆకివీడు(ప॥గో॥జిల్లా), కనకదుర్గబతావు- తెనాలి, మామిడిమునిశ్రీలత- రేపల్లె, మామిడిమహేంద్ర- పుణే, వి.భాస్కర్- హైదరాబాద్, బి.యస్.యస్.అపర్ణ- హైదరాబాద్, ఎన్.జగన్మోహనరావు- కరీంనగర్, ఎల్.లలితశ్రీ- బెంగుళూర్, జె.మాధవ్- హైదరాబాద్, దూపిజయశ్రీ- హైదరాబాద్, డాక్టర్ సయ్యద్‌రహమతుల్లా- పర్లాకిమిడి(ఒరిస్సా), పి.వి.సుబ్రమణ్యం- సూళూరుపేట, చిరాలశివశంకర్- గుంటూరు, సి.హెచ్. అనురాధనాగేష్- హైదరాబాద్, మల్లెలశశిధర్- హైదరాబాద్, ఎమ్.రామలక్ష్మి- విజయవాడ, టి.మోహన్‌రావు- విశాఖపట్నం, సి.హెచ్.వి.ఎమ్.జగన్నాధరావు- రామచంద్రపురం (తూ॥గో॥ జిల్లా), నేలపట్లసత్యహరిప్రసాద్- చీమకుర్తి (ప్రకాశం జిల్లా), గరిమెళ్ళభాగ్యశ్రీ- ఖమ్మం, ఎస్.ఎస్.కె. సుధాకర్- విశాఖపట్నం, కె.వి. రమణరెడ్డి- హైదరాబాద్, జి.వాసంతి- హైదరాబాద్, ఎన్.బాలగంగి రెడ్డి- మచుపల్లి (కడపజిల్లా), టి.కె.శ్రీమణి- పాండిచ్చేరి(తమిళనాడు), ఎ.రవికుమార్- చిరాల (ప్రకాశంజిల్లా), ఎ.సరోజినిదేవి- రాజమండ్రి, శ్రీపాదఉదయశ్రీ- అమలాపురం, కె.వి.ఎస్.పి. పండరి పాదాలు-నెల్లూరు, కె.మారుతేశ్వరరావు- పరిగి(అనంతపురంజిల్లా), ఎ.వి.ఎన్.ఎస్. మూర్తి -హైదరాబాద్, గంగారపు వెంకట్రావు- సత్తెనపల్లి, బి.బాబు- ప్రొద్దుటూరు(కడపజిల్లా), ఎమ్.విజయలక్ష్మి- విశాఖపట్నం, పెంటకోటషర్మిలాబుషి- విశాఖపట్నం, దెందేటిభూపతిరావు- విశాఖపట్నం, ములుగుసాహితి- చెన్నై, కె.ఎల్.ఎన్‌మూర్తి-సత్తెనపల్లి (గుంటూరు), బొమ్మకంటి రవికిశోర్- హైదరాబాద్, బి.సౌమ్య- ఖమ్మం, డా॥ఇ.వసుంధర- చెన్నై, డా॥ఇ.వి.ఎన్.చారి- అహ్మదాబాద్(గుజరాత్), సుహాసిని ఇలపావులూరి- చెన్నై, ఇలపావులూరి శేషతల్పశాయి- అద్దంకి(ప్రకాశం జిల్లా), పి.విజయలక్ష్మి- అమలాపురం (తూ॥గో॥ జిల్లా), మరువాడవెంకటరామ లక్ష్మి-విశాఖపట్నం, ఎ.చంద్రకుమారి- హైదరాబాద్, కె.పార్వతి- రాజమండ్రి, ఎమ్.శ్రీనివాసమూర్తి- మదనపల్లి, కె.ఎస్. ప్రసాదమూర్తి- కాకినాడ, వరుదు సాత్రాజిత- అలుదు (శ్రీకాకుళంజిల్లా), ఎస్.సాంబశివరెడ్డి- చిత్తూరు, అద్దంకిశ్రీరామచంద్రమూర్తి- హైదరాబాద్, ఎ.సీతాదేవి- హైదరాబాద్, కుమారి.ఆర్.ఎస్- హైదరాబాద్, పింగళ్వర్వాణి హారిక- హైదరాబాద్, డా॥కె.జి.జయరాంరెడ్డి- కర్నూలు, జి.జయచంద్రగుప్త- కర్నూలు, దాసి.నాగమణి- నంద్యాల, బి.శశాంక్- ఏలూరు, కొమ్మూజ్రీధర్- బసంత్‌నగర్ (కరీంనగర్ జిల్లా), యం.ప్రసాదమూర్తి- రాజమండ్రి, కె.కల్యాణి- హైదరాబాద్, పరసఖసంనూర్‌నర్ఘం- దొమ్మేరు(ప॥గో॥ జిల్లా), తురుమెల్లరామకృష్ణ- నెల్లూరు, వరయోగిమోహన్- సికింద్రాబాద్, కె.శంకరనారాయణ- హైదరాబాద్, కె.లావణ్య- ధర్మవరం(అనంతపురంజిల్లా), ఎ.నాగేష్‌బాబు- తాడేపల్లి(ప॥గో॥జిల్లా), పి.సునీల్‌కుమార్- కొత్తూరు(ప॥గో॥జిల్లా), పి.ఇందిరాశ్రీరామ్- చెన్నై, బి.వి.రమణరావు- హైదరాబాద్, ముగ్గళ్ళరాజకుమార్- హైదరాబాద్, పహోరేఇందిర-కళ్యాణ్(మహారాష్ట్ర), కె.పురుషోత్తమాచార్యులు- విజయవాడ, ఎ.వి.కనకదుర్గ- హైదరాబాద్, ఛందరంలలిత- గుంటూరు, ఎస్.వి.చంద్రశేఖర్- నగరి(చిత్తూరుజిల్లా), గొలివిశశేఖ- నంద్యాల, శిష్టీసీత మహాలక్ష్మి- హైదరాబాద్, ఎస్.శివనారాయణ- కొత్తపేట(ప్రకాశంజిల్లా), కె.వసుంధర- నల్గొండ, వక్క్రవర్తి- గరివిడి(విజయనగరంజిల్లా), వై.శేషగిరిరావు- జైపూర్(ఒరిస్సా), శశిశేఖర్ వెన్నెలకంటి- హైదరాబాద్, ఆర్. వాగరాజ- దేవరకొండ(నల్గొండజిల్లా), జి.ఎస్.శేఖర్- తిరుపతి, బి.విజయలక్ష్మి- కె.పెరుమాళ్ళపురం(తూ॥గో॥జిల్లా), పసుమర్తిపద్మనాభం- హైదరాబాద్, సమ్మ పవ్వాపరావు- శ్రీకాకుళం, ఎమ్.మణిబాబు- హైదరాబాద్, సామిత్రిరామాచార్య- హైదరాబాద్, పి.యం.అచారి- హైదరాబాద్, కోటి లలిత- సికింద్రాబాద్, పి.వి.హార్దయకుమార్- నిజామాబాద్, కె.నిరుపమ- హైదరాబాద్, పి.యస్.యస్.పవన్- సోమేశ్వరం(తూ॥గో॥జిల్లా), ఓరుగంటి ఉమాదేవి- హైదరాబాద్, దారెమలలక్ష్మికుమారి- తెనాలి, వై.భానుప్రసాద్- కర్నూల్, పి.ఎస్.ఎస్. రాజు- శ్రీరంగనగర్(మహబూబ్‌నగర్‌జిల్లా), బి.సరళ- కర్నూలు, శ్రీపాదశ్రీవాణి- హైదరాబాద్, ఎ.శ్రీదేవి- శ్రీకాకుళం, ఎమ్.భానుమతి- హైదరాబాద్, ఉప్పలమోహన్‌బాబు- అవనిగడ్డ (కృష్ణాజిల్లా), వై.వి.ఎస్. సత్యనారాయణ- కాకినాడ, వేలివెంటిసోమశేఖర్- చెన్నై, ముప్పిరాల శంకర- హైదరాబాద్, రాయప్రోలులక్ష్మీదేవి- ఒంగోలు, యు.ఇంద్రసేనారెడ్డి- నెల్లూరు, కటకం రవి-విజయవాడ, ఎన్.కె.నాగేశ్వరరావు-పెనుగొండ(ప॥గో॥జిల్లా), తిరుమల్‌ప్రసాద్.పి- హైదరాబాద్, ఉన్నవలక్ష్మీనారాయణరావు-రాజమండ్రి, పి.శారదాదేవి- హైదరాబాద్, కె.వి.సరస్వతి- హైదరాబాద్, వి.యస్.ఆదిత్య- విశాఖపట్నం, విభానుపూడిమనోహర్- హైదరాబాద్, ఎమ్.సుబ్బారావు- కాకినాడ, ఎమ్.ఎస్.చంద్రశేఖరరావు- హైదరాబాద్, ఆత్మూరిఅన్నపూర్ణ- హైదరాబాద్, పి.శేఖర్‌బాబు- ధర్మసాగరం(వరంగల్‌జిల్లా), వి.విజయలక్ష్మి- హైదారాబాద్, సి.హెచ్.వెంకటలరాజయ్య- సంగారెడ్డి, సి.మురళీకృష్ణ- హైదరాబాద్, బొడిగ వెంకటేశంగౌడ్- హైదరాబాద్, వి.నళినికాంత్- విజయవాడ, సి.హెచ్.సుమతి పవన్- హైదరాబాద్, టి.ఎస్.కౌముది- విశాఖపట్నం, యు.యు.ఉరుకుందు- ఎమ్మిగనూరు, మాధురి.ఇ- కడప, పొట్టముత్యాలు- దేవరకొండ(నల్గొండ జిల్లా), ఎన్.చంద్రకళశంకర్- హైద్రాబాద్, పోగుల నాగరాజేశ్వరశర్మ- కొత్తపల్లి (కరింనగర్), బి.రవిశంకర్- హైదరాబాద్, పింగళిశ్యామ సుందర్- బెంగుళూర్, అన్నేశ్వరశర్మమండపాక- హైదరాబాద్, జి.రాములు- గొల్లపూడి (కృష్ణాజిల్లా), ఏ.శ్రీరత్న- విద్యానగర్, ఎమ్.మాధురిరంగరావు- నల్గొండ, బి.శేషసాయి- సత్తెనపల్లి(గుంటూరుజిల్లా), వడ్లమన్నాటి భార్గవి- విజయవాడ, జయంతిప్రకాశశర్మ- విశాఖపట్నం, పి.కల్యాణ్‌కళాధర్-నెల్లూరు, డా॥ఉప్పల వెంకటరమణయ్య- కడప, డి.ఎస్.శంకర్- వక్కలంక(తూ॥గో॥జిల్లా), పంకొజు రాజగోపాల్- మాన్‌దొడ్డి(మహబూబ్‌నగర్‌జిల్లా), మువ్వలరామ కోటేశ్వరరావు- ముంబాయి, ఎస్.సీతాలక్ష్మి- ములపర్రు(ప॥గో॥జిల్లా), జె.విజయలక్ష్మి- విశాఖపట్నం, బి.కమలవల్లి- హైదరాబాద్, ఉషావినోద్- హైదరాబాద్, గ్రంధిశ్రీకాంత్- మునుమూరు (కృష్ణాజిల్లా), సాముగంటిజేమ్సుదేవరాజు- అచ్చంపేట (మహబూబ్‌నగర్‌జిల్లా), ఆగూరు రవీంద్రకుమార్- విశాఖపట్నం, పదాలరాము- శ్రీకాకుళం, సి.వి.ఆర్.యస్.కిరణ్‌కుమార్- నరసాపురం (ప॥గో॥జిల్లా), ఎం.వి.ఎస్.లక్ష్మి- కాకినాడ, వి.కృష్ణవేణి- తెనాలి, వనంజానకీదేవి- పాత పాల్వంచ (ఖమ్మంజిల్లా), వానపల్లిగంగరాజు-విశాఖపట్నం, ఎస్.సాయిబాబు- నెల్లూరు, చెవలచిన్నికృష్ణ- జగ్గయ్యపేట(కృష్ణాజిల్లా), పి.ప్రశాంత్- సికింద్రాబాద్, బి.అనంతకృష్ణ- పుంగనూరు (చిత్తూరుజిల్లా), పి.వి.సునీత్- బిరహాంపూర్ (ఒరిస్సా), పి.వి.సుందర్‌కుమార్- బిరంహాంపూర్(ఒరిస్సా), కె.వి.దుర్గామోహన రావు- నల్గొండ, జి.శంకర్‌రావు- నిర్మల్, మద్దుల అప్పారావు- అనకాపల్లి(విశాఖజిల్లా), కడలిఅప్పారావు- చీరాల(ప్రకాశంజిల్లా), పి.వసంతలక్ష్మి - ఇబ్రహీంపట్నం (కృష్ణాజిల్లా), డి.కామలి- మార్కాపూర్(ప్రకాశంజిల్లా), పి.హెచ్.సత్యజగదిష్- కుర్ధారోడ్(ఒరిస్సా), గోగులమూడిశేషగిరిరావు- సంతమాగులూరు (ప్రకాశంజిల్లా), గంటి ఎస్.వి.వి.ఎస్.రామగోపాల్- పెరురు (తూ॥గో॥జిల్లా), ఎ.అపూర్వ- ఖమ్మం, డి.హరిప్రియ- అనంతపురం, ఊట్లచెన్న వేంకటేశ్వర్లు- కడప, ఎస్.వి.ఎస్.భగవానులు-ఒంగోలు, నవదిపాటి వెంకటేశ్వర రావు- లేమల్లెపాడు(గుంటూరుజిల్లా), నిశ్శంకరరావుగంగాధరరావు- గుంటూరు, జవంగుల శ్రీనివాస్- సత్తెనపల్లి(గుంటూరుజిల్లా), డి.శ్రీనివాసచార్య- హన్మకొండ, పురాణం సుబ్రహ్మణ్యం- మార్కాపురం(ప్రకాశంజిల్లా), జుమ్మలమడకశేషుగీతా మాధవి- హైదరాబాద్, వనుమర్తిజగన్నాధం- విజయనగరం, ఎ.నరసింహం- పార్వతిపురం(విజయనగరంజిల్లా), మద్దిపాటి సూర్య- హైద్రరాబాద్, కొవ్వలి రామశేషు- విస్సన్నపేట(కృష్ణాజిల్లా), ఎ.టి.శ్రీనివాస్- అనంతపురం, జి.కల్యాణి శర్మ- నంద్యాల(కర్నూలుజిల్లా), తరిగొప్పులజ్యోత్స్న- విజయనగరం, ఎన్.టి.కృష్ణ -న్యూఢిల్లీ, వై.మంజీర- విశాఖపట్నం, ఎ.కృష్ణచందు- హైదరాబాద్, బి.మధు సూదనరావు- నెల్లూరు, ఎల్.రాధావిశాకర్‌రెడ్డి- కొంగరకలాన్(రంగారెడ్డిజిల్లా), పి.మాధవిలత- విశాఖపట్నం, ఒలేటిసీతాదేవి- విజయవాడ, తవికెళ్ళ రామకృష్ణ- విజయవాడ, వై.మానస- సికింద్రాబాద్, చింతలబుక్కప్రకాశ్- వేములవాడ (కరీంనగర్‌జిల్లా), ఎ.రవికిరణ్- గుంటూరు, కేశవశివ కుమార్- ఒంగల్‌పేట (ఆదిలాబాద్ జిల్లా), ఎమ్.శ్రీధర్- శిడ్లపచ్చు(కర్ణాటక), యల్లాపంతులలక్ష్మి పద్మావతి- శ్రీకాకుళం, జె.శ్రీదేవి- వనపర్తి(మహబూబ్‌నగర్‌జిల్లా), కె.సత్యప్రభ- మదనపల్లి, చాగంటిలింగరాజు- కొండలఅగ్రహారం(విశాఖజిల్లా), అర్.మణి ప్రసాద్- జడ్చర్ల (మహబూబ్‌నగర్ జిల్లా), పి.కనకదుర్గ- విశాఖపట్నం, మద్దాలి సువర్చలాశ్రీనివాస్- హైదరాబాద్, మద్దాలిమురళీకృష్ణ- నిజామాబాద్, పద్మ మురహరి- హైదరాబాద్, పి.వైజయంతి- వైజాగ్, తాడిమళ్ళవిలిమ- గుడివాడ (కృష్ణాజిల్లా), ఎన్.రమాదేవి- హన్మకొండ, మద్దిత్యాగరాజు- నరసన్నపేట, ఉణుదుర్తి నాగబాబు- రాజమండ్రి, బి.ఎస్.వి.వరప్రసాద్- హైదరాబాద్, షేక్ మెహమూద్- ఆసిఫాబాద్ (ఆదిలాబాద్‌జిల్లా), వి.అనసూయ- తెనాలి, కె.వి. ప్రన్నీత్‌సాయి- రాజమండ్రి, ఈ.రాధిక-హైదరాబాద్, కొండపల్లిశ్రీలతా నాయుడు- న్యూపాల్వంచ, ఎమ్.పరిపూర్ణారెడ్డి- నల్లపాడు (గుంటూరు జిల్లా), పూసరపు రోహిణశ్రీకృష్ణప్రియ- నర్సాపురం(ప॥గో॥జిల్లా), కె.రాజేశ్వరి- విశాఖపట్నం, బి.ఇ.శ్రీనివాసమూర్తి- అనంతపురం, టి.కె.లక్ష్మి- అత్రేయపురం, టి.చరణ్‌కేదార్- తాడేపల్లిగూడేం (ప॥గో॥జిల్లా), వి.విజయలక్ష్మి- వరంగల్, యస్.వి.నాగభూషణం- హైదరాబాద్, బి.ప్రభాకరశాస్త్రి- కడప, మోచెర్ల హనుమంతరావు- రాజమండ్రి, బి.మోక్షనందం- ఉప్పలపాడు(ప॥గో॥జిల్లా), ఎన్.లీలాప్రసూనదేవి- హైదరాబాద్, తాడిపర్తిసుజాత- నెల్లూరు, చవిటిపల్లిశుభ ప్రద- నరేంద్రపురం(తూ॥గో॥జిల్లా), కె.బి.కైలాస్‌నాథ్- అనంతపురం, సరస్వతుల రామనరసింహం- హైదరాబాద్, కుంటాశివ నాగేశ్వరరావు-మాచర్ల, మేడామస్తాన్ రెడ్డి- విశాఖపట్నం, సోమయాజుల సాయిప్రసాద్- ఒనకడిల్లీ(ఒరిస్సా), ఎ.అశోక్ కుమార్‌రావు- గుర్రంపోడు(నల్గొండజిల్లా), పి.స్వాతిలక్ష్మి- చీపురుపల్లి (విజయనగరంజిల్లా), జె.పద్మావతి- హైదరాబాద్, జె.పాలురాజు- కడపరాజుపల్లి (ప్రకాశంజిల్లా), బాసరాజుయాదగిరి- రామన్నపేట(నల్గొండజిల్లా), పి.వి.యస్. మల్లేశ్వరరావు- రామవరం(ఖమ్మంజిల్లా), ఎస్.కెసవ అయ్యాంగర్- నర్సాపుర్ (ప॥గో॥జిల్లా), సి.నళినికుమారి- సికింద్రాబాద్, బి.సత్యవతి- హైదరాబాద్, తాడి రంగారావు- రాజమండ్రి, పి.పాపారావు- విశాఖపట్నం, పాలెపుశ్రీనివాస్- రాజమండ్రి, యం.సమత- అనంతపురం, విరివింటి శ్రీమోక్షిత్‌శాస్త్రి- వనపర్తి(మహబూబ్‌నగర్ జిల్లా), గుంజి అచ్యుతరావు- ముక్తినూతలపాడు (ప్రకాశంజిల్లా), సి.హెచ్.శ్రీవాణీ శైలజ- విశాఖపట్నం, నసీమాతాజ్.షేక్- శ్రీశైలండ్యామ్‌తూర్పు (కర్నూలుజిల్లా), భోగరాజుసుబ్బారావు- విశాఖపట్నం, డి.వెంకటరావు- సాలూరు(విజయనగరం జిల్లా), కె.వి.రమణ- బిరహాంపూర్(ఒరిస్సా), టి.వి.రాఘవశర్మ- చెన్నై, గణవరం శ్రీనివాస్- వెంకటేశ్ ఖని(ఖమ్మంజిల్లా), బొమ్మకంటి దక్షిణామూర్తి- హైదరాబాద్, దశికసుందరి- దిగమర్రు(ప॥గో॥జిల్లా), పి.మైథిలి- అనంతపురం, పి.మధు- విజయనగరం, జి.గాయత్రి- విశాఖపట్నం, జి.భోగేశ్వరరావు- విశాఖపట్నం, డి.రాధ- తణుకు, గాదిరత్నకుమారి- రాజమండ్రి, పి.వి.రేఖ- కర్నూలు, యస్.వేణుగోపాల్- కాకినాడ, ఎస్.శంకరనారాయణ- విశాఖపట్నం, ఎ.టి.కాశీనాథ్- హైదరాబాద్, సి.వి.ఎన్.ఎల్.శిరిష- హైదరాబాద్, ఎన్.రాధా కామేశ్వరి- హైదరాబాద్, కె.వసంతకుమారి- దేవరకొండ, పి.లక్ష్మి- రాజన్ (శ్రీకాకుళంజిల్లా), వి.కృష్ణప్రియ- నిజామాబాద్, సి.స్వాతి- కనిగిరి, జి.వసంతలక్ష్మి - హైదరాబాద్, వావిలాలకృష్ణకుమారి- హైదరాబాద్, ఎ.ఆదినారాయణ- పోతవరం(గుంటూరుజిల్లా), పి.సురేష్‌బాబు- తెప్పవరప్పడు(నెల్లూరుజిల్లా), ఆమంచి వెకంట అప్పారావు- రాజోలు (తూ॥గో॥ జిల్లా), పూర్ణచంద్రిక.డి- విజయనగరం, టి.గిరిజ- సికింద్రాబాద్, కూచికార్తికభద్రవర్ధని- హైదరాబాద్, అద్దంకికళాప్రభాకర్- తెనాలి(గుంటూరుజిల్లా) పి.శ్యాంమోహన్- కరీంనగర్, కె.నాగశివ జ్యోతి- చిరాల(ప్రకాశంజిల్లా), యస్.సుర్యాకాంతం- కాకినాడ, అనుపోజుశివకుమార్- కొమరవానిపేట (శ్రీకాకుళంజిల్లా), బి.వి.ఎస్.ప్రసాద్- పుల్లలపాడు(ప॥గో॥జిల్లా), పి.రాజారెడ్డి- హైదరాబాద్, కె.కామేశ్వరరావు- చొడవరం(విశాఖజిల్లా), గంటిజయలక్ష్మి- అమలాపురం, బి.ఎస్.శ్రీనివాస్- విజయవాడ, పానాటివిజయలక్ష్మి- చిత్తూరు, ఎ.బాల్‌నాథ్- నిజామాబాద్, కె.జగన్నాధరావు- టాటానగర్(జర్ఖండ్), పి.విజయలక్ష్మి- కాకినాడ, ఎమ్.ఎస్.మూర్తి- కాకినాడ, అడుగుమల్లిరామచంద్రరావు- రేపల్లె(గుంటూరు జిల్లా), వల్లెసురేష్‌బాబు- జ్యోతినగర్ (కరీంనగర్‌జిల్లా), కశెట్టివేణుగోపాల్- యమ్మిగనూరు(కర్నూలుజిల్లా), ఎ.ఎస్.కాంతం- రాజమండ్రి, ఎమ్.సుహాసిని- హైదరాబాద్, బల్లాదివ్య- విశాఖపట్నం, టి.ఇందిరాదేవి- హైదరాబాద్, ఘడియారంసూర్యనారాయణ- గుంటూరు, కె.చంద్రశేఖర్- మద్దిపాలెం(విశాఖజిల్లా), బాలనాగు సత్యసిద్ధార్థ- భీమడోలు(ప॥గో॥జిల్లా), బి.రమామణి- గుమ్మలక్ష్మీపురం (విజయనగరంజిల్లా), సి.హెచ్.జయలక్ష్మి- చింతపల్లి(తూ॥గో॥జిల్లా), బి.సంతోష్ కుమార్- గుమ్మలక్ష్మీపురం (విజయనగరంజిల్లా), కేతాశ్రీనివాస్- విజయవాడ, సి.హెచ్.కల్యాణ్‌చక్రవర్తి- బిరహాంపూర్ (ఒరిస్సా), కొనికిహనుమాయమ్మ- ఒంగోలు, వి.వి.సూర్యనారాయణమూర్తి- కాకినాడ, ఆర్.పద్మావతి - హైదరాబద్, కె.వి.సరోజిని- అత్తిలి(ప॥గో॥జిల్లా), కిశోర్‌కుమార్-గోదావరిఖని(కరీంనగర్‌జిల్లా), పి.హరిత- హైదరాబాద్, బి.చంద్రశేఖరయ్య- రామసముద్రాం, వి.సతీష్‌చంద్ర- నెల్లూరు, రావెళ్ళశ్రీనివాసరావు- విజయవాడ, ఎమ్.ఆర్.ఆర్.వి. ఎన్.కుమార్- రేపల్లె(గుంటూరుజిల్లా), కె.పద్మ- వైజాగ్, తెలికిచెర్లరామకృష్ణ- విజయనగరం, గాలి ప్రసాద్‌రెడ్డి- శ్రీకాకుళం, పి.వేణుగోపాల్- అచ్చంపేట(మహబూబ్‌నగర్‌జిల్లా), బి.ఝాన్సీలక్ష్మి- శ్రీరంగపట్నం(తూ॥గో॥జిల్లా), వి.వి.యస్. మందేశ్వరరావు- మండపేట(తూ॥గో॥జిల్లా), కె.మనోరమ- బెంగుళూరు, వై.జయశ్రీ- హైదరాబాద్, పి.వి.రామశర్మ- విశాఖపట్నం, కె.వి.కె.నాగమణి- విశాఖపట్నం, పి.రవీందర్- హైదరాబాద్, బి.కవిత- తిరుపతి, జి.ఎస్.ఎస్.వి.రమణ రావు- సికింద్రాబాద్, కె.జ్ఞానేశ్వర్‌రావు- హైదరాబాద్, పి.రమేష్- హైదరాబాద్, టి.ఫణి- కాకినాడ, యు.విజయశేఖరరెడ్డి- హైదరాబాద్, కోసేరా- విజయనగరం, వి.వి.సుబ్బరావు- హైదరాబాద్, ఏగూరు విశ్వప్రియనందన్- మహబూబ్‌నగర్,కె.పద్మ- అచ్చంపేట(మహబూబ్‌నగర్‌జిల్లా), గురజాలశ్రీదేవి- విశాఖపట్నం, బి.వి.వరలక్ష్మి- హైదరాబాద్, పి.ఇందిరా దేవి- హైదరాబాద్, పి.కుమారస్వామి- మార్కాపురం(ప్రకాశంజిల్లా), పి.జె.బిన్నెట్- నిడుబ్రోలు (గుంటూరుజిల్లా), కాల్వ హిమవర్ష- ధవళేశ్వరం, కె.విజయరాఘవన్-వరంగల్, అప్పలబత్తులఈశ్వరరావు- హైదరాబాద్, యం.జ్యోతికృష్ణ- సికింద్రాబాద్, కె.సుప్రసన్న- నిజామాబాద్, కొంపెల్లపద్మజారాణి- విశాఖపట్నం, వజ్రాలస్వాతి- హైదరాబాద్, పి.వి.యస్. రామకృష్ణ- గోదావరిఖని, కొత్తపల్లిజేజిబాబు- మచిలీపట్నం (కృష్ణాజిల్లా), పి.ఎస్.ఆర్.జశివప్రసాద్- హైదరాబాద్, డి.ఎస్.ఆర్.ప్రసాద్- సికింద్రాబాద్.

## ఒక తప్పుతో వ్రాసిన వారు:-

ఎస్.పద్మావతి- హైదరాబాద్, బి.బర్నచాన్- నెల్లిమర్ల(విజయనగరంజిల్లా), చిట్టాజిభాగ్యలక్ష్మి- రావిపాడు(గుంటూరుజిల్లా), జి.వి.ఎస్.తాయరు- భీమవరం(ప॥గో॥జిల్లా), తుర్లపాటి భాస్కరరావు- బళ్ళారి, రాధ.ఎమ్- కోదాడ్ (నల్గొండజిల్లా), మల్యాలహరిశ్రీకృష్ణ- హైదరాబాద్, ఎ.అన్నపూర్ణ- హైదరాబాద్, ఎమ్.జె.అనిల్‌కుమార్- కడప, బాలస్వామిగౌడ్- వనపర్తి, బి.సత్యనారాయణ- నంద్యాల, కగంటి మురళీకృష్ణ- చిలకులూరిపేట (గుంటూరుజిల్లా), పి.శ్రీనివాస్- తిరుపతి, వరదాసాయికుమార్- పర్లాకిమిడి(ఒరిస్సా), సింధు- వైజాగ్, బచ్చువిజయ్‌కుమార్- విశాఖపట్నం, టి,శ్రీధర్- విజయనగరం, ఎమ్.నాగేంద్రప్ప- సికింద్రాబాద్, గేదెలరామారావు- ఏలూరు,కొండపల్లిగంగయ్య- నిజామాబాద్, టి.శైలజ- హైదరాబాద్, డా॥ఎన్.శ్యామల- నెల్లూరు,కమలామీనన్- నిర్మల్ (ఆదిలాబాద్‌జిల్లా), డి.నాగభూషణం- అల్లీపూర్(కరీంగనగర్‌జిల్లా), చాడావెంకటశాస్త్రి- నవరంగపూర్(ఒరిస్సా), అడపావిఘేశ్వరరావు- పర్లాకిమిడి(ఒరిస్సా), కె.జగదీశ్- విజయవాడ, బద్వేటివెంకటేశ్వరరావు- ఉలవపాడు(ప్రకాశంజిల్లా), ఎస్.వి.ఎస్.లక్ష్మి- హైదరాబాద్.

## రెండు తప్పులతో వ్రాసిన వారు:-

ఇలపావులూరి శేషశ్రీ- వెలమూరిపాడు(ప్రకాశంజిల్లా), ఎమ్.ఝాన్సీ- పొన్నలూరు(ప్రకాశం జిల్లా), యస్.సత్యానంద్- సికింద్రాబాద్, బి.శ్యాంసుందర్- అరసవల్లి (శ్రీకాకుళంజిల్లా), మాదాబత్తులలక్ష్మి - విజయనగరం, అకుండికోటేశ్వరమ్మ- రాయగడ(ఒరిస్సా), డి.సంధ్యరాణి- రాజమండ్రి, బొడసింగు రాజేశ్వరి- కాకినాడ, అయ్యగారి రాజశేఖర్-రాజోల్ (తూ॥గో॥జిల్లా), మహమ్మద్‌లతీఫ్- హైదరాబాద్, ఎ.రాధకృష్ణ- శ్రీకాకుళం, బి.ఆర్.ఎస్.కె.భరద్వాజ్- అనంతపురం, ఎస్.ఎన్.ఎస్.ప్రకాష్- న్యూఢిల్లీ, బి.సీతామహాలక్ష్మి- కొవ్వూరు (ప॥గో॥జిల్లా), మహబూబ్‌సుభాని- పాలేరు (ఖమ్మంజిల్లా), వి.వి.ఎస్.లక్ష్మి- విశాఖపట్నం, బి,పద్మావతి- సాలూరు(విజయనగరంజిల్లా), పువ్వాడవిజయలక్ష్మి- వినుకొండ(గుంటూరుజిల్లా), ములుకుట్లమణి- కాకినాడ, అర్‌కె.యు.ఎస్.భాస్కరరావు- ములగపూడి(తూ॥గో॥జిల్లా), అర్.శ్రీనివాస్- హైదరాబాద్, దాస్యంవెంకటవంశీకృష్ణ- జంగారెడ్డిగూడెం(ప॥గో॥జిల్లా), పెదురువర్తి రవిబాబు- బిరహాంపూర్(ఒరిస్సా), బిల్లంకొండ రాంబాబు- వమిడిపాడు(గుంటూరుజిల్లా), పి.వి.వి.అప్పారావు- రావులపాలెం(తూ॥గో॥జిల్లా), ఎస్.వరలక్ష్మి- హైదరాబాద్, బి.సుకుమార్-తిరుపతి, సి.హెచ్.ఉషశ్రీ- హన్మకొండ, భావ్కరవల్ల రోహిణిపవన్- రాజమండ్రి, నవెమ్మట్లఉమామహేశ్వరి- శృంగావరపుకోట (విజయనగరంజిల్లా), సి.హెచ్.స్వాతి- విశాఖపట్నం, ముదపాకసోమరాజు- అత్తిలి(ప॥గో॥జిల్లా), అంజనేయులు మండవ -శాంతనూతలపాడు(ప్రకాశంజిల్లా), యు.లక్ష్మణస్వామి- వెంకటచలపతినగర్ (కర్నూలుజిల్లా), బొల్లిపోగు సుధారాణి- రెడ్డిగూడెం(కృష్ణాజిల్లా), బొల్లిపోగుచంటి-రెడ్డిగూడెం(కృష్ణాజిల్లా), వి.ఎస్.ఆర్.శాస్త్రి- దామరచర్ల(నల్గొండ), ధనుంజయ్‌రావు టి.- అవనిగడ్డ(కృష్ణాజిల్లా), ఎన్.తనుజ- కుర్ధారోడు(ఒరిస్సా), పి.వి.శివప్రసాద్- నెల్లూరు.

## మూడు తప్పులతో వ్రాసిన వారు:-

పి.తివిక్రమ్‌శ్రీనివాస్- సుగూరు(మహబూబ్‌నగర్‌జిల్లా), కె.లావణ్య- నంద్యాల(కర్నూలుజిల్లా), జి.పాండురంగశర్మ- హైదరాబాద్, శ్రీధర్‌వెముల- కల్వకుర్తి(మహబూబ్‌నగర్‌జిల్లా), బొజ్జహరికృష్ణ- చెన్నై, ఎ.రాజశేఖరరెడ్డి- కాజా(గుంటూరుజిల్లా), వై.చక్రవర్తిగౌడ్- హైదరాబాద్, వై.పి.లతా- గుడివాడ, మిరియాలనాగశ్రీనివాసరావు- తణుకు, జె.విశ్వసాయి- నంద్యాల(కర్నూలుజిల్లా), జె.గంగరాజు- పర్లాకిమిడి(ఒరిస్సా).

# పులిరాజాకి ఏడుపు వస్తుందా...!?

- వారణాసి రామకృష్ణ



పొద్దున్నే అద్దం ముందు విలాసంగా నిల్చొని పెద్ద పెద్ద మీసాల్ని దువ్వుకోసాగాడు రాజా! అతగాడికి పల్లెటూర్లో బోలెడన్ని ఆస్తిపాస్తు లున్నాయి. పిల్లల్ని బాగా చదివించాలని పట్నంలో కాపురం పెట్టేడు. బాధ్యతలతో పాటు కష్టం సుఖం బాగా తెలిసిన మనిషి....

భార్య పరుగు పరుగున బైటికెళ్ళటం అద్దంలోంచి చూసి

"ఏమిటింత హడావిడి కృష్ణవేణీ?" అని అడిగాడు.

"పనిమనిషింతవరకూ రాలేదు! ముంగిట్లో ముగ్గేద్దామని..." అంటూ జవాబు చెప్పి కృష్ణవేణి బైటికొచ్చేసరికి, ఇంటిముందు బోలెడంత మంది ఆడవాళ్ళు గుంపులు గుంపులుగా నిలబడి ఉన్నారు.

"ఏమైందండి?" కంగారుగా అడిగింది.

ఎవ్వరూ సమాధానం చెప్పలేదు. పైగా కొందరు కిసుక్కుమని నవ్వేరు! మరి కొందరు చీరకొంగు నోట్లో దోపుకుని మరీ నవ్వేరు.

"మాట్లాడరేంటి?" అంది కృష్ణవేణి ఆదుర్దా పెరిగిపోయి.

ఎవరికి వారు నవ్వుతూ ఏమీ చెప్పకుండా వెళ్ళిపోయారు. వెళ్ళిన వాళ్ళు వెళ్ళకుండా కొంచెం దూరం వెళ్ళి ఆగి - అక్కడ్నించి తన ఇంటివైపు వేలు చూపించి మరీ నవ్వుతూ మాట్లాడు కుంటున్నారు.

ఇంతలో కృష్ణవేణి డియరెస్ట ఫ్రెండ్ పక్కింటి సుందరి వచ్చి

"వేణీ! మీ ఆయనేం చేస్తున్నాడిప్పుడు?" అడిగింది.

ఇదేంటిలా అడుగుతోందని ఆశ్చర్యపోతూ

"మీసాలు దువ్వుతూ షేవింగు చేసుకుంటు న్నారు!" చెప్పింది కృష్ణవేణి.

సుందరి - చెవిదగ్గర రహస్యం చెప్తున్నట్టు ఒంగి

"ఈ సంగతి విన్నావా? మీ ఆయన మీద పేపర్లో రోజూ ఏదో రాస్తున్నారంట!" అంది గుసగసగా

నిర్ఘాంతపోయింది కృష్ణవేణి!

"మా ఆయన మీదనా?" అంటూ.

"అవును! మీ ఆయన మీదనే! అన్ని పేపర్లల్లోనూ, పుస్తకాల్లోనూ రాస్తున్నారట!"

"ఏమిటి నువ్వు చెప్పేది? మా ఆయనేమన్నా మినిస్టరా? సిన్మా యాక్టరా? ఆయన మీదేం రాస్తారూ?"

"ఏమో! అవన్నీ నాకు తెలీదు! కానీ పేరు పెట్టి మరీ రాస్తున్నారట!"

"ఏమనీ ?!"

"పులిరాజాకి దగ్గొస్తుందా? పులిరాజాకి తుమ్మొస్తుందా? పులిరాజాకి రోజూ అసలు ఆకలవుతుందా? క్రమం తప్పకుండా చెంబు పట్టుకుని చెరువు కెళ్తున్నాడా లేదా? - ఇలా

రోజుకొక రకంగా పేపర్ల నిండా మీ ఆయన గురించేనట!"

సుందరి చెపుతుంటే - వర్షాలు పడ్డాక ఆల్మట్టి నుంచి ఆంధ్రాకి నీళ్ళు పారిన లెవెల్లో కన్నీళ్ళు ప్రవహిస్తున్నాయి కృష్ణవేణికి.

ఆ దృశ్యం చూసి దూరంగా నిలబడ్డ అమ్మలక్కలంతా దగ్గర చేరారు!

వాళ్ళని చూడగానే కృష్ణవేణి దుఃఖం కృష్ణానదిలా ఉధృతం అయిపోయింది!

"ఇదెక్కడి ఘోరమమ్మా! చీమక్కూడా అపకారం చెయ్యని మనిషి! ఆయనకి తుమ్మొస్తే వీళ్ళకెందుకు? దగ్గురాకపోతే వీళ్ళకెందుకు? అసలిట్లా కూడా పేపర్లల్లో రాస్తారా?" ముక్కు చీది వాపోయింది కృష్ణవేణి!

"కలికాలమమ్మా... కలికాలం! ఇంతకు ముందు రచ్చబండ దగ్గర చేరి ఒకడి మీద ఒకడు చాడీలు చెప్పుకునేవాళ్ళు! ఇప్పుడు పేపరొక్కొ పితూరీలు చేస్కుంటున్నారు!" అంటూ కళ్ళెగ్రజేసింది! మెడికలు విరుస్తూ ఓ ముసలమ్మ.

"అయినా ఊళ్ళో ఏ మొగాడూ లేనట్టు నా మొగుడే దొరికాడా?"

"నీ మొగుడికి పెద్దపెద్ద రొయ్య మీసాలు ఉన్నాయి! జుట్టు పెంచినట్టు మీసాలు పెంచుకున్నాడు!"

"పెంచుకుంటే ఎవరి మొగుళ్ళకయినా మీసాలే కాదు గడ్డాలు పెరుగుతాయి!"

"నిజమే! కానీ ఏ మగాడూ పెంచుకోనంతగా నీ మొగుడు పెంచుకోబట్టే అతన్నందరూ పులిరాజా అంటున్నారు! ఎవరిదో దృష్టి నీ మొగుడి మీద పడింది వేణీ!" సుందరి చెప్పగానే

"దృష్టికాదు... దిష్టి! నా మొగుడు బావుంటే వూళ్ళోవాళ్ళు చూళ్ళేక ఇలా పేవర్లల్లో రాయిస్తున్నారు!" అంటూ ఏడుస్తూ ఇంట్లోకెళ్ళిపోయింది కృష్ణవేణి.

అప్పటికే రాజా షేవింగ్ పూర్తి చేస్కుని - నున్నగా మెరుస్తున్న గడ్డాన్నీ, రౌద్రం పుట్టి పడుతున్న పెద్దపెద్ద మీసాల్ని ఆప్యాయంగా తడుముకుంటూ ఉన్నాడు.

కృష్ణవేణి కోపంగా మొగుణ్ణి చూసి, "ఆ వెధవ మీసాల్ని కత్తిరించి పారెయ్!" అన్నది కత్తెర చేతిలో పెడుతూ.

పులిరాజా ఆశ్చర్యపోయాడు. ప్రాణాలకంటే మిన్నగా ప్రేమిస్తున్న మీసాల్ని కత్తిరించాలా? అమ్మో! అయినా విషయం తెల్సుకుందామని -

"ఎందుకూ?" అని అడిగాడు.

"ఎందుకంటే? ప్రతిరోజూ నీ గురించే పేవర్లల్లో రాస్తున్నారంట!" అంటూ అమ్మలక్కలు, సుందరి చెప్పిన విషయాలు పూసగుచ్చినట్లు చెప్పింది!




అన్నీ విని పులిరాజా దిగ్భ్రాంతికి గురయ్యాడు! మీసాలు మెలేశాడు భయంగా!

✤ ✤ ✤

రెండ్రోజులు గడిచాయి! ఎరువులు కొని పల్లెటూరికి మనిషి చేత పంపించి పులిరాజా ఇంటికొచ్చేసరికి కాస్త ఆలస్యం అయింది! కృష్ణవేణి ఎక్కడా కనిపించకపోయేసరికి ఆదుర్దాగా వెతుకుతూ పెరట్లోకి వచ్చాడు. చీకట్లో గోడచాటున నిలబడి ఏడుస్తోందామె.

పులిరాజా తాగుతున్నాడని, ఆ మైకంలో ఏవేవో చేస్తున్నట్టుగా పేపర్లో రాశారని సుందరి చెప్పిన సంగతి ఆమె చెవుల్లో గింగురుమంటోంది!

పులిరాజా మీసాలు దువ్వుతూ - "వేణీ! ఇక్కడున్నావా?" హుషారుగా అని-

"అదేంటి ఏడుస్తున్నావ్?" ఆదుర్దాగా అడిగాడు.

"నా బతుక్కి ఏడుపొక్కటే మిగిలింది!"

"అదేంటి? ఏమైందిపుడు?"

"ఇంకా ఏమవ్వాలయ్యా? నిన్ను నమ్మాను! నువ్వే దేవుడనుకున్నాను! కానీ - కానీ ఇంత దిక్కుమాలిన పన్లు చేస్తావని వూహించలేదయ్యా - వూహించలేదు!"

"దిక్కుమాలిన పన్లా? లేదే - ఈసారి కల్తీ ఎరువులు కాకుండా మంచి ఎరువులు చూసి మరీ కొన్నాను! మన వూరు పంపేను కూడా! నువ్వేం దిగులుపడకు!"

"ఛీ - ఏమీ తెలీని నంగనాచిలా ఎరువుల గొడవెందుకిప్పుడు?"

పులిరాజా చప్పున ఆమెని వెలుగులోకి లాగి - మొహంకేసి సూటిగా చూసి

"ఇప్పుడు చెప్పు! ఏమైందసలు?" గట్టిగా అడిగాడు!

వేణి కోపంగా చూసి - "నువ్వు... నువ్వు... ఈ మధ్య తాగుతున్నావటగా?" అడిగింది.

"తాగుడా?!"

"తాగుడే! తాగుడా అని అడగటం దేనికి మళ్ళీ! అదొక్కటే అయితే కొంత పరవాలేదు. దానికితోడు - దానికి తో... డు..." వెంటనే ఏడుపు పొర్లుకొచ్చింది.

పులిరాజా నిర్ఘాంతపోతూ - "చెప్పు! నీకు అనుమానం ఎక్కువైపోయిందీమధ్య!" విసుగ్గా అన్నాడు.

"తప్పు చేసి పైగా విసుగా? నువ్వు చెడు తిరుగుళ్ళు తిరగడం లేదూ!? అంటూ గట్టిగా ముక్కు చీదింది! పులిరాజా షాక్ కొట్టిన వాడిలా విలవిలలాడాడు.



"ఎవరు... ఎవరు చెప్పేరీ విషయాలన్నీ నీకు?"

"ఎవరో ఒకరు చెప్పేరు లేవయ్యా! నీ రహస్యాలన్నీ బట్టబయలు అయ్యాయని ఆశ్చర్యంగా ఉందా?"

"నోర్మూయ్! నేను అలాంటి వెధవ పన్లు చెయ్యనుగాక చెయ్యను! ఇష్టం వచ్చినట్టు పేలకు! ఎవరు చెప్పేరో - చెప్పు - వెళ్ళి వాళ్ళ నాలిక తెగ్గోస్తాను" కోపంగా అరిచాడు.

"చేసిన వెధవ పన్లు చేసింది గాక నా మీద, నా డియరెస్టు ఫ్రెండు మీద అరుస్తావా? అక్కడికీ తను చెప్పనే చెప్పింది - ఈ మగాళ్ళని నిలదీస్తే మనమీదే అరుస్తారే - అని!" అంటూ ఇంట్లోకెళ్ళి బెడ్ మీద బోర్లా పడుకుని వెక్కివెక్కి రోదిస్తూ నిద్రలోకి జారుకుంది కృష్ణవేణి. తన మీసాలకేదో ముప్పు ముంచుకొస్తోందనిపించి - రేపట్నించైనా పేపర్ కొని రెగ్యులర్‌గా చదవటం అలవాటు చేసు కోవాలని పులిరాజా బలంగా అనుకున్నాడు!

✤ ✤ ✤

"చెప్పిందంతా జాగ్రత్తగా గుర్తు పెట్టుకో!" సుందరి కళ్ళు వెడల్పు చేసుకుని మరీ వేణితో చెప్పింది! ఆమె తలవూపి -

"ఇంతకీ మా ఆయనకా మాయరోగం వస్తుందంటావా?" భయంగా అడిగింది. "ఏమో! మనకి చదవటం రాకపోవటం చేత ఇన్నాళ్ళూ పేపర్లో ఏం రాశారో సరిగ్గా అర్థం కాలేదు కానీ పులిరాజా - అదే మీ ఆయన రోజా తాగటం, తిరగటం అన్నీ వివరంగా ఫోటోల్తో సహా రాస్తున్నారట! పక్కింటి పిన్నిగారు చెప్పారు!"

"కొంపదీసి ఆయనంటే గిట్టని మావూరి కుమార్‌గాడి హస్తం ఇందులో ఉందేమోనే?"

"అదే అయితే చాలా సంతోషమే! కానీ ఎందుకైనా మంచిది - మీ ఆయన్ని కాస్త దూరం వుంచు! అర్థమైందా?" అంటూ టీవీ వైపు చూపింది! తెరమీద - అంతరాయానికి




మన్నించాలి! - అనే అక్షరాలూ, వెనకనుంచి ప్రముఖుడు పోతే వచ్చే నిలవ విధ్వంస... సారీ - నిలయ విద్వాంసుల సంగీతమూ వినిపిస్తున్నాయి.

ఇద్దరికీ తెరమీది అక్షరాలు చదవటం రాక చూస్తూండిపోయారు.

ఇంతలోనే యాంకరమ్మ ప్రత్యక్షమై - నవ్వుతూ "అంతరాయానికి మన్నించాలి! ఇప్పుడు - ఎయిడ్స్! తీసుకోవాల్సిన జాగ్రత్తలు-" అంటూ ఒక్కోటి వివరిస్తూ "ఎయిడ్స్ రోగి వాడిన కంచం, నిద్రించిన మంచం, తాగిన నీళ్ళగ్లాసు, ఉపయోగించిన కుర్చీ-" పూర్తి చేసే లోగానే మళ్ళీ అంతరాయం!

వేణికి ఒళ్ళు మండి - "అంతరాయానికి మన్నించాలి కాదు... తన్నించాలి!" గీరగా అరిచింది! అంతలోనే ప్రసారం కొనసాగి-

"స్పర్శవలన అనగా కరచాలనం, ఒకరిని మరొకరు తాకటం, చేతులు పట్టుకోవటం - ఇలాంటి చర్యల వలన ఎయిడ్స్ వ్యాధి -"

అంతలోనే ఠప్‌మంటూ జాతీయ ప్రసారాలు ఆరంభం!

సుందరి ఆదుర్దాగా - "చూశావా! చూశావా! నేను ముందే చెప్పలేదూ? నువ్వు ఎట్టి పరిస్థితుల్లోనూ మీ ఆయన తాగిన నీళ్ళ గ్లాసు కూడా ముట్టుకోకు! సరేనా?" భయంగా అన్నది.

"ముట్టుకోవటమేంటే బాబూ - చూస్తుండు! అసలు ఆయన్ని గుమ్మంలోంచి లోనికి రానివ్వను!" పళ్ళు పటపటమని కొరికి అనేసి, మళ్ళీ బాధతో ఏడుస్తూ కూర్చుంది!

పులిరాజా ఆ రోజు లైబ్రరీకెళ్ళి పాత దినపత్రికలన్నీ తిరగేసి, విషయం అంతా చదివి తెలుసుకుని - హాయిగా హుషారుగా ఇంటికొచ్చేడు!

వేణి తలుపు తెరవకుండా కిటికీలోంచి కోపంగా చూసి -

"బైట బక్కెట్లో నీళ్ళున్నాయి! స్నానం చేసి అక్కడే ఏడువ్" అంది. పులిరాజా విస్తుబోయాడు. "అదేంటే? అసలు నీకో సంగతి తెలుసా? రోజూ పేపర్లో రాస్తున్నది నాగురించి కాదు! ఎయిడ్స్ అని అదో పెద్ద జబ్బులే-" చెప్పబోతే -

పెళుసుగా - "తెలుసు" గట్టిగా అంది.

"తెలుసా?"

"ఎందుకు తెలీదు? నీకొక్కడికే అన్నీ తెలుసుననుకుని - నన్ను చదువులేని మొద్దుని, అమాయకురాల్ని చేసి వెధవ తిరుగుళ్ళు తిరుగుతావా? లేనిపోని జబ్బులన్నీ అంటించుకుంటావా? అప్రాచ్యపు పన్లు చేస్తావా? హు!"

అంటూ పులిహోర ప్యాకెట్టు వరండాలోకి విసిరేసింది!

"అయ్యో రామా! నీ తెలివి తెల్లార! పులిరాజా అంటే నేను కాదే పిచ్చిమొహమా!"

"కథలు చెప్పకు! నీకొచ్చిన రోగం గురించి నాకు తెలుసు! ఈ రోజునుంచి నీ స్థానం వరండాలోనే!"

గట్టిగా అనేసి లోపలి తలుపు కూడా ధడేల్మని వేసేసింది!

పాపం పులిరాజా రాత్రంతా ఆ వరండాలోనే - ఆ చీకట్లోనే... దోమలతోనే - నిద్రలేకుండా నానా అవస్థలూ పడ్డాడు!

తెల్లవారింది! ఇంటిముందర బోలెడంత హడావిడి! పులిరాజా ఆశ్చర్యంగా చూశాడు. తన పల్లెటూల్లో వుండే - కుమార్! మనుషుల్ని వెంటేసుకుని కొట్లాటకొచ్చేడు! వస్తూనే ఆ రోజు దినపత్రిక కోపంగా పులిరాజా మీదకి విసిరేసి - "ఈ పిరికి పని చేసింది నువ్వే కదూ!" అరిచాడు!

పులిరాజా ఆశ్చర్యంగా పేపర్ విప్పి చూస్తే - మొదటి పేజీలోనే -ఫోటోతో సహా - ఎయిడ్స్ బారిన పడిన మరో రోగి.... కుమార్... అంటూ ప్రముఖంగా ప్రచురించారు!

పులిరాజా భళ్ళుమని నవ్వి - "అసలు సంగతి తెలుసుకోకుండా అపార్థం చేసుకోకు కుమార్!"



అని పూర్తి చేసేలోపే - ఆవేశంగా - "దమ్ముంటే ఎదురుగా వచ్చి పోరాడాలిరా! ఇలా అబద్ధాలు ప్రచారం చేసికాదు... నా కంతా తెలుసు! పులిరాజా ప్రకటనలు నేనే వేయించాననుకుని నా మీద ఇలా బురద చల్లుతున్నావు! అవునా?" అంటూ నిప్పులు చిమ్మేడు కుమార్.

"చూడు కుమార్! ఆవేశంతో కాక కాస్త ఆలోచన పెట్టి చూడు! అసలు పులిరాజా, కుమార్ అంటే నువ్వు - నేను కాదు!"

కుమార్ ఆశ్చర్యంగా - "కాదా" అన్నాడు.

ఈలోగా వూరు వూరంతా ఏదో గొడవ జరుగుతోందని కదిలివచ్చింది! అందర్నీ కలియజూస్తూ పులిరాజా -

"అవును కుమార్! ఎయిడ్స్ మహమ్మారి వ్యాధి! దాని బారిన పడకండ్రా మొర్రోమని ఎంత మొత్తుకుని ఏడ్చినా, ఎంత డబ్బు ఖర్చు పెడుతున్నా మన జనంలో చైతన్యం రాలేదు! ఇలా లాభం లేదని మంచిగా కంటే మరో రకంగానైనా చెడుని ఎదుర్కోవాలని ప్రచారం వింతవింతగా చేస్తున్నారు! అయితే దురదృష్టవశాత్తూ - వూళ్ళల్లో సగం చదువుకున్న వారూ, నిజానిజాలు సగమే అర్థమయ్యేవాళ్ళూ ఎక్కువ! అలాంటి వాళ్ళక్కూడా అర్థమయ్యే రీతిలో దీన్నెవరూ చెప్పటం లేదు!" అంటూ ఆవేదనగా చెపుతుండగానే,

ఇద్దరు వ్యక్తులు దగ్గరకొచ్చి, చేతులు జోడించి - "ఈ చుట్టు ప్రక్కల వూళ్ళల్లో పులిరాజా గారంటే చాలా గౌరవం ఉందని మా సర్వేలో తెలిసింది సార్! మీరు చెప్పింది నిజమే సార్! అందుకే ఈ ఉద్యమ స్ఫూర్తిని అందుకుని మీలాంటి వారు ఊళ్ళల్లో ప్రచారం చెయ్యాలి సార్!" వినయంగా చెప్పారు.

"ఇంతకీ మీరు?"

"ఒక స్వచ్ఛందసంస్థ కార్యకర్తలం సార్! ఊళ్ళల్లో ఉన్న మిలాంటివారు పూనుకుని పులిరాజాకి ఎయిడ్స్ ఎలా రాదో నిరూపించాలి సార్!"

అంటూండగానే కృష్ణవేణి ఇంట్లోంచి పరుగెత్తికొచ్చి - ఏడుస్తూ -

"నన్ను క్షమించు! నువ్వెంత మంచివాడివో తెలిసి కూడా ఎయిడ్స్ కంటే భయంకరమైన అజ్ఞానంతో నిన్ను అవమానించాను! అనరాని మాటలన్నాను!" అంటూ దుఃఖంతో కన్నీరు కార్చింది! దాంతో పెళ్ళాం అంటే ఎంతో ప్రేమున్న పులిరాజాకీ ఏడుపొచ్చింది!

చూస్తున్న జనం ఆశ్చర్యంగా.

"అంతంత పెద్దపెద్ద మీసాలున్న మన పులిరాజాకీ ఏడుపొస్తుందా? అంటూ వింతగా గుసగుసలాడటం మొదలెట్టారు.

కుమార్ - పులిరాజా భుజం మీద స్నేహంగా చెయ్యివేసి, జనంకేసి తిరిగి "పులిరాజాకేంటి? బాధకలిగితే ఎవరికైనా ఏడుపొస్తుంది!" అన్నాడు...! పులిరాజా చప్పున అతని మాటల్ని అందుకుని

"పక్కదారులు పడితే ఎవడికైనా ఎయిడ్స్ వస్తుంది! బతుకు బస్టాండవుతుంది!! పెళ్ళాం మెళ్ళో తాళి పుటుక్కుమంటుంది!"

అనేసరికి భళ్ళుమని నవ్వేరందారూ!! ■

---

# ఘంటసాల క్విజ్

**మొదటి బహుమతి : రూ. 250/-**
**రెండవ బహుమతి : రూ. 200/-**
**మూడవ బహుమతి : రూ. 150/-**
} మరియు ఘంటసాల కలర్ ఫోటో

**క్విజ్ రూపకల్పన, సమర్పణ, నిర్వహణ**
డా॥ కె.వి.రావు,
వ్యవస్థాపకులు,
పద్మశ్రీ ఘంటసాల గానసభ,
28, 1-1-79, ఆర్టీసీ క్రాస్‌రోడ్స్,
హైదరాబాద్ - 500 020.



## క్విజ్‌నెం-14

1. సముద్రాల రచన, ఘంటసాల గానం, ఎన్.టి.ఆర్. నటన వీరి కాంబినేషన్‌లో తొలి చిత్రం?
జ: ..........................
2. నాగయ్య నటించిన చిత్రం. అందులో కొన్ని పాటలు / పద్యాలు నాగయ్యగారు, మరికొన్ని నాగయ్యగారికి ఘంటసాల పాడారు. ఆ చిత్రం?
జ: ..........................
3. అలనాటి అందాల నటుడు మంత్రవాది శ్రీరామమూర్తికి ఘంటసాల పాడిన మొదటి చిత్రం?
జ: ..........................
4. హాస్యనటుడు నల్ల రామ్మూర్తి నిర్మించిన ఒక చిత్రానికి ఘంటసాల సంగీత దర్శకుడు. ఆ చిత్రం?
జ: ..........................
5. అక్కినేని, జగ్గయ్య నటించిన చిత్రములో ఘంటసాల జగ్గయ్యకు మాత్రమే పాడారు. ఆ చిత్రం?
జ: ..........................

పంపినవారి పేరు : ______________________

చిరునామా : ______________________

**నిబంధనలు:**

ఎ) పోటీలో పాల్గొనగోరేవారు పక్కన ప్రచురించిన కూపన్ మాత్రమే నింపి కవరులో పంపాలి. కూపన్ కాకుండా మరే విధంగా పంపినా ఆ ఎంట్రీ స్వీకరించబడదు.

బి) కవరుపై 'ఘంటసాల క్విజ్' అంటూ పేర్కొనటం మరచిపోకూడదు.

సి) ప్రకటించిన బహుమతులను నగదుగా గాని, ఆడియో క్యాసెట్లుగా గాని, సీడీలుగా గాని విజేతలకు 'పద్మశ్రీ ఘంటసాల గానసభ - హైదరాబాద్' వారిచే నేరుగా పంపటం జరుగుతుంది.

డి) ఏ బహుమతి కైనా ఒకరు కన్నా ఎక్కువగా విజేతలుంటే తుది నిర్ణయం 'పద్మశ్రీ ఘంటసాల గాన సభ' వారిదే!

ఇ) ధారావాహికంగా కొనసాగే ఈ క్విజ్ పోటీలలో ఏ కేటగిరీలోనైనా వరసగా 5 సార్లు విజేతగా ఎన్నికైనవారికి ఓ ప్రముఖవ్యక్తి ద్వారా హైదరాబాద్‌లో మరొక ఆకర్షణీయమైన బహుమతిని అందజేయటం జరుగుతుంది.

**కూపన్‌లు 30-11-2003 లోగా చేరాలి**

**కూపన్‌లు పంపవలసిన అడ్రసు**
'హాసం- హాస్య సంగీత పత్రిక'
502, శ్రీ బాలాజీ నిలయం, 13-1-212,
మోతీనగర్, హైదరాబాద్-500 018.

---

**ఘంటసాల క్విజ్ - 12 విజేతలు**

మొదటి బహుమతి
శ్రీ కె. చంద్రశేఖరరావు, ఉయ్యూరు.
రెండవ బహుమతి
శ్రీ మద్దుల అప్పారావు, అనకాపల్లి.
మూడవ బహుమతి
శ్రీ బి.సత్యనారాయణ, కర్నూలు.

**సరి అయిన సమాధానాలు**

1. పల్నాటి యుద్ధం
2. పల్లెటూరిపిల్ల
3. కీలుగుఱ్ఱం
4. ఆలీబాబా 40 దొంగలు
5. ఒసే వయ్యారి రంగి (పల్లెటూరి బావ)

**బహుమతులు**

మొదటి బహుమతి : ఎ) 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్/ స్వరసుధ ఘంటసాల 31 గాయనీ మణులతో పాడిన సినీ గీతాల డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి. వారిది.
రెండవ బహుమతి: 'బహుదూరపు బాటసారి' (ఘంటసాల ప్రైవేట్ పాటలు) డబుల్ డిస్క్ హెచ్.ఎం.వి.వారిది.
మూడవ బహుమతి : ఎ) ఘంటసాల, ఎల్.ఆర్.ఈశ్వరి యుగళ గీతాల 'లవ్‌మి నెరజాణ' హెచ్.ఎం.వి. వారి సింగిల్ సి.డి.
బి) ఘంటసాల పాడిన గోల్డెన్ అవర్స్ పాటల క్యాసెట్. హెచ్.ఎం.వి.వారిది.

నవంబరు 30 ప్రథమ వర్ధంతిని పురస్కరించుకుని...

# అసమాన శాస్త్రీయసంగీత విద్వాంసుడు



# బాలసుబ్రహ్మణ్య శర్మ

దాదాపు 30 సంవత్సరాల క్రితం విజయవాడ ఆకాశవాణి కేంద్రం వారు సంక్రాంతి సందర్భంగా ఓ ప్రత్యేక కార్యక్రమం ప్రత్యక్ష ప్రసారం చేశారు. ఆహూతుల సమక్షంలో జరిగిన ఈ కచ్చేరీలో అన్నవరపు రామస్వామి వయొలిన్‌పై, దండమూడి రామమోహనరావు, మహాదేవు రాధాకృష్ణంరాజు మృదంగంపై, అన్నవరపు గోపాలం ఘటంపై, నిడుమోలు రాఘవయ్య కంజీరాపై సహకరించగా గాయకులుగా నేదునూరి కృష్ణమూర్తితో బాటు ఎం.ఎస్.బాలసుబ్రహ్మణ్యశర్మ పాల్గొన్నారు. కార్యక్రమం కోసం ముందుగా కేటాయించిన గంటన్నర కావచ్చినా విద్వాంసులు శ్రోతలను ఉర్రూతలూగిన్తూనే ఉన్నారు. కళను సమయచట్రంలో బిగించడం సాధ్యం కాదని గ్రహించిన అధికారులు కార్యక్రమం జరిగేటంతసేపూ ప్రసారం చేయమని ఆదేశాలిచ్చి తప్పుకున్నారు. ఈ నిర్ణయాన్ని ప్రశంసిస్తూ వేలాది ఉత్తరాలు రేడియోస్టేషన్‌వారిని ముంచెత్తాయి.

1966లో బరంపురంలో జరిగిన కచేరీలో బాలసుబ్రహ్మణ్యశర్మ 'శంభో మహాదేవ' కృతికి నెఱవు చేసి, స్వరకల్పనతో శ్రోతలను తన్మయులను చేస్తూండగానే చింతా శివరామశాస్త్రి భాగవతార్ అనే శ్రోత ముగ్ధుడై తన చేతికున్న మూడుకాసుల స్వర్ణసింహతలాటాన్ని శర్మగారి చేతికి తొడిగారు. అలగా భద్రాచలంలో కచేరీ చేస్తూండగా మరో శ్రోత చేతికి ఉన్న రెండు బంగారు ఉంగరాలను శర్మగారికి అలంకరించారు. ఇలాటి సంఘటనలు శర్మగారి జీవితంలో ఎన్నో!

'కొండలలో నెలకొన్న కోనేటి రాయుడు' అన్నమయ్య కీర్తనను హిందోళరాగంలో స్వరపరచి జనబాహుళ్యంలోకి చొచ్చుకుపోయేట్లా చేసిన శర్మగారు 1981లో తిరుమల తిరుపతి దేవస్థానం వారి తరపున కళాపీఠంలో గాత్రవిభాగానికి నియమింపబడ్డారు. 1983 నుండి 5 సంవత్సరాలపాటు శ్రీ వెంకటేశ్వర సంగీత నృత్యకళాశాలలో గాత్ర విభాగపు అధిపతిగా పనిచేశారు. అనంతరం పద్మావతి మహిళా విశ్వవిద్యాలయంలో ఎం.ఏ. సంగీతం విద్యార్థులకు 3 సం.లపాటు విద్య బోధించారు.

## సన్మానాలూ, సత్కారాలూ

- శర్మగారి 10 వ యేట భట్లమగుటూరులో కచేరీ చేస్తూండగా ఆదిభట్ల నారాయణదాసుగారు విని 'నీ సంగీతం నుండి అమృతాన్ని కురిపిస్తావురా' అని ఆశీర్వదించారు. అది అమోఘవాక్కు అయింది.
- పిఠాపురంలో చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారి సమక్షంలో కచేరీ చేస్తే ఆయన 'ఆంధ్రబాలగాయకరత్న' బిరుదుతో బాటు బంగారు పతకం ఇచ్చారు.
- విజయనగరం సంగీతకళాశాల సిల్వర్‌జూబ్లీ ఉత్సవాలలో అపురూపరాగాల డిమాన్‌స్ట్రేషన్ చేసి 'లయబ్రహ్మ' అనిపించుకున్నారు. అటువంటి ప్రదర్శనే హైదరాబాదులో సంగీతనాటక అకాడెమీవారు ఏర్పాటుచేయగా వీరి ప్రతిభకు ప్రొఫెసర్ పి.సాంబమూర్తి ముగ్ధులయ్యారు.
- 25 సం.ల వయసులో ప్రప్రథమ ఆస్థానకవి శ్రీపాదకృష్ణమూర్తి గారి చేత రాజమండ్రిలో సువర్ణఘంటాకంకణ సన్మానం జరిగింది.
- 1971లో పాట్నాలో బిహార్ సంగీతనాటక అకాడెమీ అవార్డు గవర్నర్ అనంతశయనం అయ్యంగార్ అధ్యక్షతన అకాడెమీ అవార్డు ప్రధాని ఇందిరాగాంధీ చేతులమీదుగా అందుకున్నారు.
- అదే సంవత్సరంలో మంగళంపల్లి, మహావాది, క్రోవి వంటి దిగ్గంతుల సమక్షంలో రాజమండ్రిలో 'గానకళాచతురానన' బిరుదుప్రదానం, గండపెండేర సత్కారం
- 1979లో రాజమండ్రి త్యాగరాజనారాయణదాస సేవాసమితి బాలమురళీకృష్ణగారిచే కనకాభిషేకం
- బెంగుళూరులో 'స్వరసార్వభౌమ' బిరుదు
- విజయవాడలో పారుపల్లి రామకృష్ణయ్య స్మారక సమితిచే 'నాదసుధార్ణవ' పురస్కారం
- మద్రాసు తెలుగు అకాడెమీ సత్కారం
- 2001 సప్తగిరి విద్వన్మణి అవార్డు తిరుపతిలో
- 1998 సం.పు రాష్ట్రపతి అవార్డు ఢిల్లీలో

..... ఇంకా ఎన్నో...

ఎందరో మహాగాయకులకు సహాధ్యాయిగా, మరెందరో మహనీయులకు గురువుగా మసలిన శర్మ గోదావరీతీరాన రాజమండ్రిలో 1929లో మామిళ్లపల్లి కొండయ్య, సోదెమ్మ దంపతులకు జన్మించారు. చిన్నతనంలోనే తలిదండ్రులు మరణించడంతో బావగారి ఇంట ఉండి ప్రాథమిక విద్య ముగించుకున్నారు. సంగీతం పట్ల వీరి ఆసక్తిని గమనించి బావగారు రాజమండ్రిలోనే ఉన్న ప్రముఖ నాదస్వర విద్వాంసులు జి.పైడిస్వామి గారి వద్ద శిష్యునిగా చేర్పించారు.



శర్మగారిలో శ్రద్ధ, పట్టుదల గమనించిన పైడిస్వామిగారు మరింత ఉత్సాహంతో పాఠాలు బోధిస్తూ ఒక సంవత్సరంలోపునే వీరిచే కచేరీ చేయించడమే కాదు, కచేరీలు చేయడానికి వెళ్లినపుడు వెంటబెట్టుకుని ఊరూరా తిప్పారు. ఆ విధంగా ఎంతోమంది నాదస్వర విద్వాంసులను, డోలు విద్వాంసులను గమనించే అవకాశం ఏర్పడడంతో శర్మగారికి అపారమైన స్వరజ్ఞానం, లయజ్ఞానం ఏర్పడ్డాయి. అపురూపరాగాలలో, వివిధగతులలో, క్లిష్టమైన తాళాల్లో, త్రిస్థాయిల్లో, త్రికాలాల్లో పాడి వక్కవాయిద్యాల వారినీ, శ్రోతలను ఉర్రూతలూగించే శర్మగారి ప్రతిభకు బాల్యంలోనే చేసిన సాధనే ప్రధాన కారణం.

రాజమండ్రిలో ఒక హార్మోనియం షాపులో గురువుగారి ఆనతి మేరకు చేసిన కచేరీతో ముగ్ధుడైన షాపు యజమాని ఓ శృతి బాక్సును బహుమతిగా ఇచ్చారు. 9 వ యేటనుండి కచేరీలు చేస్తున్న గాయకులు అప్పట్లో వీరు కాక బాలమురళీకృష్ణగారు మాత్రమే ఉండేవారు. 13 వ యేటనే వీరి ప్రతిభను గుర్తించి మద్రాసు ఆకాశవాణి కేంద్రం వారు వీరి కచేరీలను ప్రసారం చేశారు.

ఆ తరువాత ఆకాశవాణి ద్వారా, దూర్‌దర్శన్ ద్వారా వీరి కీర్తి దశదిశలా వ్యాపించింది. ముఖ్యంగా కేరళలో ఈయనకు అభిమానులెందరో ఉండేవారు. త్రివేండ్రం, తిరుచ్చి, మద్రాసు, ఢిల్లీ, కలకత్తా, బొంబాయి, బెంగళూరు, పాండిచ్చేరి రేడియో కేంద్రాలు, దూర్‌దర్శన్ కేంద్రాలు వీరి కచ్చేరీలనెంతో ఆదరించాయి.

ఎందరో శిష్యప్రశిష్యులను తయారుచేసి, కర్ణాటక శాస్త్రీయ సంగీతంలో తనకంటూ సుస్థిరస్థానాన్ని పొందిన శర్మగారు రిటైరయాక ఒంగోలులో స్వగృహంలో నివాసమేర్పరచుకుని అక్కడా శిష్యులను తయారుచేశారు. 2002 నవంబరు 30 రాత్రి మాటీవీలో 'పాడాలని వుంది' కార్యక్రమం చూస్తూ తమ 73 వ యేట దివంగతులయ్యారు.

**- పమిడిఘంటం విజయలక్ష్మి**




పౌరాణిక చిత్రాలలోనే కాక జానపద చిత్రాల నిర్మాణంలో కూడా తెలుగు వారికున్నంత మంచిపేరు మరెవరికీ లేదనే చెప్పాలి. జానపద చిత్రాలలో ఒక ప్రత్యేకమైన ఒరవడిని తనకుతానుగా సృష్టించుకున్న దర్శకుడు విఠలాచార్య - తన చిత్రాలలో పాటలకు సంబంధించినంతవరకు విలక్షణమైన అభిరుచిని కనపరిచేవారు. 60వ దశకంలో వచ్చిన జానపద చిత్రాలలో - కొన్నింటిలో - ఇంకా భక్తి, మహిమలు, ఆదర్శం లాంటివి అంతర్లీనంగా ఉండడం చేత కొంతవరకు శాస్త్రం సమ్మతించే రాగ లక్షణాలు ఆయా పాటల స్వరరచనలలో ఉండేవి. 1960లో విఠలాచార్య దర్శకత్వంలో వచ్చిన

# కనకదుర్గ పూజామహిమ

చిత్రంలో కూడా ఆ ధోరణి ఎక్కువగా కనబడుతుంది. ఆ చిత్రానికి మాటలతో పాటు పాటలను కూడా జి.కె.మూర్తి రాయగా, జంట సంగీత దర్శకులైన రాజన్ - నాగేంద్ర స్వరరచనలో బాగా పాపులర్ అయిన ఓ ఆరు గీతాలివి:

ఆమె : జీవనమే పావనం మానవ జీవనమే పావనం
ఈ భువి సంతత సంతోష సంధాయిని గాన జీవనమే పావనం
అతడు : ప్రణయము మనలోన... ప్రణవము కాగా ॥ప్రణ॥
మనరాగములోన అనురాగమె మ్రోగ
జీవనమే పావనం మా నవ జీవనమే పావనం
ఆమె : పతి పదములసేవ సతులకు సరిత్రోవ ॥2॥ ఇహపర లోకాల నావ
అతడు : కూరిమి అలరార కోరికలింపార ॥2॥ చేరువగా జంట చేర
ఆమె : మాటలు భావాలు... మాటలు భావాలు పూవులు తావి ॥మాటలు॥
అతడు : మెలసిన ఆ రీతి కలసిన ఆనాడె
జీవనమే పావనం మా నవ జీవనమే పావనం
ఇద్దరు : ఈ భువి సంతత సంతోష సంధాయిని గాన జీవనమే పావనం
ఆమె : మదమపమ జీవనమే పావనం
నిద దవ పమ స్స మ్మప జీవనమే పావనం
సనిదపమదద్ధ నిదనిపప్ప
దపదమమ్మ పమపమాపమప
అతడు : సస్సా మదనిద సన్నిదని దప దద్దనిదపమ సదమమప
ఇద్దరు : జీవనమే పావనం ఈ భువి సంతత సంతోష సంధాయిని గాన జీవనమే పావనం



ఈ పాటను ఘంటసాల, రాజ్యలక్ష్మి గానం చేశారు. శాస్త్రీయ సంగీత ప్రపంచంలో శూలమంగళం సిస్టర్స్‌గా పేరు పొందిన రాజ్యలక్ష్మి-జయలక్ష్మిలో ఒకరైన రాజ్యలక్ష్మితో ఈ పాటను ఎందుకు పాడించారో పైన ఉదహరించిన స్వరాలు చూస్తేనే చాలామందికి అర్థమైపోతుంది. ఈ పాట 'కుంతలవరాళి' రాగంలో స్వరపరచబడింది. ఈ రాగంలో సినిమా పాటలు చాలా తక్కువనే చెప్పాలి. 'కుంతలవరాళి' అనగానే చాలామందికి గుర్తొచ్చేది బాలమురళీకృష్ణ పాడిన 'తిల్లాన నాదిరి దిరితోం' అనే తిల్లాన. 'సమపనిదస' అనే స్వరాలు ఆరోహణలోనూ 'సనిదపమస' అనే స్వరాలు అవరోహణలోనూ కలిగిన ఈ వక్రరాగంలో 'రి,గ' అనే రెండు వరస స్వరాలు లేకపోయినా రంజకత్వం ఉండడం ఈ రాగ విశేషం. అటువంటి రాగాన్ని - అందునా హీరోహీరోయిన్లకు కాకుండా క్యారెక్టర్ ఆర్టిస్టులు పాడే పాట కోసం ఎన్నుకోవడం చక్కని అభిరుచికి నిదర్శనమనే చెప్పుకోవాలి. ఈ పాటలో మిక్కిలినేని, ఆదోని లక్ష్మి ప్రధాన పాత్రధారులు. 'ఆగమనం' టీవీ సీరియల్ ద్వారా పునఃప్రాచుర్యం పొందిన రూపాదేవికి ఈ ఆదోని లక్ష్మి తల్లి.

మాలతి : వసంతుడేరాగా యీ - వసుంధరే రాగాలా
ఊగి తూగాడెనూ చిందీ అందించె - అందాలనూ॥వసం॥
కొమ్మలవీడె రంగులపూలా ఝుమ్మని పాడె తుమ్మెద వ్రాలా
చెలికత్తెలు : సరాగములాడేయీ - పరాసికాలాడేయీ
మాలతి : కమ్మదనాల - కోకిల కూయ తెమ్మర వీచి తన్మయ మీయ
చెలికత్తెలు : పరాకు పొందేవేలా - చిరాకు చెందేవేల
మాలతి : వీనులవిందయీ - కన్నులకింపయీ వెలసే నేడే హాయీ ॥వసం॥
తెలిమబ్బులతో తేలిపోయీ - సోలిపోదామా
పరుగులాడే మెరుపుతీగై - మెరసిపోదామా
వెలసే శాంతిలో వెలిగే కాంతిలో ॥వెలసే॥
వొలికించింది - హాయీ ॥వసం॥




ఈ పాటను ఏపీ కోమల, బృందం పాడగా కృష్ణకుమారి, చెలికత్తెలపై చిత్రీకరించారు. కాంతారావు, బాలకృష్ణ సన్నివేశ ప్రాధాన్యంగా కనిపిస్తారు. ఏపీ కోమల అనగానే 'దీపావళి' సినిమాలోని 'సరియా మాతో సమరాన నిలువగలడా' పాటని, 'బంగారు పంజరం' సినిమాలోని 'పదములె చాలు రామా' పాటని మాత్రమే ఉదహరించేవారు ఈ 'వసంతుడె రాగా' పాటను ఒక్కసారి వింటే ఇది కూడా ఆమె బాగా పాడిన పాటలలో ఒకటిగా చేర్చుకోడానికి మనసారా అంగీకరిస్తారు. ఈ పాటలో - ముఖ్యంగా - రెండవ చరణమైన తెలిమబ్బులలో తేలిపోయి - దగ్గర ఆమె హాయిగా పాడిందనిపిస్తుంది. ఈ పాటకు మోహనరాగం ఆధారం. ఈ పాటను జాగ్రత్తగా గమనిస్తే - 1959లో విడుదలైన శాంతారాంగారి 'నవరంగ్' సినిమాలోని 'అరెజారె హట్ నట్‌కట్' పాట నడకను ప్రేరణగా తీసుకున్నారనిపిస్తుంది.

అతడు : అనురాగ సీమ మనమేలుదామ ఆనందాల చవిచూదమా
ఆమె : మేఘాల తేలాడి ఓలాడుదామా మెరిసే ధరణీ మనదే సుమా ॥అనురాగ॥
అతడు : ఎగిరేటి ఎలతేటి తీగాలు మ్రోగే చిగురాకు పూబాలలూగే
ఆమె : తెరవోలె చిరుగాలి పారాడి సాగె కెరటాలు కోనేట తూగె
అతడు : మధురానుభవమే ఈ జగాన మధుమాసమై నేడు శోభించెనా
ఆమె : ఇలనిండె వలపు ఈ దినాన కలలన్ని కనులార కాంతుమా ॥అనురాగ॥
ఆమె : నెలరాజు నేడేల తన రాక మానె
అతడు : నీ మోము తిలకించి తలదించెనే
ఆమె : ఆ... పలికేటి చిలుకేల తన పాటమానె
అతడు : కలకంఠి నీ కంఠ మాలించెనే
ఆమె : ఉలికింది కలలా ఈ లోకమెల్ల
అతడు : పులకించె నిలువెల్ల గిలిగింతలా
ఆమె : మనలోని ప్రేమ
అతడు : ఎనలేని ప్రేమ
ఇద్దరు : మనసార తమితీర సేవింతుమా ॥అనురాగ॥






ఈ పాటను జిక్కి, పి.బి.శ్రీనివాస్ ఆలపించారు. కృష్ణకుమారి, కాంతారావుపై చిత్రీకరించారు. రాగేశ్రీ రాగం ఆధారంగా సాగిన ఈ పాట రెండో చరణంలోని మొదటి నాలుగు లైన్లలో ఉపయోగించిన ఉల్లేఖాలంకారం సినీగీతాలలోని సాహితీ మర్యాదలకు మచ్చుతునక. అతి మృదువుగా సాగే ఈ యుగళగీతంలో - మాధుర్యంలోని సున్నితత్వానికి దోసిలిపట్టే తత్వం గల జిక్కి, పి.బి.శ్రీనివాస్ గాత్ర ధర్మాలు ఎంతగా సహకరించాయో అక్షరాలలోకి అనువదించలేం. అది కేవలం అనుభవైకవేద్యం.

జయం మనదే జయం మనదే ॥జయం॥
జాణనని గని జాలిమదిగొని ॥జాణ॥
చేరెరా గారాల రా చిలుక ॥జయం॥
హహహహహహహ హొహొహొహొహొహొ లలలలలల
కనుల కొనల కులుకు లొలుక విసరగానే వలా
మనసు ఊగి మమత రేగి మరిగె కోరికలా
పెదవి తుదిలో మధువు చెదరా ఎరను వేసితి అలా...
ముదిమి మదిలో ముదము కదిలి లేచెలే మరలా
కన్నార గనుచు నన్నేలమనుచు నోరార కోరెనులే ॥జయం॥
ఓపలేనే ఈ తాపమనెను దాపునే నను గని
కోపమేల నేతాళజాల ఏలుకోమనెను
అందరాని ఆనందములకై అలమటించే తనూ
పాదమాన నీ బానిసనుచు చేసె బాసలను
కన్నార గనుచు నన్నేల మనుచు నోరార కోరెనులే ॥జయం॥




అత్యద్భుత రసస్ఫోరకంగా ఉండే ఈ పాటని గీతంగా పేర్కొనాలి. పి.సుశీల హిట్స్‌లో గల ఎన్నో పాటలతో సవాల్ చేసి నిలబడదగ్గ ప్రమాణాలన్నీ ఉన్న గీతం ఇది. ఉదయ రవిచంద్రిక రాగం ఈ పాటకు ఆధారం. ఓ విధంగా చెప్పాలంటే ఈ రాగానికి ఈ పాటను ఓ ప్రామాణిక గీతంగా చెప్పుకోవచ్చు కూడా. నిజానికి ఈ పాట పాడడానికి అతిస్పష్టమైన వాచకం కావాలి. లేకపోతే 'చేరెరా గారాల రా చిలుక' వంటి ప్రయోగాలు ఇష్టమొచ్చినట్లు దొర్లిపోతాయి. రెండో చరణంలో 'పాదమాన నీ బానిసనుచు' అనే వాక్యంలో 'పాదమాన' అనే ప్రయోగంలో స్పష్టత లోపిస్తే అది శ్రోతలను ఆలోచింపజేయకుండా మెదడు పొరలోంచి పైకి దూకేస్తుంది కూడా. అందుకే ఈ పాటలోని సంగీత సాహిత్యాలకు సుశీల స్వరం ఓ వరం అని చెప్పాలి. ఈ పాట చిత్రంలోంచి తొలగించబడింది. పాటల పుస్తకంలో ఈ పాటను మాయపాత్రధారిణి కోసం అన్నట్టుగా పేర్కొనబడింది కనుక ఆ మాయ పాత్ర ధరించిన పాత్రధారిణి మాధురి ఈ చిత్రంలో ధరించిన కొన్ని చిత్రాలను ఇక్కడ పొందుపరచడం జరిగింది.

**ఓ హోహో - ఓ హోహో**
**రారా - రారా - రారా - మార కుమార**
**రారా - రారా - రారా - రారా -** ॥రారా॥
**నీదారి చూచి చూచీ - నిలచేను నేను వేచి**
**నీదారి చూచి చూచీ - నిలచేను నేను వేచి**
**విరహానలాన చేరి - విరహానలాన చేరి**
**వేసారి వేగినారా - వేసారి వేగినారా** ॥రారా॥
**తమితీరలేని మరులా - తపియించు దీనురాలా**
**తమితీరలేని మరులా - తపియించు దీనురాలా**
**సుఖసాగరాన తేల - సుఖసాగరాన తేల**
**యిక జాగుసేయనేల - యిక జాగుసేయనేల** ॥రారా॥




ఈ పాటను జిక్కి పాడగా - శాంతి (పాటల పుస్తకంలో ఈమె పేరు స్వర్ణలతగా పేర్కొనబడింది), కాంతారావు పై చిత్రీకరించారు. జిక్కి పాడిన మంచి పాటలలో ఇదొకటి. శంకరాభరణరాగం స్కేల్‌ని ఆధారంగా తీసుకుని ఎన్నో పాటలు వచ్చేయి. మన శంకరాభరణాన్ని హిందుస్తానీలో బిలావల్ అని అంటారు శాస్త్రకారులు. ఆ బిలావల్ రాగం పోకడని స్కేల్‌గా తీసుకుని, అంతర్లీనంగా హిందుస్తానీ ఫోక్‌ని స్పృశిస్తూ, వెస్ట్రనైజ్ చేశారు సంగీత దర్శకులు రాజన్ - నాగేంద్ర ఈ పాటలో!

**ఓం కార పంజర సుఖీమ్**
**ఉపనిషదుద్యాన కేళికలకంఠీమ్**
**ఆగమ విపిన మయూరీమ్**
**అర్యామ్ అంతర్వి భావయే గౌరీమ్ గౌరీమ్ గౌరీమ్**
**జయజయనమో కనకదుర్గా నమో మోక్షమార్గా**
**శ్రీతానంద రక్షానురాగా ఘోర దుర్వార దౌర్భాగ్యభంగా**
**అనంగారిరంగా మహాచండ సింగత్తురంగా**
**గౌరీ సదా భక్త క్షేమంకరీ**
**జయకరీ! శంకరీ! కింకరవంశకరీ వసుధా శుభంకరీ**
**ఆర్త జన అభయంకరీ ఆర్త జన అభయంకరీ**
**పాహీ త్రిలోకైక జననీ భవానీ భక్త చింతామణి**
**ముక్తి సంధాయిని ఆర్త సంతారిణి ధూర్త సంహారిణి**
**కాళీ కళ్యాణి గీర్వాణి హ్రీంకారిణీ**
**అన్నపూర్ణా అపర్ణాంబ కాత్యాయినీ**
**శ్రీ చక్ర సింహాసినీ... శాంభవీ -**
**శాంభవీ భ్రమరాంభ శ్యామలాయవ్వనీ**
**భగల జ్వాలాముఖీ కామాక్షి మీనాక్షి దాక్షాయణీ**
**పేరులే వేరుగా అందరూ నీవెగా ఈ దీను గావగా రావేల వేగ**
**అమ్మా నీ పాద పద్మాలు నమ్మ**
**వెతలు తీరునమ్మా నుతులు సేయగా కొంగు బంగారమమ్మా**
**నా జన్మకారకులు నీ పూజలను మాని అపరాధమును చేసిరమ్మ**
**పావులు పుణ్యులూ నీ పాపలే గాన ఈ కోపమింకేలనమ్మా**
**కృప చూపవమ్మా మనోవాంఛితార్థమ్మునిమ్మా**
**మొరాలించవమ్మా పాలించవమ్మా**
**కనికరించమ్మ కనికరించమ్మా కనకదుర్గమ్మా**







'ఓంకార పంజర సుఖీమ్' అనే శ్లోకంతో మొదలై 'జయజయ నమో కనకదుర్గ' అనే మకుటంతో సాగిన గీతంలో దుర్గమాత నామావళిని పొందుపరచడం ఓ చక్కని ఆలోచన. మొదట ఉన్న శ్లోకం నుంచి 'ఆర్తజన అభయంకరీ' వరకు మోహనరాగంలోనూ, 'పాహి త్రిలోకైక జననీ' దగ్గర్నుంచి 'దాక్షాయణీ' వరకు హిందోళ రాగంలోనూ, 'పేరులే వేరుగా' నుంచి చివరి వరకు శుభపంతువరాళి రాగంలోనూ సాగే ఈ స్వరరచనను మాధవపెద్ది సత్యం, పి.బి.శ్రీనివాస్ గానం చేయగా - కాంతారావుపైనా, అంగికంలోనూ, వాచకంలోనూ ముక్కామలను స్ఫురింపజేసే నటుడు శ్రీకాంత్‌పైనా చిత్రీకరించారు. గాయకుడిగా పి.బి.శ్రీనివాస్ సంగీత జీవన యానంలో భక్తిరస ప్రధానంగా నిలిచిపోయే ఈ గీతం ఓ మైలురాయి వంటిది...

రచన : సముద్రాల నేపథ్యం : కోరస్

అప్సరలు: విజయీభవా! విజయా!

జయ పాండురాజ తనయా!

శివదయా లబ్ధఫల పాశుపతా!

జయహో! జయహో! జయహో!

రచన : సముద్రాల నేపథ్యం : జానకి

ఊర్వశి: ప॥నరవరా! ఓ కురువరా ! వీరుల నీకు సరీ లేరనీ !

సరసులలో జాణవనీ ! విన్నారా! కన్నారా! కనులారా ! ॥నరవరా॥

చ॥ సురపతీ నెదిరించి రణానా ! పశుపతీ మురిపించి బలానా !

సాటిలేని వీరుండన్న యశమునుగన్నా !

అర్జున ఫల్గుణ పార్థ కిరీటీ, బిరుదు గొన్న విజయా ॥నరవరా॥

నినుగనీ తలవూచే ఉలూచీ కొనుమనీ చెయిసాచె సుభద్రా

నీదూ వన్నే చిన్నే గన్నా చెలువల మిన్నా

అలరుల విలుతుని ములుకుల గురియై

వలపులమ్ము కొనురా ॥నరవరా॥

రచన : సముద్రాల నేపథ్యం : సుశీల

అన్నయిల్లాలు తమ్మునికి అమ్మగాదె !

ఎటుల పాంచాలి పొందు ఇచ్ఛగించి తీవు !

తాళి ఎఱుగని నేనెట్టి తల్లినయ్యా !

వావి వరుసలు తలపగా వలదు విజయా ! విజయా

రచన : సముద్రాల నేపథ్యం : ఘంటసాల

ఆడితప్పని మాయమ్మ అభిమతాన !

సత్యమెఱిగిన వ్యాసుని శాసనాన !

పడతికి ఈశ్వరుడొసగిన వరబలాన !

నడచుచున్నట్టి ధర్మబంధమది వనితా !

రచన : సముద్రాల నేపథ్యం : సుశీల

ప॥ జననీ శివకామినీ ! జయ శుభకారిణీ ! విజయరూపిణీ ! ॥జననీ॥

చ॥ అమ్మవు నీవే అఖిలజగాలకు ! అమ్మలగన్న అమ్మవు నీవే !

నీ చరణములే నమ్మితినమ్మా ! శరణము కోరితి అమ్మా ! భవానీ ! ॥జననీ॥

చ॥ నీ దరినున్నా తొలగు భయాలూ ! నీ దయలున్నా కలుగు జయాలూ !

నిరతము మాకూ నీడగ నిలచి ! జయము నీయవే అమ్మా - భవానీ !! ॥జననీ॥

రచన : కొసరాజు నేపథ్యం : సుశీల, కోరస్

చెలికత్తెలు : సరసాలు ఉలికింప మురిపాలు పులకింప

సయ్యాట లాడేములే ఓ వయ్యారి మొగ్గ

సయ్యాట లాడేములే

ఉత్తర : చల్లని గాలిలో జాజులు పూచెనే

మనసూ పొంగిపోయి మల్లియ నవ్వెనే

రావే చెలీ ! నవ్వరావే చెలీ! రాకపోతే వెలీ !

చెలికత్తెలు : వగలింక చాలించవే ఓ వయ్యారి మొగ్గ

నగుమోము చూపించవే ॥సరసాలు॥

ఉత్తర : ఊగే కెరటాలు ఊయల లాయెనే

తీయని ఊహలు పరుగులు తీయునే

ఏమే చెలీ నమ్మవేమే చెలీ ఏలనే ఈ చలీ

చెలికత్తెలు : అవిమంచి శకునాలులే ఓ వయ్యారి మొగ్గ

అనుకున్న పెళ్ళౌనులే నీవనుకున్న పెళ్ళౌనులే

రచన : సముద్రాల నేపథ్యం : సుశీల

ప॥ సఖియా వివరించవే

వగలెఱిగిన చెలునికి నా కథా !

సఖియా వివరించవే॥

చ॥ నిన్ను జూచి కనులు చెదిరి

కన్నె మనసు కానుకజేసి !

మరువలేక మనసురాక

విరహాన చెలి కాన వేగేనని ॥సఖియా॥

మల్లెపూలా మనసు దోచి

పిల్లగాలి వీచేవేళ !

చలువరేని వెలుగులోనా

సరసాల సరదాలు తీరేనని ॥సఖియా॥

మూలం : శ్రీకృష్ణ కర్ణామృతం నేపథ్యం : సుశీల

శ్లోకం : హే గోపాలక హే కృపాజలనిధే హే సింధు కన్యాపతే

హే కంసాంతక. హే గజేంద్రకరుణా పారీణ హే మాధవా

హే రామానుజ హే జగత్త్రయ గురో హే పుండరీ కాక్ష మాం

హే గోపీ జననాథ పాలయపరం జానామీ నత్వాం వినా

రచన : సముద్రాల నేపథ్యం : ఘంటసాల, జానకి

బృహన్నల : జయగణనాయక విఘ్నవినాయక

భయహర శుభకర గజముఖ గణపతి

ఉత్తర : భయహర శుభకర గజముఖ గణపతి

బృహన్నల : మూషికవాహన త్రిభువన పూజిత

ఉత్తర : మూషిక వాహన త్రిభువన పూజిత

గణపతి వినుతీ చేసెద వినుమా

ఉత్తర : సానిపామ గమదా

స గ మ ప ని

సానిపామ గమదా

సా పప నీనిని సాసస సాసస

ఇరువురు : సా పప నీనిని సాసస సాసస

బృహన్నల : సగరి మగరి సస

ఉత్తర : సగరి మగరి సస

బృహన్నల : ససరి సాన్ని మపనిపామ పన్ని

ఉత్తర : ససరి సాన్ని మపనిపామ పన్ని

ఇరువురు : సానిపా మ గమదా

సగమ పని

సానిపామ గమదా

బృహన్నల : ఆడినదీ గిరిరాజ సుతా నటరాజు మదీ రంజిలగా

ఉత్తర : ఆడినదీ గిరిరాజ సుతా నటరాజు మదీ రంజిలగా

బృహన్నల : స్వరగతులా జతులా సరిజోడుగ

ఉత్తర : పా, సా, పా, ద, ప, మ, గ, రి, స, ని

బృహన్నల : తా ధీం తా తకుం. దరిత కిట

ఇరువురు : స్వరగతులా జతులా సరిజోడుగ

చరణ కింకిణులు ఘల్లనగా

ఆడినదీ గిరిరాజ సుతా నటరాజు మదీ రంజిలగా

బృహన్నల : నారదుడూ కలగానము సేయా,

ఉత్తర : శారద హాయిగ వీణను మీటా

బృహన్నల : భృంగీశుడూ....భృంగీశుడూ లయరీతులు గొలుప

ఉత్తర : భృంగీశుడూ లయరీతులు గొలుప

బృహన్నల : భరతుడు తాళ్ళై యని కొనగోలు పలుకగా

ఇరువురు : ఆడినదీ గిరిరాజసుతా

నటరాజు మదీ రంజిలగా

రచన : సముద్రాల గానం : బాల మురళీకృష్ణ, లత(బెంగుళూరు)

బృహన్నల : ఆ.... ఆ... ఆ.... సలలితరాగ సుధారససారం
బృహన్నల, ఉత్తర : సలలితరాగ సుధారస సారం
బృహన్నల : సర్వకళామయ నాట్య విలాసం
ఇరువురు : సర్వకళామయ నాట్య విలాసం ॥సలలిత॥
బృహన్నల : మంజుల సౌరభ సుమ కుంజముల
ఇరువురు : మంజుల సౌరభ సుమకుంజములా
బృహన్నల : రంజిలు మధుకర మృదు ఝుంకారం
ఇరువురు : రంజిలు మధుకర మృదు ఝుంకారం ॥సలలిత॥
బృహన్నల : నిదాద సనీప నిదాపమ గమాదప సరిసా
కల్పనలో ఊహించిన హొయలు
ఇరువురు : కల్పనలో ఊహించిన హొయలు
బృహన్నల : శిల్పమనోహర రూపమునొంది
ఇరువురు : శిల్ప మనోహర రూపమునొంది
బృహన్నల : పదకరణములా మృదుభంగిమలా
ఇరువురు : పదకరణములా మృదుభంగిమలా
ముదమారలయమీరు నటనాల సాగే ॥సలలిత॥
బృహన్నల : ఝణన ఝణన ఝణ నూపురనాదం.
ఇరువురు : ఝణన ఝణన ఝణ నూపురనాదం
బృహన్నల : భువిలో దివిలో రవళింపగా పదపమపా సనిదమద
గమదనిరీసా రీసారీస్సానిపద సాన్ని సాన్ని
దమప నీదా నీదా పమదప
ఇరువురు : భువిలో దివిలో రవళింపగా
బృహన్నల : నాట్యము సలిపే నటరాయని
ఇరువురు : నాట్యము సలిపే నటరాయని ఆనందలీలా వినోదమే ॥సలలిత॥

రచన : శ్రీశ్రీ నేపథ్యం : ఘంటసాల, సుశీల

అభి : ఎవ్వరికోసం ఈ మందహాసం ఒక పరి వివరించవే సొగసరీ
ఉత్తర : చెలిమికోసం చెలి మందహాసం ఏమని వివరింతునో గడుసరి
అభి : వలపులు చిలికే వగలాడిచూపు పిలువక పిలిచీ విరహాలరేపు
ఉత్తర : ఎదలో మెదలే చెలికాని రూపు ఏవో తెలియని భావాలరేపు
ఇరువురు : ఈ నయగారం ప్రేమ సరాగం అందించు అందని సంబరాలే ॥ఎవ్వరి కోసం॥
అభి : పరుగులు తీసే జవరాలి వయసు మెరుపై మెరిసి మరపించు మనసు
ఉత్తర : ప్రణయము చిందే సరసాల చందం ఇరువురి నొకటిగ పెనవేయు బంధం
ఇరువురు : ఈ వయ్యారం, ఈ సింగారం చిందించు చిన్ని చిన్ని వన్నెలెన్నో ॥ఎవ్వరి కోసం॥

రచన : సముద్రాల నేపథ్యం : సుశీల

ప॥ దరికి రాబోకు రాబోకు రాజా ॥2॥ ఓ తేటిరాజా వెర్రిరాజా ॥దరికి॥
చ॥ మగువ మనసూ కానగలేవో తగని మారాలు మానగ లేవో ॥మగువ॥
నీకీనాడే మంగళమవురా ॥2॥ ఆశా - ఫలించీ - తరించేవులే॥దరికి॥
మరుని శరాలా తెలివి మాలీ పరువు పోనాడి చేరగరాకు ॥మరుని॥
నీవేనాడూ కననీ... విననీ ॥2॥ శాంతి సుఖాలా తేలేవులే ॥దరికి॥

రచన : సముద్రాల నేపథ్యం : లత (బెంగుళూరు)

ప॥ శీలవతీ నీ గతి ఈ విధిగా మారెనా
అడుగడుగున గడువారానీ ఆపద లెదురాయెనా
చ॥ అంతటి పాంచాల రాజు అబ్బురాల కూతురవై ॥అంతటి॥
భరత వంశ భూషణుడైనా పాండురాజు కోడలివై ॥శీలవతి॥
జగజగాలు గెలువక జాలు పాండు సుతుల యిల్లాలు ॥జగ॥
కీచకులా చేతుల చిక్కి దిక్కుమాలి వశించేనా ॥శీలవతి॥
అరివీర భయంకరులౌ గంధర్వ కుమారులారా
అవలీలగ కీచకుని హతమార్చిన వీరులారా
పాండవ కులరాజ్యలక్ష్మి పాటును కనలేరా పాలింపగ రారా రారా

మూలం : భారతం నేపథ్యం : ఘంటసాల

సీ॥ ఎవ్వాని వాకిట ఇభమద పంకంబు
రాజభూషణ రజోరాజినడగు
ఎవ్వాని చారిత్ర మెల్లలోకములకు
నొజ్జయై వినయంబు నొఱపు గఱపు
ఎవ్వాని కడకంట నివ్వటిల్లెడు చూడ్కి
మానిత సంపదలీనుచుండు
ఎవ్వాని గుణలత లేడు వారాసుల
కడపటి కొండపై కలయబ్రాకు
తే॥ అతడు భూరిప్రతాప మహాప్రదీప
దూర విఘటిత గర్వాంధకార వైరి
వీరకోటీరమణి ఘృణి వెష్టితాంఘ్రి
తలుడు కేవల మర్త్యుడె ధర్మసుతుడు

మూలం : భారతం నేపథ్యం : సుశీల

శా॥ దుర్వారోద్యమ బాహు విక్రమ రసాస్తోక ప్రతాప స్ఫుర
ద్గర్వాంధ ప్రతివీర నిర్మథన విద్యాపారగుల్ మత్పతుల్
గీర్వాణాకృతులేవురిప్డు నిను దోర్లీలన్ వెసంగిట్టి గం
ధర్వుల్ మానము ప్రాణమున్ గొనుట తథ్యం బెమ్మెయిన్ కీచకా

మూలం : భారతం నేపథ్యం : ఘంటసాల

సీ॥ కాంచన మయ వేదికా కనత్కేతనోజ్జ్వల
విభ్రమమువాడు కలశజుండు
సింహలాంగూల భూషిత నభోభాగ
కేతు ప్రేంఘణమువాడు ద్రోణసుతుడు
కనక గోవృషసాంద్ర కాంతి పరిస్ఫుట
ధ్వజ సముల్లాసంబువాడు కృపుడు
లలితకంబు ప్రభాకలిత పతాకా
విహారంబువాడు రాధాత్మజుండు
తే॥ మణిమయోరగ రుచి జాల మహితమైన
పడగవాడు కురుక్షితిపతి మహోగ్ర
శిఖరఘన తాళతరువగు సిడమువాడు
సురనదీ సూనుడు ఏర్పడ జూచికొనుము

మూలం : భారతం నేపథ్యం : మాధవపెద్ది సత్యం

ఉ॥ కౌరవసేన జూచి వణకన్ తొడగెన్ మదితోన మేము నీ
పూరక పోవుచున్కి యిది ఒప్పునే యిప్పటి భంగి జూచిన
న్వీరల నేను మార్కొనమి నిశ్చయము అట్లగుటన్ రయంబునన్
తేరు మరల్పు ప్రాణములు తీపనమున్ వినవే బృహన్నలా

మూలం : భారతం నేపథ్యం : మాధవపెద్ది సత్యం

శా॥ సింగం బాకటితో గుహాంతరమునన్ చేడ్పాటు మైనుండి మా
తంగ స్ఫూర్జితయూధ దర్శన సముద్యత్క్రోధమై వచ్చునో
జం, గాంతార నివాస ఖిన్నమతిన్ అస్మత్సేనపై వీడే. వ
చ్చెన్, గుంతీసుత మధ్యముండు సమరస్థేమాభి రామాకృతిన్

మూలం : భారతం నేపథ్యం : మాధవపెద్ది సత్యం

ఉ॥ వచ్చినవాడు ఫల్గుణుడు అవశ్యము గెల్తుమనంగరాదు రా
లచ్చికినై పెనంగిన బలంబులు రెండును గెల్వ నేర్చునే
హెచ్చుగు. కుందగున్ తొడరుటెల్ల విధంబులకోర్చుట. అట్లుగాక
యిచ్చదలంచి. ఒక్క మెయి, యుత్తజీ పొందగు చేతయున్ తగున్

రచన : సముద్రాల　　నేపథ్యం : ఘంటసాల

ఉ॥ ప్రేలితి వెన్నొమార్లు కురువృద్ధుల ముందర నేనొకండనే
చాలుదు అర్జునున్ గెలువ సంగర మందని నీదుశస్త్ర వి
ద్యా లవదుర్వి దగ్ధత బయల్పడు కాలము దాపురించె. నిన్
కాలుని ప్రోలికంపెదను కర్ణ రణాంగణమందు నిల్వుమా

రచన : సముద్రాల　　నేపథ్యం : మాధవపెద్ది సత్యం

ఉ॥ పోటుమగండు నా బుగిలిపోయిన వింటిని చేతబట్టి ఆ
ర్భాటము మీరగా పిరికిపందల కొందర గెల్చితంట ఈ
నాటికి నీదునేర్పు కదనమునగాంచు దినమ్ము వచ్చె నీ
బూటకమంతయున్ తెలిసిపోవును నేటితో రమ్ముఫల్గుణా !

రచన : సముద్రాల　　నేపథ్యం : ఘంటసాల

సీ॥ ఏనుంగు నెక్కి, పెక్కేనుంగు లిరుగడ రా
　　పురవీధుల గ్రాలగలదె
మణిమయంబైన భూషణజాలముల నొప్పి
　　యొడ్డోలగంబున నుండగలదె
కర్పూరచందన కస్తూరి కాదుల నింపు
　　సొపార భోగింపగలదె
అతి మనోహరలగు చతురాంగనల తోడి
　　సంగతి వేడ్కలు సలుపగలదె
తే॥ కయ్యమున ఓడిపోయిన కౌరవేంద్ర
　　వినుము నా బుద్ధి మరలి, యీ తనువువిడిచి
　　సుగతి వడయుము తొల్లింట చూఱగలదె
　　జూదమిచ్చుట నాడంగరాదు నమ్మ

## తారాగణం

ఎన్.టి.రామారావు, సావిత్రి , యన్.వి.రాంగారావు, రేలంగి , కుమారి విజయలక్ష్మి, సంధ్య , పద్మిని ప్రియదర్శిని, దండమూడి రాజగోపాల్, బాలకృష్ణ ముక్కామల, రామకోటి, మిక్కిలినేని, బొడ్డపాటి, శోభన్‌బాబు, వంగర, ధూళిపాళ, సీతారామ్, ప్రభాకర్‌రెడ్డి, యం.పుండరీకాక్షయ్య, కె.సత్యనారాయణ , కాంతారావు (నెల్లూరు), నారాయణస్వామి, ఆజాద్, రామరాజు, శాండో కృష్ణన్, మల్లాది సత్యనారాయణ, పొదిలి కృష్ణమూర్తి, వేటూరి రామయ్య, లొల్లాసూర్యనారాయణ, అల్లురామలింగయ్య, నాగరాజు, గోపాలరాజు

గెస్ట్ ఆర్టిస్టులు

కాంచనమాల, టి.యల్.కాంతారావు, సూర్యకాంతం, లక్ష్మీరాజ్యం

## సాంకేతిక నిపుణులు

మాటలు : సముద్రాల ,కెమెరా: ఎం.ఎ.రెహమాన్, సంగీతం : సుసర్ల దక్షిణామూర్తి, స్టిల్స్: సత్యం (జైహింద్ స్టూడియో), నృత్యం : వెంపటి సత్యం , కళ : టి.వి.యస్.శర్మ దుస్తులు :అచ్యుతరావు, కూర్పు : వీరప్ప, మేకప్ :హరిబాబు, పీతాంబరం, భక్త వత్సలం,నాగేశ్వరరావు, వీర్రాజు , రికార్డింగ్ అండ్ రీ రికార్డింగ్ : కోటేశ్వరరావు (భరణీ), పబ్లిసిటీ :స్టూడియో శర్మ టి.వి.ఎస్., సౌండ్ రికార్డిస్టు :యస్.రామారావు
సౌండ్ అసిస్టెంట్స్:రామచంద్రన్, భూపతి, కందస్వామి, చిట్టిబాబు
స్టూడియో ప్రోగ్రామ్స్: ఎ.సుందరాజన్, వి.సుబ్బయ్య, ఎన్.ఎస్.నాగప్పన్

**సహాయకులు:**

అసోసియేట్ దర్శకుడు : గురుదేవ్, కెమేరా : సెల్వరాజు, బాబు, కళ : సోమ్‌నాథ్
ఆపరేటివ్ కెమెరామెన్ : బి.జనార్ధనరావు, సాంబశివరావు, కూర్పు : నరసింహులు, సంగీతం:నాగరాజన్, బాబ్జీ, మేకప్ :వేణు, దుస్తులు:బాషా, సుబ్బారావు, సైదులు, చిట్టి
ప్రాసెసింగ్ :రంగనాథన్ (విజయా లేబరేటరీ), డిస్ట్రిబ్యూటర్స్:నవయుగ
స్టూడియో :వాహిని, భరణీ (లెప్పేస్ ఎ.ఎల్.ఎస్.ప్రొడక్షన్స్)
ఆఫీసు మేనేజరు: ఎస్.వి.సత్యనారాయణ , ప్రొడక్షన్ మేనేజరు : యన్.ప్రసాద్,
సహాయ దర్శకులు : రామ్‌గోపాల్, రావి కొండలరావు
మేనేజింగ్ పార్టనర్ :సి.వి.కృష్ణమూర్తి,
నిర్మాతలు :శ్రీధరరావు, లక్ష్మీరాజ్యం
దర్శకత్వం : కమలాకర కామేశ్వరరావు, బి.ఏ.

## నర్తనశాల - కథా సంగ్రహం

అరణ్యవాసం ముగించిన పాండవులు తమ అజ్ఞాతవాసాన్ని విరాట నగరంలో ముగించాలని నిశ్చయించుకుని, పుర ప్రాంతంలో ఉన్న జమ్మిచెట్టుమీద తమ తమ ఆయుధాలను భద్రపరచి, అజ్ఞాతవాసానికి అనుకూలమైన రూపాలను ధర్మదేవతానుగ్రహంతో పొంది, మారుపేరులతో వెళతారు, ద్రౌపది సైరంధ్రిగా, యతి రూపంలో ధర్మరాజు, వంటలవాడుగా భీముడు, నాట్యాచార్యుడుగా అర్జునుడు, అశ్వగోపాలురుగా నకుల సహదేవులు విరాటుని కొలువులో చేరి సేవ చేస్తుంటారు. అజ్ఞాతవాసాన్ని భంగం చేయదలచిన కౌరవులు పాండవులకు ఆశ్రయం యివ్వరాదనీ, జాడ తెలిస్తే అప్పగించమనీ నానా రాజులకు శ్రీముఖాలు పంపించి, జీమూత మల్లుని భీముని జాడ దీయటానికి పంపుతారు. దుశ్శాసనుడు ద్వారకా నగరానికి వెళతాడు. ద్వారకలో అతని దుశ్చింతను గ్రహించిన అభిమన్యుడు తండ్రులకావిషయం నివేదించి హెచ్చరించాలని మారువేషంలో బయలుదేరుతాడు. నదిలో నౌకా విహారం చేస్తూ ప్రమాదం పాలైన విరట రాకుమారి ఉత్తరను రక్షిస్తాడు. ఉత్తరాభిమాన్యులు అనురాగ బద్ధులవుతారు. మల్లయుద్ధంలో మత్స్యదేశపు మల్లుల నందరినీ ఓడించిన జీమూతుని భీముడు సంహరిస్తాడు. అతని అనుచరులను నకుల సహదేవులు హతమారుస్తారు. ఇప్పటికీ బెడద తప్పిందని పాండవులు తెప్పరిల్లుకుంటూ వుండగా విరటుని బావమరిది కీచకుడు నగరానికి వస్తాడు. తోబుట్టువు సుధేష్ణ మందిరంలో సైరంధ్రిని చూచి మోహిస్తాడు. ఒంటరిగా సైరంధ్రిని కలుసుకొని కీచకుడు తన ముచ్చట తీర్చమని కోరుతాడు. ఆమె హితవు చెప్పి వెళ్లిపోతుంది. మహారాణి మందిరానికి వచ్చి తన మందిరానికి ఆమెను పంపించమంటాడు. మహారాణి హితబోధను పెడచెవిని పెట్టి పంపించకపోతే మత్స్యరాజ్యం మట్టిపాలు చేస్తానని బెదిరిస్తాడు. సైరంధ్రి అర్జునుని ధైర్య వాక్యాలతో మనసు దిటవుపరచుకొని మహారాణి మందిరానికి వెళుతుంది. మహారాణి విధిలేక సైరంధ్రిని మద్యం కోసం తమ్ముడి మందిరానికి పంపుతుంది. తన మందిరానికి వచ్చిన సైరంధ్రిని కీచకుడు బలాత్కరించబోగా ఆమె తప్పించుకొని విరాటుని కొలువులోనికి వెళుతుంది. కీచకుడు వెంటాడి రాజసముఖంలో ఆమెను అవమానించి, తన కోరిక తీర్చకపోతే బలాత్కరిస్తానని బెదిరించి పోతాడు. ద్రౌపది భీముణ్ణి వంటసాలలో నిష్ఠూరాలాడుతుంది. అర్జునుడు వచ్చి నర్తనశాలకు కీచకుణ్ణి రప్పించి రహస్యంగా చంపమని సలహాయిస్తాడు. ద్రౌపది తిరిగి కీచకుడు కల్సుకొన్నప్పుడు లేనివలపు నటించి, ఒంటరిగా నర్తనశాలకు రమ్మంటుంది. ఆ మాటలు నమ్మి కీచకుడు అర్ధరాత్రి నర్తనశాలకు రాగా, భీముడు కీచకునితో తలపడి చంపుతాడు. ఆ కోపంతో కీచకుని తమ్ములు ద్రౌపదిని సజీవంగా తమ అన్నగారి శవంతో దహనం చేయాలని శ్మశానానికి తీసుకువెళతారు. గంధర్వ రూపంతో భీముడు ప్రవేశించి వారలందరినీ చంపుతాడు. దానితో పట్టణమంతా అట్టుడికినట్టు ఉడికిపోయి ఆ గంధర్వుల కథలు చెప్పుకుంటారు. ఆ మాటలు విన్న అభిమన్యుడు ఆ పంచభర్తృక. ఆ గంధర్వులు ద్రౌపదీ పాండవులేనని అనుమానించి రాజోద్యానానికి వస్తాడు. అక్కడ ద్రౌపదీ తారసిల్లగా నిజం చెప్పమని నిర్బంధం చేస్తాడు. అంతలో అర్జునుడు వచ్చి అభిమన్యునికి నయానా భయానా నచ్చచెప్పి ద్వారకానగరానికి పంపించివేస్తాడు. హస్తినాపురంలో కౌరవులు కీచకుని దుర్మరణ వార్త విని, అతనిని చంపినవాడు భీమసేనుడేనని నిశ్చయించుకుంటారు. విరాటుని గోవులను పడితే వారు బయటకు వస్తారని వారి నియమం భంగమవుతుందని తేల్చుకొంటారు. దక్షిణాన సుశర్మ, ఉత్తరాన కురువీరులందరితో గోగ్రహణం చేయాలని బయలుదేరుతాడు రారాజు. సుశర్మ దక్షిణ గోగ్రహణం చేసిన వార్త విని విరటుడు. పాండవులతో (అర్జునుడు మినా) గోవులను విడిపించటానికి వెళతాడు. ఉత్తరుడొక్కడే అంతఃపురంలో వుంటాడు. అప్పుడు ఉత్తర గోగ్రహణ వార్త వస్తుంది. మగవారు సారథ్యానికి లేనందున బృహన్నల రూపంలో వున్న అర్జునుని రథ సారథ్యానికి తీసుకొని ప్రగల్భాలు పలుకుతూ ఉత్తర కుమారుడు కురుసేన మీదికి వెళతాడు. ఆ సైన్యాన్ని చూడగానే ఉత్తరుడికి భయం పుడుతుంది. అర్జునుడు ధైర్యం చెప్పి శమీవృక్షం మీది గాండీవం తీసుకొని కౌరవుల మీదికి రథం నడిపిస్తాడు ఉత్తరునిచేత. ఆ యుద్ధంలో అర్జునుడు దుర్యోధనాది కురువీరులను జయించి కురు వద్ధులను, సైన్యాన్ని సమ్మోహనాశాస్త్రంలో నిద్రపుచ్చి గోవులు మళ్లించుకు వెళతాడు. కౌరవులు సిగ్గు పడుతూ హస్తినాపురానికి కదులుతారు. ఉత్తరుని వల్ల ఈ మహావిజయం కలిగించింది తమ కొలువులో నాట్యాచారుడుగా ఉన్న అర్జునుడేనని - అర్జునుని వల్ల మిగతా పాండవులూ, ద్రౌపదీ వివరాలు తెల్సుకొని, కృతజ్ఞతాచిహ్నంగా, విరటుడు తన కూతురు ఉత్తరను మీయింటి కోడల్ని చేసుకోమని పాండవులను అర్థిస్తాడు. సుభద్ర, శ్రీకృష్ణుడు వచ్చి ఉత్తరాభిమన్యుల వివాహం జరిపిస్తాడు. ■

# ఔను.. మళ్లీ... శాంతాకే DSIR అవార్డు..!

2003 సంవత్సరానికి బయోటెక్నాలజీ రంగంలో ప్రతిష్ఠాత్మకమైన **డి.ఎస్.ఐ.ఆర్. అవార్డు** గెలుచుకోవడంతో, ఈ అవార్డును రెండుసార్లు పొందిన ఘనత శాంతా బయోటెక్నిక్స్‌కు దక్కింది!



నవంబరు 10, 2003న ఢిల్లీలో కేంద్ర ప్రభుత్వ శాస్త్ర సాంకేతిక శాఖ సహాయమంత్రి శ్రీ బి.ఎస్.రావత్ నుంచి **DSIR** అవార్డు-2003 అందుకుంటున్న శాంతా బయోటెక్నిక్స్ మేనేజింగ్ డైరెక్టర్ శ్రీ వరప్రసాద్ రెడ్డి.

1999లో తమ ప్రథమ ఉత్పాదన శాన్‌వాక్-బి (హెపటైటిస్-బి వ్యాక్సిన్)తో తొలి నేషనల్ టెక్నాలజీ అవార్డును, DSIR అవార్డును గెలుచుకుని స్తబ్దంగా ఉన్న బయోటెక్ సరోవరంలో శాంతా సృష్టించిన తరంగాలు ప్రాణరక్షక ఔషధాలను సామాన్యుడి ముంగిటికి చేర్చాయి.

బ్లడ్ కాన్సర్ (సి.ఎమ్.ఎల్), కిడ్నీ కాన్సర్ (ఆర్.సి.సి.) క్రానిక్ వైరల్ హెపటైటిస్ ఇత్యాది రోగాల చికిత్సలో రోగనిరోధకశక్తిని పెంపొందించే ఇంటర్‌ఫెరాన్ ఆల్ఫా-2బి ను తొలిసారిగా దేశీయ వైజ్ఞానిక పరిజ్ఞానంతో రూపొందించి, తయారుచేసి "శాన్‌ఫెరాన్" పేరుతో ప్రవేశించిన ఏడాదిలో మార్కెట్‌లో 20 శాతం కైవసం చేసుకున్న విజయం శాంతాదే!

శాస్త్ర పరిశోధనా ఫలితాలను పారిశ్రామిక రంగానికి అందించగలిగే ప్రతిభకు గుర్తింపుగా డిపార్టుమెంట్ ఆఫ్ సైంటిఫిక్ & ఇండస్ట్రియల్ రిసెర్చ్ (DSIR) ఏటా యిచ్చే అవార్డుకుశాంతా బయోటెక్‌ను ఎంపిక చేసిన కారణమూ అదే!

## శాన్‌ఫెరాన్ ప్రత్యేకతలు

- మానవశరీర నిర్మాణానికి సన్నిహితంగా ఉండే ఈస్టు ప్రక్రియ నుపయోగించి నాణ్యతను గణనీయంగా పెంచడం
- దిగుమతి చేసుకున్న ఇంటర్‌ఫెరాన్ల కంటె మూడవ వంతు ధరకే అందించి కాన్సర్ చికిత్సపై లక్షలాది ఖర్చు తగ్గించడం

**సాంకేతికంగా తలమానికం - సామాన్య కుటుంబాలకు ఉపశమనం**

**పరిశోధనే ఆలంబనగా సాగే శాంతా ఉత్పాదనలకే ఇది సాధ్యం!**

